

# విష్ణు కథ

పాలసముద్రంలో ఉన్న త్రికూటపర్వతానికి ఇనుము, వెండి, బంగారాల మూడు శిఖరాలు; ఆ శిఖరాల నడుమ ఫలవృక్షాలతో నిండిన మహారణ్యం. ఆ వనంలో గజేంద్రం అనే మదపుటేనుగు తన భార్యలైన దశలక్షకోటి ఆడ ఏనుగులతో విహరిస్తూ దాహం తీర్చుకోడానికి మహావనం మధ్యనున్న సరోవరానికి బయలుదేరింది.

దాహం తీరాక జలవిహారంపై బుద్ధి పుట్టి, తన ఆడ ఏనుగులతో సరోవరాన్ని అల్లకల్లోలం చేస్తూ విజృంభించి జలకేళిలో లీనమై ఉన్న గజేంద్రాన్ని, గొప్ప మొసలి కోరలు గుచ్చి ముందరి కుడి కాలు పట్టుకొన్నది.

బాధతో గజేంద్రం చేసిన ఘీంకారానికి ఆడ ఏనుగులు బెదిరి చెల్లాచెదరుగా సరోవరం చుట్టూరా ఒడ్డు చేరుకొని, గజేంద్రం పడుతూన్న బాధ చూసి ఏడుస్తూ నిలబడ్డాయేగాని, మొసలి పట్టునుండి ఎలా తప్పించాలో వాటికి తోచలేదు.

గజేంద్రం మొసలి బారినుండి తప్పించుకోడానికి ఎన్ని ప్రయత్నాలు చెయ్యాలో అన్నీ చేస్తూ తల్లడిల్లిపోసాగింది. ఏనుగులు శోకాలు పెడుతూనే, ఆకలి తీర్చుకుంటూ, వేరే జలాశ్రయాలకు వెళ్ళి నీరు తాగి వస్తూపోతూ సరోవరం చుట్టూ తిరుగుతూ కన్నీరు కారుస్తున్నాయి. సరోవరంలో కరిమకరాల పోరాటం సాగుతూనే ఉన్నది.

1. ఆదిమూలావతారం




ఏనుగు దంతాలతో మొసలిని పొడిచేది. మొసలి ఎగిరి మీదపడి ఏనుగు శరీర మంతా రక్తధారలు కారేట్లుగా వాడి గోళ్ళతో రక్కేది.

ఏనుగు తొండంతో మొసలి వీపు బాదేది. మొసలి కరుకుల తోకతో ఏనుగును ఎడా పెడా కొట్టేది.

ఏనుగు మొసలి మీద పడి నాలుగు కాళ్ళతో కుమ్మేయాలని చూస్తే, మొసలి నీటి అడుగున దాగి ఉండేది. ఏనుగు ఎంతకూ మొసలి జాడ లేకపోవడం చూసి ఒడ్డు చేరబోతూంటే, తటాలున మకరం ఏనుగును పట్టుకొని లాక్కుపోయి నీట ముంచేది. అలాగ ఎన్నిసార్లో ఏనుగును ముప్పతిప్పలు పెట్టింది. ఏనుగుకూ మొసలికీ నిర్విరామంగా పోరాటం వెయ్యి సంవత్సరాలు సాగింది.

గజేంద్రం స్వశక్తిని నమ్ముకొని ఎంత సాహసించి పోరాడినా క్రమక్రమంగా శక్తి సన్నగిల్లింది. మొసలి జలగ్రహం! నీటిలో దాని బలం ఎక్కువ. ఏనుగు రక్తం పీలుస్తూ అది మరింత బలంతో బాగా ఒళ్ళు పెంచింది. ఏనుగు బొమికలతో మిగిలింది. మొసలి పట్టునుండి మోక్షం పొందడం మరింక దానికి సాధ్యం కాదు!

''దాహం తీర్చుకోడానికి ఈ సరోవరానికి నేరక వచ్చాను. దాహం తీర్చుకొని వెళ్ళిపోకుండా సరస్సులో ఎందుకు దిగాను? నా పాడు బుద్ధే నన్ను మొసలికి పట్టి ఇచ్చింది!'' అంటూ గజేంద్రం చింతించడం మొదలు పెట్టింధి.

''నన్నెవరు రక్షిస్తారు? ఎవరిని పిలవాలి? నన్ను నేను రక్షించుకోలేని స్థితిలో ఉన్న నా మనస్సులో ఏ మూలనో నేను కాపాడబడగల అవకాశం ఏదో ఉన్నదనే ఆశ! ఆ ఆశవల్లనే రక్షణ కోరుకుంటున్నాను! అంటే నా ఆశకు ఆధారం ఏదో ఉండి తీరాలి! అదే దేవుడని పిలుస్తున్నాను!



దేవుడు, భగవంతుడు, ఈశ్వరుడు అనే భావనకు ఆదిమూలమైన ఓ దేవుడా! కారణాలన్నిటికీ నువ్వే కారణానివి!

నాలాంటి మదగర్వితులైన మంద మదమతి జీవులు ఆపద రాసంతవరకు నిన్ను తలచవరు! బాధపడితేనేగాని నీ అవసరం బోధపడదు. ఉన్నాడు ఉన్నాడు అనేవాడు ఉన్నాడో, లేడో అనే ఆందోళన పడందే నువ్వు కనిపించవు!'' అని పరిపరి విధాల చింతనలో పడ్డ గజేంద్రానికి మొసలి పెడుతున్న బాధ కొంత తగ్గినట్లు అయింది.

ఎప్పుడైతే గజేంద్రుడు చింతన మొదలు పెట్టాడో, ఆ క్షణంలోనే మొసలి కోరల కుదుళ్ళలో సలుపు పుట్టింది, గుండె దడ చురుక్కుమనిపించింది. అయినా అది మరింత రోషంతో గజేంద్రం కాలిని నొక్కి, నొక్కి పిప్పి చేస్తూనే ఉన్నది.

''జీవుల చెడ్డనూ, బాధనూ హరించే వాడివి! అంతటా ఉండేవాడివి, వ్యాపిస్తూనే ఉండేవాడివి!

దేవుళ్ళకు మూలమైన దేవుడా! ఈ జగత్తు జనించే హేతువుకి నువ్వే మూల హేతువు! నన్ను రక్షించమని ఎంత బలంగా నిన్ను కోరుతానో అంత వేగంగా నన్ను నీవు రక్షించుతావని నమ్ముతున్నాను, రక్షించితీరగలవు!

అన్నీ నువ్వే అవుతూ మాటకూ, మనస్సుకూ అందనివాడివిగా ఉండే ఓ సర్వేశ్వరుడా! నాలాంటి దీనులను ఆదుకొనే బాధ్యత నీదే కదా!

జీవశక్తులన్నీ నశించిపోయిన నాలో, ఇప్పుడు కన్నీరు హరించిపోయింది. నిన్ను ఎలుగెత్తిపిలవలేను సరికదా, నా నుండి చిన్న మూలుగు కూడా రాదు, స్పృహ కూడా తప్పుతున్నది.

నన్ను రక్షించినా మానినా అంతా నీ యిష్టం! నీవు తప్పితే నాకు యింకేదిక్కూ, ధ్యాసా లేదు!'' అంటూ గజేంద్రుడు శక్తినంతా కూడదీసుకొని తొండాన్ని ఎత్తి పిలుస్తున్నట్లుగా తిన్నగా చూశాడు.



మొసలికి బలం తగ్గిపోతున్నదని పించింది, నోరు జారుతున్నట్లు, కంఠం బిగుసుకుంటున్నట్లు తోచింది.

తాను ఉన్నదీ లేనిదీ తెలియని స్థితిలో ఏనుగు కళ్ళు మూత పడుతూంటే, అలాగే ఏ మాత్రం చలనం లేకుండా ఉండిపోయింది.

అప్పుడు విష్ణువు వచ్చాడు.

ఆకాశమంతా అతని రూపంతో నిండి పోయింది. తానొక సూక్ష్మమైన అణువును అని గజేంద్రానికి అనిపించింది.

వస్తూనే విష్ణువు చేతనున్న చక్రాన్ని విడిచాడు. అభయముద్రగా పతాక హస్తం పట్టాడు.

ప్రచండ వేగంతో గిర్రున తిరుగుతూ వచ్చి విష్ణుచక్రం మొసలి తల నరికింది.

మొసలి ఒక గంధర్వుడు. హుహూ అనేది అతడి పేరు. దేవలుడు అనే ఋషి నీటిలో నిల్చుని ఉండగా నీటిలోంచి కనపడకుండా వెళ్ళి మొసలిలాగ, ఋషి కాలు పట్టుకున్నాడు. ఋషి ఆ గంధ ర్వుణ్ణి మొసలిగా పడి ఉండు అని శపించాడు. విష్ణు చక్రంతో ఆ శాపం తీరింది.

మొసలి బారినుండి విముక్తి పొందిన గజేంద్రాన్ని సరస్సు నుండి వెలుపలికి లాగి విష్ణువు అరచేత్తో దాని కుంభస్థలాన్ని నిమిరాడు. ఆ స్పర్శకు గజేంద్రం పోయిన జవసత్వాల్నీ, శరీరపుష్టినీ తిరిగిపొందింది, పూర్వజన్మ జ్ఞానం కూడా కలిగింది.

గజేంద్రం వెనకటి జన్మలో విష్ణుచింతనా తత్పరుడైన ఇంద్రద్యుమ్ను డనే మహా రాజు. విష్ణుధ్యానంలోవున్న అతను అగస్త్య మహర్షి రాకను గమనించ లేదు. ఋషి కోపగించి మదగజమై పుట్టుదువు గాక అని శపించాడు. ఆ రాజే గజేంద్రంగా పుట్టి మోక్షణపొందాడు.

గజేంద్రమోక్షణ కథను సూతమహర్షి నైమిశారణ్యంలో జరుగుతున్న సత్రయా గానికి వచ్చిన శౌనకాది మునులకు చెప్పాడు.

మునులు సూతుడితో, "మునీంద్రా! గజేంద్రమోక్షణ కథ కేవలం ఒక ఏనుగుకు చెందినదిగా లేదు, జీవకోటి అంతకూ ముఖ్యంగా అనేక బంధాలతో బాధలో చిక్కుకుని సతమతమయ్యే మానవజీవికి వర్తించే కథలాగ వున్నది," అని అన్నారు.



సూతుడు, "ఔను, గజేంద్రమోక్షం అంతరార్థంతో కూడినదే! ఎవరు ఎలాగ అన్వయించుకున్నా సరిపోతుంది. కాలం విష్ణువు అధీనంలోనే ఇమిడి వున్నది. కాలచక్ర భ్రమణంలో ఎన్నో సమస్యలూ, కష్టాలూ సమసిపోతూంటాయి," అని చెప్పాడు.

మునులు, "మునివర్యా! గజేంద్ర మోక్షాన్నిబట్టి కారణకారణుడు, సర్వేశ్వరుడు విష్ణువు అని తెలుస్తున్నది. అటువంటి విష్ణుకథను పూర్తిగా వినాలని ఉవ్విళ్లూరుతున్నాం. నీ ముందు మేము పిల్లలవంటి వాళ్ళం. కనుక విష్ణువును గూర్చిన విశేషాలన్నీ మాకు సులభంగా బోధపడేలాగ వినిపించ ప్రార్థిస్తున్నాం. వ్యాసమహర్షి వలన సమస్త పురాణాలనూ ఇతిహాసాలనూ, వాటిలోని విశేషార్థాలనూ ఎరిగిన నీవు ఒక్కడివే మమ్మల్ని కృతార్థుల్ని చేయగలవు!" అని అన్నారు.

సూతుడు వారి మాటలకు సంతసించి, "అలాగే విందురుగాని. వ్యాసమహర్షి విష్ణువును గురించిన అనేక లీలావతార విశేషాంశాలతో ప్రత్యేకంగా మహాభాగవతాన్ని రచించి, తనకుమారుడైన శుకునికి బోధించాడు. విష్ణుకథను విని తరింపగోరిన పరీక్షిత్తు మహారాజుకి శుకయోగి దాన్ని చెప్పాడు. గజేంద్రాన్ని రక్షించ వచ్చిన విష్ణువు అవతరణ 'ఆదిమూలావతారం' అని పేర్కొనబడింది.

విష్ణువు అనేక అవతారాలు ఎత్తాడు. వాటిలో పరిణామ దశలను అనుసరించే దశావతారాలు అనబడే పది అవతారాలు ముఖ్యమైనవి.

నారము అంటే నీరు. నీటికి మూలమైనవాడు కనుకనే విష్ణువు నారాయణు




డైనాడు. నారాయణుడి నుండి నీరు పుట్టింది. నీటినుండి జీవం పుట్టింది. విష్ణువు జలచరమైన చేపగా అవతరించాడు. అదే మత్స్యావతారం! దశావతారాల్లో మత్స్యావతారం మొదటిది.

విష్ణువు నీటితో నిండిన నీలమేఘం రంగులో ఉంటాడు. మేఘంలో మెరుపు వున్నట్టే విష్ణువు తేజోమయుడు. అతని నుండి వచ్చిన జలం కూడా తేజస్సుతో నిండి తెల్లని వెలుగు చిమ్ముతూంటుంది. ఆ జలమే కారణోదక క్షీరసాగరం!

క్షీరసాగరంలో అనంతమైన కాలం శేషసర్పం రూపంతో చుట్టలు చుట్టుకొని ఉంటుంది. శేషువుకి వెయ్యి పడగలు. చివర అంటూలేని శేషువుపై శేషశాయిగా విష్ణువు పవ్వళించి వుండగా, అతని బొడ్డు నుండి నాళంతో గొప్పపద్మం పైకిలేచింది. ఆ పద్మంలో బ్రహ్మ ఆవిర్భవించాడు. బ్రహ్మ అన్నిటినీ సృజించాడు.

అనంతమైన కాలం యుగాలుగా సాగుతూంటుంది.

కృత - త్రేతా - ద్వాపర - కలియుగాలు కలసి ఒక మహాయుగం.

వెయ్యి మహాయుగాలు కలిసి ఒక కల్పం. కల్పం బ్రహ్మకు ఒక పగలు. పగలు పూర్తికాగానే అతనికి నిద్ర ముంచుకొస్తుంది. అదే కల్పాంతం. అప్పుడు అంతటా గాఢాంధకారం అలుముకొంటుంది. విష్ణువు నుండి వెలువడిన సంకర్షణాగ్ని వేడిమి అన్నిటినీ మాడ్చివేస్తుంది. పెనుగాలులు వీస్తుంటే కారుమేఘాలు గుంపులు గుంపులుగా ఏనుగుతొండాల్లాంటి జలధారలు ఎడతెరిపి లేకుండా కురుస్తాయి. మహాసముద్రం ఆకాశాన్నంటి పొంగుతుంది. భూ, భువర్, స్వర్లోకాలు మునిగి పోతాయి. ఎటు చూసినా జల బీభత్సం తప్పితే మరేమీవుండదు. ఆ విధంగా ప్రళయం సంభవిస్తుంది. బ్రహ్మ నిద్రపోయే రాత్రి అంతా ప్రళయకాలం!

అది కల్పాంతం దగ్గిరవుతూన్న సమయం:

సత్యవ్రతుడు అనే రాజర్షి నదిలో స్నానం చేసి నారాయణ ధ్యానం చేసి, అర్ఘ్యం యివ్వబోయేటప్పుడు, అతని దోసిట్లోకి బంగారం రంగులో వున్న చిన్న చేప వచ్చింది. సత్యవ్రతుడు దాన్ని నదిలో విడిచిపెట్ట బోతూంటే, ఆ చిన్నారి చేప, "ఓ రాజా! మా చేపజాతి మంచిదికాదు. చిన్న చేపల్ని పెద్ద చేపలు మింగేస్తాయి. వాటి నుంచి తప్పించుకున్నా, జాలర్లు వలపన్ని పట్టి చంపుతారు. అందుచేత, నీ రక్షణకోరి నీ దోసిలిలోకి వచ్చాను. నిర్దయగా నన్ను విడిచిపెట్టకు!" అని పలికింది.

సత్యవ్రతుడు చేపను తన కమండలంలో వుంచి తన నగరికి తీసుకు వెళ్ళాడు. సత్యవ్రతుడు మహారాజుగా రాజ్యపాలన చేస్తూనే గొప్ప తపస్సుచేసిన రాజఋషి. విష్ణుభక్తి తత్పరుడు, గొప్ప జ్ఞానసంపన్నుడు.

కమండలంలో ఉంచిన చేపపిల్ల, మర్నాటికే నిండుగా పెరిగి ఉక్కిరిబిక్కిరవుతూ, "రాజా! నన్ను ఇందులోంచి తీసి, కాస్త పెద్ద చోటులో చేర్చు!" అంటూ ఆర్తనాదం చేసింది.

ఆ చేపను పెద్ద నీటి తొట్టెలో విడిచిన కొద్దిసేపటికే చేప ఎదిగి అది కూడా చాలకపోగా, సత్యవ్రతుడు దాన్ని చిన్న మడుగులో వేశాడు. చేప పెరిగిపోతూనే ఉంది. మడుగు నుండి పెద్ద సరోవరానికీ, సరోవరం నుండి మహాజలాశ్రయానికీ చేర్చినా, అలా పెరిగిపోతూన్న మహామత్స్యాన్ని సముద్రానికి చేర్చగా, "ఓ రాజర్షీ! నీ రక్షణ కోరిన నన్ను సముద్రంలో వదిలిపోతావా? ఇది న్యాయమేనా? మొసళ్ళు, తిమింగలాలు నన్ను మింగవా?" అని మత్స్యం నిలదీసి అడిగింది.

సత్యవ్రతుడు, "ఓ మహామీనమా! ఇంతకంటే నేను చేయగల్గిందేముందో నువ్వే చెప్పు! క్షణానికి శత యోజనాలు పెరిగేలా ఉన్న నిన్ను ఏదీ మింగలేదు కదా!" అన్నాడు.






సత్యవ్రతుని మాటలు విని చేప సముద్ర మధ్యానికి చేరి, మహాపర్వతంలాగ సాగరం పొడవునా పెరిగి, "సత్యవ్రతా! నీ వాక్కు అమోఘంగా పని చేసింది, చూశావా! ఇంకా పనిచేస్తూనే ఉంది. ఇలా ఇంకా, ఇంకా పెరిగిపెరిగి ఏమైపోతానో!" అన్నది.

అప్పుడు సత్యవ్రతుడు చేతులెత్తి మ్రొక్కుతూ, "మత్స్యరూపంలో ఉన్న ఓ నారాయణుడా! రక్షణ కోరుతున్నట్టే వచ్చి, నన్ను రక్షించడానికే మత్స్యావతారం ఎత్తావు. నీ లీలలు తెలుసుకోవడానికి నేనే మాత్రం!" అంటూ ఎన్నో విధాల స్తుతించాడు.

అప్పుడు మత్స్యావతారంలో ఉన్న విష్ణువు, "ఓ రాజా! ఏడు దినాలకు కల్పాంతం కాబోతున్నది. ప్రళయ జలాల్లో అంతా మునిగిపోతుంది. జ్ఞానం, ఓషధులు, విత్తులు నశించకూడదు. ముందొచ్చే కల్పానికి అవి లేకపోతే ఎలాగ? అందుచేత అవి రక్షింపబడాలి. నీ కోసం పెద్ద నౌక గాఢాంధకారంలో దీపంలాగ వెలుగుతూ వస్తుంది. అందులో సప్తర్షులు ఉంటారు, ఆ వెలుగు వారిదే!

ఓషధుల్నీ, విత్తనాల రాసుల్నీ, నీతో బాటు నౌకలోకి చేర్చు! నా మీద ఉండే కొమ్ము చివరతో, మీరుండే నావను పట్టి ఉంచి మునిగిపోకుండా అన్ని విధాలా నేను రక్షించుతూ ఉంటాను. అందుకే నేను యిలాగ అవతరించాను. బ్రహ్మ మేల్కొంచేవరకూ నావ ధ్రువుణ్ణి దిక్సూ

2. మత్స్యావతారం



చిగా పెట్టుకొని పయనిస్తూంటుంది. రాబోయే కల్పంలో నువ్వు వైవస్వతుడు అనే పేరున మనువుగా ఉంటావు!'' అని ఆదేశించాడు.

సత్యవ్రతుడు విష్ణువు ఆనతిని తల దాల్చి వినమ్రుడై మ్రొక్కాడు.

మత్స్యావతారం నాలుగు రెక్కలు ఊపుతూ, తోకతో త్రుళ్ళగొడుతూ, ఉవ్వెత్తున లేస్తున్న కెరటాలను చీల్చుకొని, సముద్రంలోకి వెళ్ళింది.

బ్రహ్మ మంచి నిద్ర తీస్తున్నాడు. అంధకారంలో విలయకాండ జరుగుతూన్నది.

హయగ్రీవుడు అనబడే సోమకాసురుడు తలాతలం నుండి సముద్రం మీదకు వచ్చి గబ్బిలంలాగ బ్రహ్మ ఉండే సత్యలోకానికి ఎగిరాడు.

నిద్ర వచ్చి బ్రహ్మ ఆవులిస్తున్నప్పుడు, అతని నాలుగు ముఖాల నుండి తెలుపు, ఎరుపు, పసుపు, నీలం రంగుల్లో ప్రకాశిస్తున్న నాలుగు వేదాలు వెలుపలికి వచ్చి పక్కనే పడి ఉన్నాయి. హయగ్రీవుడు వాటిని తస్కరించుకొనిపోయి, సముద్రం అట్టడుగు శిలల పొదల్లో దాచాడు.

హయగ్రీవాసురుడు దేవతలకు, విష్ణువుకు ప్రబల విరోధి. వేదాలు లేకుండా బ్రహ్మ సృష్టి చేయలేడు. కల్పకల్పానికీ మంచినీ, ప్రగతినీ పెంపొందించాలనే విష్ణువు సంకల్పం చెడగొట్టడమే వాడి ఉద్దేశం.

ప్రళయ సముద్రం భూమిని ముంచుతున్న సమయంలో, ఎదురు చూస్తూన్న సత్యవ్రతుడికి అంధకారంలో దూరంగా చిన్న వెలుగు, చుక్కలా కనిపించి పెద్దదౌతూ సమీపిస్తున్నది; అదే సప్తర్షుల కాంతితో నిండిన నావ!

ఓషధులనూ, నానావిధ బీజ సంపదనూ నౌకలోకి చేర్చి సత్యవ్రతుడు నారాయణ సంకీర్తనం చేస్తూ నావలో ప్రయాణిస్తున్నాడు. మత్స్యావతారం ముక్కుపై నిలువుగా పెద్ద కొమ్ము ఉంది. నక్షత్రంలాగ మెరుస్తున్న ఆ కొమ్ము



చివరను చుట్టుకొని ఒక మహాసర్పం పెద్ద త్రాటితో కట్టినట్లు ఓడను కలిపి పట్టుకొని, పడగవిప్పి ప్రళయ ప్రభంజనాలను పీల్చి దిగమింగుతూన్నది. మత్స్యావతారం తన రెక్కలతో కెరటాలను తూలగొడుతూ సముద్రాన్ని చీల్చుకొని, నావను భద్రంగా తీసుకెళుతూన్నది. ధ్రువతార గుర్తుగా నౌక పువ్వులాగ తేలుతూ పయనిస్తూన్నది.

సముద్రం అడుగున దాచిన వేదాలను కాపలా కాస్తూ సోమకాసురుడు సముద్రం లోపల తిరుగుతున్నాడు. నాలుగు వేదాలు నలుగురు శిశువులుగా మారి క్యారు మంటూన్న ఆర్తనాదం లీలగా వినవస్తున్నది.

మత్స్యావతారం వేదాలను వెతుకుతూ వెళ్ళింది.

మహామత్స్యాన్ని చూసి సోమకాసురుడు భీతిల్లుతూనే మొండి ధైర్యంతో ముళ్ళ గద నెత్తి ఎదుర్కొన్నాడు.

అప్పుడు విష్ణువు నడుము వరకు మత్స్యంగా చతుర్బాహువులతో అవతరించాడు. మత్స్యమూర్తికీ, సోమకాసురుడికీ ఘోరసంగ్రామం జరిగింది.

సోమకాసురుడు సముద్రం అట్టడుగు చేరి పారిపోతూంటే విష్ణువు చక్రంతో వాణ్ణి ముక్కలు ముక్కలుగా నరికి హత మార్చాడు.

విష్ణువు పసిబిడ్డల రూపంలో ఉన్న వేదాలను ఎత్తుకొని, ఇద్దరేసి పిల్లల్ని చెరో సందిట చేర్చుకొని నీటి మీదికి వచ్చాడు. పిల్లలు విష్ణువు కంఠహారంలోని శ్రీవత్స, కౌస్తుభ మణులను చిట్టి చేతులతో ఆడుకుంటూ కిలకిలా నవ్వుతూ కేరింతాలు కొడుతున్నారు. నలుగురు పిల్లలూ తెలుపు, ఎరుపు, పసుపు, నీలం కాంతితో మెరుస్తున్నారు. విష్ణువు మీది చేతుల్లో శంఖచక్రాలు ప్రకాశిస్తున్నవి.

విష్ణువు మత్స్యావతార మూర్తిని చూసి ఋషులు, సత్యవ్రతుడు మహదానందంతో మైమరిచి చేతులెత్తి మ్రొక్కుతూ స్తోత్రం చేశారు. ప్రళయ సముద్రం



శాంతించి భూభాగం ఏర్పడుతూన్నది; నౌక గమ్యం చేరుకొంది.

బ్రహ్మకు పగటి ప్రమాణం ఎంతో రాత్రీ అంతే. అతని నిద్రాకాలం పూర్తి కావస్తున్నది. సరికొత్త కల్పం ఆరంభమౌతూన్నది.

సరస్వతీదేవి ముందుగా లేచి వీణ సవరించి భూపాలరాగాన్ని పలికిస్తూన్నది. బ్రహ్మ మేలుకొని నాలుగు తలల్లో ఏదో కలత, వెలితి అనిపించి పరికించి చూస్తే వేదాలు లేవు! వేదాలు పోగొట్టుకొని దిగులుగా ముఖాలు వేలాడదీసుకుని విచారిస్తుండగా, విష్ణువు మత్స్యావతారంతో వేదాలను తెచ్చి అతనికి యిచ్చాడు.

బ్రహ్మ విష్ణువు మత్స్యావతార రూపాన్ని కన్నుల పండుగగా తిలకించి చేతులు జోడించి నాలుగు నోళ్ళతో కీర్తించాడు.

"ఓ నారాయణా! నీ మత్స్యావతారాన్ని ధ్యానించిన వారికి ప్రళయంలాగ విరుచుకు వచ్చిన ఆపదలన్నీ తొలగిపోతవి. అజ్ఞానాంధకారం పటాపంచలౌతుంది!" అని బ్రహ్మ అన్నాడు.

మత్స్యావతారం ఎత్తిన కార్యం పూర్తిగా నెరవేరింది. విష్ణువు అంతర్థానమై, తన నివాసమైన వైకుంఠాన్ని చేరాడు.

బ్రహ్మ వేదాలు తీసుకొని సృష్టి మొదలుపెట్టాడు. కొత్త కల్పానికి వివస్వంతుడనే పేరున ఉదయించిన సూర్యుడికి పుత్రుడుగా సత్యవ్రతుడు శ్రార్ధదేవుడు–వైవస్వతుడు అనే పేరున మనువైనాడు.

సప్తఋషులు ఆకాశానికి చేరుకొని తమ తమ స్థానాల్లో సప్తర్షిమండలంగా ప్రకాశిస్తూ ధ్రువునికి ప్రదక్షిణం చేస్తూ, తిరగసాగారు—అని సూతుడు చెప్పగా మునులు, "సూత మునీంద్రా! ధ్రువుని చరిత్ర వినగోరుతున్నాము!" అన్నారు.

సూతుడు చెప్పసాగాడు:

ఈ మహా విశ్వంలో ఉన్నతోన్నతమైన స్థానమే ధ్రువమండలం. అదే విశ్వస్వరూపుడైన విష్ణువు శిరస్సుండే తావు.



అంతటి అత్యున్నత పదాన్ని పొందిన ధ్రువుడు ఉత్తానపాదుడు అనే రాజు కొడుకు. ధ్రువుడి తల్లి సునీతి ఉత్తానపాదుటి పెద్ద భార్య. సురుచి చిన్న భార్య. రాజుకు చిన్న భార్య సురుచి మీద మక్కువ ఎక్కువ.

ఒకనాడు ఉత్తానపాదుడు సురుచి కొడుకు ఉత్తముణ్ణి తన తొడపై కూర్చొబెట్టుకొని ముద్దుచేస్తుండగా, ధ్రువుడు అక్కడకు వచ్చి, తాను కూడా తండ్రి తొడపై కూర్చోవాలని తండ్రి దగ్గిరగా చేరి ఆశతో చూశాడు. సురుచి అక్కడే ఉన్నది. రాజు ఆమెకు జడిసి ధ్రువుణ్ణి చూసీచూడనట్టు ఊరుకున్నాడు. తమ్ముణ్ణి కూర్చోబెట్టుకొన్నట్లే తండ్రి తన్ను కూడా ఎత్తి కూర్చోబెట్టుకుంటాడని ఆశించిన ధ్రువుడు బిక్కమొహం వేసి గుడ్ల నీరు పెట్టుకొన్నాడు. పసివాడి బుగ్గలపై కన్నీటి ముత్యాలు మెరిశాయి.

అది చూసి సురుచి ఫక్కున నవ్వి, "దిక్కుమాలిన దానికి పుట్టినవాడా! నువ్వు ఎంత తపస్సుచేసినా, నా కొడుకుతో సమానంగా తండ్రి తొడ మీద కూచునే యోగం నీకు అబ్బదురా, అబ్బీ! నా కడుపున పుట్టాలి; నీకా భాగ్యం కలగాలి! అంతే! అన్నట్టు నువ్వు మహా గొప్పగా నారాయణ సంకీర్తనం చేస్తూంటావేమో, తపస్సు చేసి, ఆ భాగ్యం కల్గిస్తాడేమో ఆ నారాయణుడినే అడిగి చూడు," అని హేళన చేసింది.

పసివాడి మనస్సు కుతకుతలాడింది; దుఃఖం పెల్లుబికింది, ఉక్కురోషం ముంచుకొచ్చింది. కొరడా తీసుకొని సురుచిని చావబాదాలనిపించింది. కత్తితో నిలువునా చీరెయ్యాలనిపించింది. మరుక్షణంలోనే సురుచి, "నాయనా! నారాయణుడిని నమ్ముకో! తపస్సు చెయ్యి." అని ఉపదేశించిన సద్గురువులాగ కనిపించింది. అంతటి మహత్తరమైన ఉపదేశానికి నోచుకొని ఉత్తముడు అభాగ్యుడైన వర్తి అమాయకుడిలాగ కనిపించాడు. ఉత్తాన



పాద మహారాజు చీకటివలలో చిక్కుకొని బిక్కుబిక్కుమంటున్న దుప్పిలాగ కనిపించాడు.

ధ్రువుడు సురుచికి గురూపదేశం పొందిన శిష్యుడిలాగ నమస్కరించి, అక్కడినించి వెళ్ళాడు. ధ్రువుడి చేష్ట అర్థం కాని సురుచి మొదట నివ్వెరపోయింది. తరవాత "కుర్రాడు మంచివాడే! నాలుగు తిట్టినా మొక్కుతూ వెళ్ళాడు. ఐనా మొక్కకేం చేస్తాడు. నా ఎదట నోరు మెదపడం వాడి తరమా? వాడి తల్లి తరమా?!" అని సగర్వంగా తనలో తాను విపరీతంగా పొంగిపోతూ సరిపెట్టుకుంది.

కన్నీటి చారలతో వచ్చిన ధ్రువుణ్ణి చూసి జరిగింది దాసీలవల్ల విన్న సునీతి బావురుమంటూ, "ఔను, నాయనా! దాసీ దానికన్న హీనంగా బతుకుతున్న నా కడుపున ఎందుకు నువ్వు పుట్టాలి? నలుగురెదుట అవమానపడాలి? నీ సవతి తల్లి మాటలు ముమ్మాటికీ నిజం. నీకూ నాకూ ఆ నారాయణమూర్తి తప్ప వేరే దిక్కులేదు!" అన్నది.

ఆ మాటలకు ధ్రువుడు ధైర్యంగా లేచి నిలబడి, "అమ్మా! నేను తపస్సుకి వెళ్తున్నాను!" అన్నాడు.

"ఏమిటీ! తపస్సు చేస్తావా? సురుచి కడుపున పుట్టాలని వరంకోరుకో!" అన్నది సునీతి.

"అమ్మా, ఆగు! మళ్ళీ ఆ మాటే అనకు; నేను నీ కొడుకును. మరెవరికో కొడుకునై పుట్టాలని ఎందుకు కోరతాను? మనల్ని మనం తక్కువ చేసుకోకూడదు. అది ఆత్మహత్యతో సమానం. ధ్రువుడి తల్లి ఎంత భాగ్యశాలి అనేలాగ, దిక్కులకు దిక్కుగా ఉండేలాగ నారాయణుణ్ణి కోరుకుంటాను, వస్తాను!" అని చెప్పి ధ్రువుడు బయలుదేరాడు.

నారదుడు ఎదురుగా వస్తూ, "ఓహో, ధ్రువకుమారా! ఆడుకోడానికి బయలుదేరినట్టుంది, ఔనా?" అన్నాడు.

"తపస్సుకు వెళ్తున్నాను, స్వామీ!" అన్నాడు ధ్రువుడు.

"తపస్సు అనే ఆట ఒకటి ఉందన్న మాట, చక్కగా ఆడుకో నాయనా!" అన్నాడు నారదుడు.

"ఆటకాదు, నిజంగా తపస్సు చేయడానికే వెళ్తున్నాను, మునీంద్రా!" అన్నాడు ధ్రువుడు.

"అదా సంగతి, ఓస్! ఈ మాత్రం దానికి తపస్సెందుకోయి ధ్రువా! నాతో రా, నీ తండ్రి నిన్ను తొడ మీద ఎందుకు ఎక్కించుకోడో చూస్తాను!" అన్నాడు నారదుడు.

"ఎవరి దయాధర్మాలూ నాకు వద్దు, స్వామీ! అన్నిటికంటె ఉన్నతమైన నారాయణుని అనుగ్రహం నాకు కావాలి! అందుకే తపస్సు చేయడానికి అరణ్యానికి వెళ్తున్నాను!" అన్నాడు ధ్రువుడు.

"తపస్సంటే మాటలు కాదు, నాయనా! అరణ్యంలో పులులు, సింహాలు మొదలైన క్రూర మృగాలుంటాయి. ఎండా వానా చలీ అన్నీ బాధగానే ఉంటాయి. నా మాట విను, ఇంటికి పద!" అన్నాడు నారదుడు.

నారదుడి మాటలకు ధ్రువుడు, "నేను క్షత్రియుణ్ణి, పరాభవం సహిస్తూ బతకలేను, నాకు పిరికిమందు నూరిపోయడానికి వచ్చారా, స్వామీ?" అన్నాడు వినయంగా.

"నాయనా, ధ్రువా! నీ దీక్ష తెలుసుకోడానికే అలాగ అన్నాను. ఒకప్పుడు నేను కూడా దిక్కులేని బాలుడనై ఎన్నెన్నో అవమానాలూ, అగచాట్లూ పడి అడవి చేరి తపస్సు చేసినవాడినే! నువ్వు మధువనానికి వెళ్ళి, 'ఓం నమోనారాయణ' అని జపిస్తూ తపస్సుచెయ్యి. నిన్ను ఆశీర్వదిస్తున్నాను, కృతార్థుడివై రా!" అని నారదుడు అన్నాడు—అని సూతుడు చెప్పగా మునులు, "మునీంద్రా! నారదుడు ఎందుకు అగచాట్లు పడ్డాడు? నారదుడి వృత్తాంతం వినాలని కుతూహలంగా ఉంది!" అన్నారు.






సూతుడు నారదుడి గురించి చెప్ప సాగాడు:

ముందు జన్మలో నారదుడు ఒక దాసికి కొడుకై జన్మించాడు. ఆ దాసి ఒక భాగవతోత్తముడి ఇంట పని చేస్తుండేది.

ఆ ఇంట సదా మునులు, జ్ఞానులు అతిథిసత్కారాలను పొందుతూండేవారు. పసివాడైన నారదుడు వారికి అవసరమైనప్పుడల్లా నీళ్ళు అందిస్తూ, సపర్యలు చేస్తూ, వారు మాట్లాడుకొనే గొప్ప గొప్ప విషయాలను, విష్ణుమహిమలను శ్రద్ధగా ఆలకిస్తూండేవాడు. నీరు ఇచ్చేవాడని వారు పసివాడిని నారదుడు అని పేరు పెట్టి, "నారదా!" అని పిలుస్తూండేవారు.

అంతలో అతని తల్లి పాము కాటుతో మరణించింది.

పసివాడికి తండ్రి ఎవరో, ఏమైనాడో తెలియదు.

తోటిపిల్లలు నారదుణ్ణి దాసి దాని కొడుకనీ, దిక్కుమాలినవాడనీ అంటూండేవారు.

కొద్ది రోజులకే ఇంటి యజమాని భాగవతోత్తముడు కూడా గతించాడు.

నారదుడు నిరాశ్రయుడై తిరుగుతూ, ఆకలితో ఏ ఇంటి ముందైనా నిలబడితే అతణ్ణి దొంగను చూసినట్టు చూసి తరిమేవారు.

తండ్రి ఎవరో తెలీని పాపిష్టివాడని తిట్టేవారు.

3. ధ్రువనారాయణావతారం



నారదుడు పరమసాధువు అవడం చూసి దుడుకుపిల్లలు రాళ్ళు రువ్వీ, కొట్టీ, ఏడిపించి ఆనందిస్తూండేవారు.

"నేను ఈ మనుషుల్లో ఎందుకు పుట్టాను ? నేనేం తప్పు చేశానని నన్నింత అన్యాయంగా చూస్తున్నారు ? క్రిమి కీటకాలు, అడవుల్లో మృగాలు హాయిగా బతుకుతున్నాయి !" అని అనుకుంటూ నారదుడు ఊరు విడిచి అడవిపట్టాడు.

అతనికి మునులు, జ్ఞానులు చెప్పుకొనే విషయాలు గుర్తుకొచ్చాయి. "నేనెందుకు తపస్సు చెయ్యకూడదు ! గొప్ప పుట్టుక దేవతల్లో పుట్టాలి !" అని అనుకుంటూ తపస్సు మొదలు పెట్టాడు నారదుడు.

"దిక్కులేనివాడికి ఎవడు దిక్కో, యీ లోకానికంతకూ - ఎవడు తండ్రో అతడే నాకు అన్నీ ! నన్ను అతడేంచేసినా సరే, అంతా అతని ఇష్టం !" అంటూ కాలం గుర్తు లేకుండా ఘోరమైన తపస్సు చేశాడు. నారదుడి తపస్సు పరిపక్వమైంది. అతనిపై గొప్ప తేజస్సు పడి అతణ్ణి ఆవరించింది.

జ్యోతి రూపంలో ప్రసన్నుడైన విష్ణువు, "వత్సా నారదా ! నీవు నాలో కలిసిపోతున్నావు. నీవు బ్రహ్మ మానసపుత్రుడవై జన్మిస్తావు. నీలో నా అంశ వుంటుంది. చిరంజీవిగా త్రికాలవేదివై ముల్లోకాలు తిరుగుతూ సదా నన్ను కీర్తిస్తుంటావు !" అని చెప్పాడు.

నారదుడు విష్ణు అంశతో బ్రహ్మకు కుమారుడై, దేవమునిగా పూజింపబడ్డాడు. విష్ణువు యొక్క లీలావతారాల్లో నారదుని అవతారం ఒకటిగా చెప్పబడింది.

అటువంటి నారదుడి వల్ల ఉపదేశం పొంది ధ్రువుడు చరచరా వెళ్తూంటే, "అన్నా, ఆగు ! అడవికి వెళ్ళొద్దు !" అంటూ పరుగు పరుగున ఉత్తముడు ఏడుస్తూ వచ్చి ధ్రువుడికి అడ్డంగా చేతులు సాచి నిల్చుని, "నువ్వు, అడవికి పోతే నే నెవరితో కలిసి హరిభజన చేసేది ? ఆడించడానికి నీలాంటి అన్నయ్య ఎక్కడ

దొరుకుతాడు? మా అమ్మ, నిన్ను అన్ని మాటలన్నదని, నా మీద నీకెందుకు కోపం? వెళ్ళకు, రా!'' అంటూ వలవలా ఏడ్చాడు.

ధ్రువుడు ఉత్తముణ్ణి కౌగలించుకొని, ''తమ్ముడూ! నన్ను కన్నందుకు మా అమ్మ కూడా గొప్పది అనిపించుకోవద్దా? అందుకే వెళ్తున్నాను!'' అన్నాడు.

ఉత్తముడు, ''అయితే, నేనూ నీతో అడవికి వస్తాను, నువ్వు తపస్సులో ఉంటే నేను పళ్ళు అవీ తెస్తుంటాను!'' అన్నాడు.



ధ్రువుడు, ''అలా అయితే, మీ అమ్మ ఏడుస్తుంది, తమ్ముడూ! నేను అన్నను, నా మాట వినాలి, వెళ్ళు!'' అన్నాడు అప్యాయంగా.

ఆ మాటతో ఉత్తముడు అలాగే చతికిలబడి ఏడుస్తూంటే సురుచి వచ్చి బుజ్జగించబోతే, ''అమ్మా! నన్ను ముట్టుకోకు. నీ మూలాన్నే అన్నయ్య వెళ్ళిపోతున్నాడు!'' అన్నాడు.

సురుచి లజ్జతో తలవంచుకొని, ''నేను పాపిష్ఠిదాన్ని, అంతా నా మూలానే జరిగింది!'' అని అంటూంటే ఉత్తానపాదుడు, ''ధ్రువా! ధ్రువా! అగు, నాయనా! ఇదంతా నా మందబుద్ధి వల్లనే జరిగింది. నా సింహాసనం నీది! రా నాయనా!'' అంటూ ఎలుగెత్తి పిలుస్తూ అక్కడికి వచ్చాడు.

అప్పటికే ధ్రువుడు చాలాదూరం వెళ్ళిపోయాడు.

నారదుడు సునీతితో, ''అమ్మా! నీవు రత్నగర్భవు! నీ కుమారుడి గురించి విచారించకు, నారాయణుడే అతనికి రక్ష!'' అని చెప్పి ఉత్తానపాదుడితో, ''రాజా! ఇది మనం అందరమూ సంతోషించవలసిన సమయం. నీకు తండ్రీ, ధ్రువునికి తాత అయిన స్వాయంభువ మనువు వంశానికి ధ్రువుడు ఎనలేని కీర్తి తెస్తాడు. ఇందులో ఎవరు చేసిందీ ఏమీ లేదు, అంతా ఆ నారాయణుని



సంకల్పమే!'' అని చెప్పి అందరిని ఊరడించి శాంతపర్చాడు.

ధ్రువుడు మధువనంలో ఓం నమో నారాయణ అని తపస్సు చేస్తూంటే యమునానది జల జల పారుతూ శృతి కలుపుతూన్నది. క్రూరమృగాలు అతని చుట్టూ ఆప్తమిత్రుల్లా తిరుగుతున్నాయి. అతని తపస్సుకి ముల్లోకాలు గజ గజ లాడాయి.

ఎవరెక్కడ తపస్సు చేస్తున్నా ఇంద్ర పదవి కోరతారనుకుని భయపడే ఇంద్రుడు ధ్రువుడి తపోభంగానికి భీతికలిగించే ఇంద్రజాలం చాలా చేశాడు. వజ్రాయుధం ఝళిపించి ఉరుములు, మెరుపులు, పిడుగులు రాల్చి బీభత్సం చేశాడు. ధ్రువుడు దేనికీ చలించలేదు. ఇంద్రుడు రాళ్ళ వర్షం కురిపించాడు, విష్ణుచక్రం ధ్రువుడిపై తిరుగుతూ అన్నిటినీ తూలగొట్టింది.

అప్పుడు నారదుడు ఇంద్రుడుతో, ''ధ్రువుడు సామాన్య బాలుడని అనుకున్నావు. అతణ్ణి నువ్వేమీ చేయలేవు. అనవసరంగా బెంగపడకు, ఇంద్రపదవి అతనికి గడ్డిపరక లాంటిది, తెలుసా!'' అని బుద్ధిచెప్పాడు.

ధ్రువుని తపస్సుకి మెచ్చుకొని విష్ణువు ప్రత్యక్ష మయ్యాడు. ధ్రువుడు విష్ణువు కాళ్ళుచుట్టేసి విష్ణువు ముఖాన్ని తదేకంగా చూస్తూ పట్టరాని ఆనందం వల్ల నోట మాట రాకుండా వుండిపోయాడు. ''నిన్ను నోరారా స్తుతించాలని వుంది, నేను బాలుడను, స్తోత్రపాఠాలు తెలియవు.'' అని మనస్సులో అనుకుంటూ ఆనంద బాష్పాలు రాలుస్తున్నాడు.

విష్ణువు తన శంఖాన్ని ధ్రువుడి చెక్కిళ్ళకు తాకించాడు. వెనువెంటనే వేద వేదాంతాల సారంనిండిన గొప్ప స్తోత్రాన్ని ఏకధారగా సామగానం చేశాడు ధ్రువుడు.

విష్ణువు మందహాసం చేస్తూ, ''ధ్రువా, ఏం కావాలో చెప్పు!'' అన్నాడు.

ధ్రువుడు ''ఓ పరమపురుషా! తుమ్మెద పద్మాన్ని అంటిపెట్టుకొని వుండేలాగా సదా

నీ మధుర మందహాసవదన పద్మాన్ని చూస్తూ వుండాలనే తప్ప నాకు, మరే కోరికా లేదు!'' అన్నాడు.

''అలాగే వుందువుగానిలే! నీరాజ్యానికి వెళ్ళి రాజ్యంచేసి ధర్మపాలన నిర్వర్తించు. పిమ్మట నువ్వు నా రూపమైన విశ్వానికి శిరోభాగంగా వుండే ధ్రువపదాన్ని చేరు తావు. కల్పాంతరాలు గతిస్తూన్నా చెక్కు చెదరని అచలపదాన్ని అలంకరించి వెలుగుతూంటావు!'' అని చెప్పి అంతర్ధాన మయ్యాడు విష్ణువు.

ధ్రువుణ్ణి అనుగ్రహించిన విష్ణు అవత రణం ధ్రువనారాయణావతారం అని చెప్పబడింది.



ధ్రువుడుమాహిష్మతీపురానికివచ్చాడు. ఉత్తానపాదుడు అతనికి రాజ్యాన్ని అప్ప గించి తపస్సుకి వెళ్ళిపోయాడు. ధ్రువుడు చక్కగా రాజ్యపాలన చేస్తూన్నాడు.

ఉత్తముడు ఇంకా వివాహితుడు కాలేదు, రాజధర్మం అనుసరించి ప్రజ లకు వన్యమృగబాధ లేకుండా చేయడానికి వేటకు వెళ్ళాడు. హిమాలయ పర్వత అరణ్యంలో దుస్వభావులైన యక్షులు విరుచుకుపడి అతణ్ణి చంపారు.

సురుచి పుత్రశోకంతో అక్కడకు వెళ్లి అరణ్యంలో రగుల్కొన్న కార్చిచ్చులో కాలిపోయింది.

ధ్రువుడు యక్ష నిర్మూలనం చేయ డానికి యక్షనగరమైన అలకానగరాన్ని ముట్టడించాడు. మాయల మారులైన యక్షులు క్షుద్రమైన మాయాజాలాన్ని ప్రయోగించారు. ధ్రువుడు నారాయణా స్త్రంతో మాయల్ని పటాపంచలు చేసి విజృంభించాడు.

కుబేరుడు శరణాగతుడై ధ్రువుణ్ణి మంచి చేసుకుని అనేక సంపదలిచ్చి పంపాడు.

ధ్రువుడు పలువురు కుమాళ్ళను కన్నాడు. ఆదర్శ రాజ్యపాలన చేసి స్వాయంభువ మనువంశానికి కీర్తి తెచ్చాడు. చిరకాలం రాజ్యం చేసి కుమా



రుడికి పట్టం కట్టి ధ్రువుడు బదరికావ నానికి వెళ్ళాడు. విష్ణువును ధ్యానిస్తూ బంగారు శరీరాన్ని పొందాడు.

విష్ణు ఆదేశంతో విష్ణుభటులు విమానం తెచ్చారు. వారు నాలుగు చేతులతో విష్ణువులాగే ఉన్నారు.

ధ్రువుడు వారితో, "మా అమ్మకు లేని ఉన్నతపథం నాకు అవసరంలేదు!" అన్నాడు. విష్ణు దూతలు ముందుగా ఒక దివ్య విమానంలో ధ్రువమండలానికి వెళ్తూన్న సునీతిని చూపించారు. అప్పుడు ధ్రువుడు సంతోషించి విమానం ఎక్కి గ్రహమండలాల్నీ నక్షత్ర మండలాల్నీ సప్తర్షి మండలాన్నీ దాటి ధ్రువపదానికి చేరాడు. ధ్రువపదాన్నే విష్ణుపదము, అనీ ధ్రువక్షితి అనీ అంటారు. విష్ణువు నివాసమైన వైకుంఠము అక్కడే ఉంటుంది. ధ్రువక్షితిలోనే గోలోకము ఉంటుంది. గోలోకములో విష్ణువు రెండు చేతులతో కృష్ణుడుగా ప్రకృతి స్వరూపిణియైన రాధాదేవితో కలిసి వేణువును ఊదుతూ ఆనందిస్తూ ఉంటాడు. గోలోకానికి పైన గొప్ప అంధకారం వ్యాపించి ఉంటుంది. ఆ అంధకారానికి అవతల విష్ణువు వైకుంఠ వాసుడై వెలుగుతూ ఉంటాడు. ధ్రువుడు సదా విష్ణువును చూస్తూ ఉజ్వల కాంతితో ప్రకాశించాడు. గుంజకు కట్టిన ఆవులాగ సప్తర్షి మండలం అతని చుట్టూరా ప్రదక్షిణం చేస్తూంటే, సమస్త నక్షత్ర గ్రహ గణాలతో నిండిన శింశు మార చక్రం అతని క్రిందుగా తిరుగుతూంటుంది.

గోలోకానికి దిగువ బ్రహ్మ ఉండే సత్యలోకము, జనలోకము, మహర్లోకము, స్వర్లోకము, భువర్లోకము, భూలోకము అనే ఊర్ధ్వలోకాలు ఏడూ, భూలోకానికి దిగువ అధోలోకాలనబడే అతల, వితల, సుతల, రసాతల, తలాతల, మహాతల, పాతాళ లోకాలు ఏడూ కలిసి పధ్నాలుగు లోకాలకు మీదుగా విశ్వశిఖరాగ్రంపై ధ్రువుడు దిక్కులకు దిక్కుగా అచలపద నక్షత్రంగా ప్రకాశిస్తున్నాడు.

దీక్ష ఉండాలేగాని, చిన్న పెద్ద అనే తారతమ్యాలు లేకుండా ఎంతటిదైనా సాధించలేనిదంటూ ఉండదు. అందుకు ఐదేండ్ల ప్రాయంలోనే తపస్సుకి వెళ్ళిన బాలధ్రువుడే తార్కాణం! అని సూతుడు ధ్రువచరిత్ర ముగించి తిరిగి చెప్పడం ప్రారంభించాడు:

మత్స్యం కేవలం జలచరమైతే తాబేలు నీటిలోనూ, భూమిపైనా చరిస్తుంది.

నీటిలో నుండి ప్రాణి నేల మీదకు వచ్చింది; అంటే జలచరదశనుంచి భూచరదశకు పరిణామం జరిగిందన్న మాట.

అలాంటి తాబేలుగా విష్ణువు అవతరించాడు. అదే దశావతారాల్లో రెండవదైన కూర్మావతారం! అంటూ సూతుడు మునులకు కూర్మావతారగాథ చెప్పడం ప్రారంభించాడు :

దేవతలు, రాక్షసులు కలిసి క్షీరసాగరాన్ని మధించి, అమృతాన్ని సాధించటానికి తయారయ్యారు.

అమృతం సిద్ధించనీ, అది అంతా మనదే అవుతుంది! అని భుజబలంలోనూ, సంఖ్యలోనూ అధికులైన రాక్షసులు ఎత్తుగడ వేసుకున్నారు.

రాక్షసులకూ అమృతంతో అమరత్వం సిద్ధిస్తే, మనకు ఒరిగేది ఏముంది? అంతా ఆ విష్ణువుదే భారం! అని దేవతలు విష్ణువును నమ్ముకున్నారు.

పాలసముద్రంలో మందరపర్వతాన్ని కవ్వంగా నిలబెట్టి, వాసుకి మహాసర్పాన్ని తాడుగా చుట్టి, చిలకటానికి నిర్ణయం జరిగింది. కాని, మందరపర్వతాన్ని తెచ్చి పాలసముద్రంలో వేయడం ఎవరికీ శక్యం కాని పని! విష్ణువు అనుగ్రహించి, ఆ పని నెరవేర్చి, గిరిధారి అనిపించుకున్నాడు.

రాక్షసులు వాసుకి తలవైపు పట్టుకుంటామని పట్టుబట్టారు. అలాగే ఒప్పుకోండని దేవతలకు చెప్పి విష్ణువు తాను కూడా దేవతలందరి, చిట్టచివర వాసుకి తోక పట్టుకున్నాడు. క్షీరసాగర మథనం ప్రారంభమైంది.






క్షీరసాగరమథన సమయంలో, రాక్షసులు దేవతలను పరిహాసం చేస్తూ, తమ భుజ బలం అంతా చూపిస్తూ లాగారు. దేవతలు కూడా మా తక్కువేమీ లేదని లాగారు. మథనం మహావేగంతో సాగింది. ఆ రాపిడికి తట్టుకోలేక వాసుకి మహాసర్పం హాలాహల మహా విషాన్ని కక్కింది.

హాలాహలం జ్వాలలు విరజిమ్ముతూ చెలరేగింది. రాక్షసులు చాలా మంది మలమలమాడి మసి అయ్యారు. హాలాహల మహాగ్ని విజృంభించి లోకాన్ని దహించే ప్రమాదం ఏర్పడింది. అదే సమయంలో మందరపర్వతం సముద్రంలోకి కృంగిపోయింది. అందరూ హరహరా అని శివుణ్ణి ప్రార్థించారు.

శివుడు హాలాహలాన్ని మింగి, గొంతులోనే ఉంచి లోకాల్ని రక్షించాడు, గరళకంఠుడనిపించుకున్నాడు. గండం తప్పిందిగాని, పర్వతం మునిగిపోయింది. దేవతలు విష్ణువును ప్రార్థించారు.

విష్ణువు పెద్ద తాబేలుగా కూర్మావతారం తాల్చి సముద్రంలో కృంగిపోయిన మందరపర్వతాన్ని మూపున మోస్తూ మీదకు తెచ్చాడు.

తాబేలై మందరగిరిని మోస్తూ క్రిందనూ, పర్వతం అటూ ఇటూ బెసక్కుండా పర్వతాగ్రంపై కూర్చొని పాదంతో అదిమిపెట్టుతూ మీదనూ, ఇంకోవంక దేవతలతో కలిసి సముద్రం చిలుకుతూ బహు రూపాలతో విష్ణువు కనిపించాడు.

4. కూర్మావతారం—జగన్మోహిని



సాగర మథనం సక్రమంగా సాగింది. క్షీరసాగరం నుంచి చంద్రుడు, లక్ష్మి, కల్పవృక్షం, కామధేనువు, ఐరావతం ఏనుగు, ఉచ్చైశ్శ్వం గుర్రం, సుర అనే మత్తూ, ఉత్తేజమూ కల్గించే పానీయమూ, ఇంకా ఎన్నెన్నో ఉద్భవించడం జరిగింది.

చల్లని చంద్రుణ్ణి శివుడు కంఠంలోని హాలాహలం వేడికి ఉపశమనంగా తలపై ధరించి, చంద్రశేఖరుడయ్యాడు.

లక్ష్మిదేవి శ్రీవత్సకౌస్తుభ మణులతో కూడిన వైజయంతిమాలను వేసి విష్ణువును వరించింది. విష్ణువు లక్ష్మికాంతుడయ్యాడు.

సురను దేవతలు స్వీకరించి సురులు అనిపించుకున్నారు.

చిట్ట చివరకు అమృతం సిద్ధించింది. విష్ణువు ఆయుర్వేదానికి మూల విరాట్టు అయిన ధన్వంతరి అవతారంతో, అమృత కలశాన్నీ, అనేక ఓషధులనూ ధరించి, పద్మాసనంపై కూర్చొని, సముద్రం నుంచి వచ్చాడు.

అమృతం కోసం పాలసముద్రాన్ని తరిస్తే ప్రారంభంలో హాలాహల విషం పుట్టింది. ఎన్నెన్నో విశేషాలు, దైవసహాయాలు జరిగాక అమృతం సిద్ధించి లక్ష్యసాధన అయింది. అందుకే ఏదైనా శమదమాదులతో కూడిన కార్యసాధనకు 'సాగర మథనం' అనే మాట పర్యాయపదంగా నిలిచింది.

ధన్వంతరి చేతనున్న అమృత కలశాన్ని రాక్షసులు ఎగరేసుకుపోయి అంతా మాదే అన్నారు. దేవతలు వాళ్ళతో పెనగులాడారు. దేవదానవుల పెనగులాట ముమ్మరంగా సాగుతున్న ఆ సమయంలో, ముజ్జగాలను సమ్మోహపరిచే జగన్మోహిని అక్కడకు వచ్చింది. ఆమెను చూసి రాక్షసులు పరవశించిపోయారు.

మోహిని రాక్షసులతో, "అమృతాన్ని ఇలా తెండి, నేను పంచుతాను!" అంది.

జగన్మోహిని తమతో మాట్లాడినందుకే రాక్షసులు ఉప్పొంగిపోతూ, అమృత కలశను ఆమెకు అందించారు.

రాక్షసులు ఒక వరసను, దేవత లోక వరసను కూర్చున్నారు. ఉభయశ్రేణుల నడుమ జగన్మోహిని నృత్యం చేస్తున్నట్లు అడుగులు వేస్తూ, అమృతకలశాన్ని నడుమున ఆనించి పంచడానికి తయారైంది.

ఏమి జరుగుతుందో అని దేవతలు నిశ్చేష్టులై చూస్తున్నారు. ఉన్మత్తులై రాక్షసులు మోహిని సౌందర్య విలాసాలను చూస్తూ తన్మయులౌతున్నారు.

దేవతలు కూడా జగన్మోహిని ఎవరో మొదట తెలుసుకోలేక పోయినా, రాక్షసులను మభ్యపెట్టి అమృతాన్ని దేవతలకు మాత్రమే పోస్తున్నప్పుడు, ఆ విశ్వమోహిని విష్ణువే అని గ్రహించి, గుట్టుచప్పుడు కాకుండా అమృతాన్ని తాగుతున్నారు.



జగన్మోహినీ విలాసమంతా విష్ణువు చిద్విలాసమే అని తెలిసిన దేవతలు, నిర్లిప్తంగా అమరత్వం పొందుతూంటే, దైత్యులు జగన్మోహిని మోహజాలంలో పడి ఉన్మత్తులై అమృతాన్ని కోల్పోయారు.

జగన్మోహిని వంచన చేస్తున్నదని రాహువు అనే ఒకే ఒక తెలివైన రాక్షసుడు కనిపెట్టాడు. అతడు జలరాక్షసి సింహిక కుమారుడు, బహు మాయావి.

జరుగుతూన్న మోసాన్ని చెప్పినా వినిపించుకొనే స్థితిలో రాక్షసులు లేక పోవడం జూసి, రాహువు దేవతల రూపు ధరించి దేవతల వరుసలో చేరి, అమృతాన్ని త్రాగాడు. సూర్యచంద్రులు అది గమనించి, మందర పర్వతాగ్రంపై విష్ణువుగానే ఉన్న బహురూపియైన విష్ణువుతో చెప్పారు. విష్ణువు తన చక్రాన్ని రాక్షసుడిపైకి పంపాడు.

రాహువు చక్రాన్ని తప్పించుకోవాలని గ్రహాలు తిరిగే అంతరిక్షానికి ఎగిరాడు. విష్ణుచక్రం వెంబడించి రాక్షసుడి తలను ఖండించి, తలనూ మొండేన్ని వేరు చేసింది. అమృత ప్రభావం వల్ల తలా, మొండెమూ రెండూ సజీవంగా ఉండి తల రాహువుగా, మొండెం కేతువుగా రెండు గ్రహాలుగా మారి, గ్రహకూటమిలో



చేరాయి. రాహుకేతు గ్రహాలతో గ్రహాలు తొమ్మిది అయ్యాయి.

సూర్యచంద్రులపై కసితో అమావాస్య, పూర్ణిమ పర్వదినాలలో, రాహుకేతువులు వారిని పట్టి పీడించ సాగారు. ఆ విధంగా సూర్యచంద్ర గ్రహణాలు ఏర్పడ్డాయి.

అమృతాన్నంతా దేవతలకు యిచ్చి జగన్మోహిని అంతర్ధానమైంది. రాక్షసులు తమ తెలివిమాలినతనానికి చింతించి, అప్పట్నించి విష్ణువుకూ, దేవతలకూ బద్ధ శత్రువులైనారు.

అమృతమథన సందర్భంగా విష్ణువు కూర్మావతారాన్నీ, ధన్వంతరి అవతారాన్నీ, జగన్మోహినీ అవతారాన్నీ ధరించాడు.

ధన్వంతరి అమృతంతోబాటు ఓషధులనూ, ఓషధీవేదాన్ని తెచ్చాడు. ధన్వంతరి వైద్యశాస్త్రానికి అధిదేవతగా, వైద్యుల కులదైవంగా అర్చింపబడ్డాడు.

జగన్మోహిని విశ్వమోహినిగా కీర్తించబడి సౌందర్య విలాసాలకు ప్రమాణంగా చెప్పుకోబడింది.

నారదుడు జగన్మోహిని అవతారాన్ని కీర్తిస్తూ, జగన్మోహినీ రాగం మహతివీణపై పలికిస్తూ, కైలాసానికి వెళ్ళాడు. పార్వతి అది విని, "పామరులైన రాక్షసులను వంచించగలిగినంత మాత్రాన జగన్మోహిని అనిపించుకుంటుందా ?" అని అన్నది.

"ఔనమ్మా, ఎంతటివారినైనా రంజింపజేసి యీ విశ్వాన్నే ఉర్రూగించే విశ్వమోహిని!" అని అంటూ నారదుడు వెళ్ళాడు..

పార్వతి ఆ విషయాన్ని శివుడితో చెప్పింది. శంకరుడు చిరునవ్వుతో అలకించి ఊరుకున్నాడు. తరువాత పార్వతితో కలిసి నందివాహనంపై వైకుంఠానికి వెళ్ళి, విష్ణువుతో, "నీ జగన్మోహినీ అవతారాన్ని మరొకసారి చూపుతావని వచ్చాము!" అన్నాడు.

"ఏదో అవసరానికి ఏ వేషమైనా వెయ్యక తప్పదు గదా! నీలాంటి వాడి ముందర అదేమాత్రం లెద్దూ!" అని

అంటూ విష్ణువు మాట్లాడుతూనే అంతర్థానమయ్యాడు.

అంతలో అల్లంత దూరాన పూల బంతితో ఆడుతూ, పాడుతూ జగన్మోహిని కనిపించింది. శివుడు సర్వమూ మరిచి ఆమె వెంట పడ్డాడు. జగన్మోహిని అందకుండా విశ్వాకాశంలోకి దారి తీసింది. శివుడు చేతులుచాచి వెంట పడుతున్నాడు. పార్వతి నిర్విణ్ణురాలై చూస్తూండిపోయింది.




శివమోహినీ లీలావినోదాన్ని బ్రహ్మాది దేవతలు కన్నుల పండుగగా తిలకిస్తున్నారు. నంది నివ్వెరపోతున్నాడు. నారదుడు మహతి వీణపై శివరంజని రాగాన్ని మారుమ్రోగిస్తున్నాడు.

ముందు జగన్మోహినీ, వెనుక శివుడూ విశ్వాంతరాల్లోకి పరుగులు తీస్తూ కొంత సేపటికి కనిపించలేదు. పార్వతి కైలాసం చేరుకుంది.

జగన్మోహిని తేజోమండలాల మధ్య నుంచి దూసుకుపోతూ శివుణ్ణి విశ్వమంతా తిప్పి, తిప్పి, కైలాసానికి చేరుతూ, తన్ను తాకవద్దని శివుణ్ణి వారిస్తూ పార్వతి చెంతకు చేరుతూండగా, శివుడు ఆమె నడుము చుట్టి మోకరిల్లాడు.

''చూశావుటమ్మా, నీ ప్రాణేశ్వరుడి ఆగడం!'' అని అంటూ జగన్మోహిని శివుడు ఇంకేమి చేస్తాడో అని భయపడుతూ పార్వతి చెంత నిల్చింది.

వెనువెంటనే జగన్మోహినీ రూపాన్ని చాలించి విష్ణువు పార్వతి ఎదుట సాక్షాత్కరించాడు.

''అన్నా! నీవు విశ్వమోహన జగన్మోహినీ కేశవస్వామివి! అంతా మీ శివకేశవుల లీలా నాటకమే కద!'' అని పార్వతి విష్ణువుతో అన్నది.

''అంతేనమ్మా, అంతే లే!'' అంటూ నారదుడు మహతి వాయించుతూ అక్కడికి వచ్చి జగన్మోహిని, శివరంజని రాగాల్లో హరి, హరుల లీలావిలాసాన్ని గానం చేస్తూ ముల్లోకాలూ తిరిగాడు.



శివుడు విష్ణువుతో, "అమృతం సంగతే మరిచి, నీ జగన్మోహినీ విలాసాన్ని కళ్లారా గోలిన రాక్షసుల్ని మెచ్చుకుంటున్నాను! రసపిపాస అసురుల సొత్తు!" అని అన్నాడు.

విష్ణువు చిరునవ్వు నవ్వి పార్వతితో, "అమ్మా, మున్ముందు శివరంజనిగా మా గంగాదేవి దివి నుండి భువికి అవతరించే వేళ కూడా, ఈ మహాశివుడు ఇలాగే పరవశించిపోతూ నీకు సవతిని తెచ్చేలా గుంది!" అని అంటూ అంతర్ధానమై వైకుంఠానికి చేరాడు.

తరువాతి కాలంలో విష్ణువు కర్దమ ప్రజాపతికి, దేవహూతికి పుత్రుడుగా కపిలావతారం ఎత్తాడు. చిన్నతనం నుంచే గొప్ప జ్ఞానసంపన్నుడై తపస్సు చేసి కపిల మహామునిగా పేరు పొందాడు.

కపిలుడు తల్లి దేవహూతికి చెప్పిన అనేక తత్వబోధలు సాంఖ్యయోగంగా ప్రసిద్ధి పొందింది. కపిలమహర్షి పాతాళంలో ఒక గుహలో తపస్సు నిర్విరామంగా చేస్తూన్న కాలంలో, భూమ్మీద నగర చక్రవర్తి నూరవ అశ్వమేధ యాగాన్ని తలపెట్టాడు. ఇంద్రుడు యాగాశ్వాన్ని మాయచేసి కపిలమహర్షి తపస్సు చేస్తున్న గుహలో దాచాడు.

సగరుడి వెయ్యి మంది కుమారులు గుర్రాన్ని వెతుకుతూ పాతాళానికి బిలం త్రవ్వుకొని వెళ్ళి, కపిలమహర్షి గుహలో చూశారు. కపిలుడే గుర్రాన్ని అపహరించి దాచి, దొంగజపం చేస్తున్నాడని విరుచుకుపడ్డారు. కపిలుడు కళ్ళు తెరిచి చూసేసరికి వారంతా బూడిద అయ్యారు.

ఆ భస్మరాసులపై విష్ణుపాదాల నుండి పుట్టి స్వర్గంలో మందాకినిగా ప్రవహిస్తున్న గంగను ప్రవహింపజేసి పితరులను తరింపజేయడానికి సగరుడి మునిమనమడైన భగీరథుడు గొప్ప తపస్సు చేసి; గంగాదేవిని ప్రసన్నం చేసుకున్నాడు. గంగ ధాటిని తట్టుకొని భరించగల శివుణ్ణి తపస్సుతో ప్రసన్నం చేసుకున్నాడు.

గంగావతరణంలో శివుడు గంగాదేవిని చూసి పరవశించి గంగను తన జటా జూటంలో గాఢంగా బంధించేసుకున్నాడు. తరువాత భగీరథుడి ప్రార్థనపై ముడి సడలించి కొద్దిగా గంగను వదిలాడు. గంగ భగీరథుడి వెంట వెళ్ళి, అతని పితరుల భస్మరాసులపై ప్రవహించి తరింపజేసింది.

పరమశివుడు గంగాధరుడై రంజిల్లాడు. ఆ విధంగా గంగ పార్వతికి సవతి అయింది.

సనకసనందనాది మునులు అనబడే సనకుడు, సనందుడు, సనత్సుజాతుడు, సనత్కుమారుడు అనే నలుగురూ బ్రహ్మ మానసపుత్రులు. ఎప్పుడూ బాలురవలెనే ఉంటారు. విష్ణుభక్తి తత్పరులై విష్ణువును కీర్తిస్తూ, అన్నిలోకాలూ నిరాటంకంగా తిరుగుతూంటారు.

వారు విష్ణువును చూడగోరి వైకుంఠానికి వెళ్ళారు. అన్ని ద్వారాలూ దాటి విష్ణు మందిర ద్వారం చేరుకున్నారు.

అక్కడ విష్ణువుతో సరిసమానమైన రూపంతో నాలుగు చేతులతో శంఖ, చక్ర, గద, అభయ ముద్రలు పట్టి ద్వారపాలకులై ఉన్న జయుడు, విజయుడు ఇది సమయం కాదని మునులను వారించారు.

సనకసనందనాదులు, "మాకు విష్ణు సందర్శనానికి సమయా సమయాలు లేవు," అంటూ జయవిజయులను లక్ష్యపెట్టకుండా విష్ణుమందిరంలోనికి వెళ్ళబోతూంటే, ద్వారపాలకులు గదలు ఎత్తి వారిని అడ్డగించారు.

సనకాది మునులు, "మీరు విష్ణు ద్వారపాలకులుగా ఉండతగరు రాక్షసులై పుట్టండి!" అని శపించారు.

ద్వారం దగ్గిర కలకలం విని, లక్ష్మి వెంట రాగా విష్ణువు తలుపులు తెరుచుకొని అక్కడికి వచ్చాడు.

జయవిజయులు మునులు తమకిచ్చిన శాపాన్ని చెప్పుకొని ఆక్రోశించారు. మునులు తొందరపడి శపించినందుకు లోలోన చాలా విచారించారు.





చందమామ
మే 1983
Rs. 2
మన సంస్కృతిని తెలుసుకోండి
పోటీ
ప్రత్యేక సంచిక
ప్రవేశ పత్రం మరియు పోటీ కూపన్ కొరకు పుట 3 చూడండి




విష్ణువు జయవిజయులతో, "మహా మునుల శాపం మీరరానిది. నా పట్ల మిత్ర భావంతో ఏడు జన్మల్లో తరించి వస్తారా? లేక నన్ను ద్వేషిస్తూ నాకు శత్రువులై మూడు జన్మల్లో నాచేత అంతమొంది యిక్కడికి వస్తారా?" అని అడిగాడు.

జయవిజయులు విష్ణు సన్నిధానాన్ని త్వరగా చేరుకోడానికి మూడు జన్మలే కోరుకున్నారు.

అప్పుడు సనకసనందనాది మునులు జయ విజయుల్ని మెచ్చుకుంటూ విష్ణువుతో, "రాగద్వేషాలు రెండూ నీకు సమానమనీ, నిన్ను ద్వేషించేవారు మరింత త్వరగా నీకు దగ్గరవుతారనీ యిప్పుడు తెలుసుకున్నాం! నీ ద్వారపాలకులను శపించిన మా తొందరపాటు తనానికి సిగ్గు పడుతున్నాం. మమ్మల్ని మన్నించు!" అని చెప్పి, లక్ష్మీనారాయణులను అనేక విధాల మనసార స్తుతిస్తూ సేవించి వెళ్ళారు.

జయవిజయులు కశ్యపప్రజాపతి భార్య దితి కడుపున హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడుగా పుట్టారు.

అన్నదమ్ములు గొప్ప పరాక్రమవంతులై తపస్సులు చేసి బ్రహ్మను మెప్పించి వరాలు పొందారు. విష్ణువుపై కత్తికట్టి విజృంభించారు.

హిరణ్యకశిపుడు రాక్షసులకు రాజై, విష్ణువును ఎదుర్కొని సాధించడానికి కంకణం కట్టుకున్నాడు.



హిరణ్యాక్షుడు విష్ణువును కవ్వించే ఘోర కృత్యాలు చేసిచేసి, భూమిని దొర్లించుకుపోయి రసాతల సముద్రంలోకి తోశాడు. భూమి రసాతలం అడుగున మునిగిపోయింది. భూదేవి విష్ణువును తలంచి తన్ను ఉద్ధరించమని మొర పెట్టింది.

విష్ణువు భూదేవి మొర ఆలకించి దశావతారాల్లో మూడవది అయిన వరాహావతారాన్ని ఎత్తాడు.

బ్రహ్మ హోమం చేస్తూండగా యజ్ఞకుండం నుంచి తెల్లని కాంతితో ఒక నలుసు వెలువడింది. ఆ నలుసు పెద్దదై అడవి పందిగా రూపొందింది. ఆ ఏదు పందిని విష్ణువు అవతారంగా ఎంచి బ్రహ్మాది దేవతలు యజ్ఞవరాహంగా, శ్వేత వరాహంగా, ఆదివరాహంగా కీర్తిస్తూ స్తుతించారు.

యజ్ఞవరాహము అలా అలా పెరిగి, బ్రహ్మాండమైన ఆకృతి పొందింది; బలిష్ఠమైన కాళ్ళతో, ఉక్కుకవచం లాంటి పై చర్మంతో, వజ్రాల్లాంటి పొడవైన వాడి కోరకొమ్ములతో, ఎర్రనికాంతి ప్రసరించే కన్నులతో, మెడ నుంచి తోకవరకూ నిక్కబొడుచుకొని బంగారంలా మెరుస్తున్న వెంట్రుకల జూలుతో, విశ్వమంతా ఘూర్ణిల్లేలాగ వరాహము హుంకార ధ్వనులు చేసింది. యజ్ఞవరాహం ముట్టెపై ఖడ్గంలాంటి కొమ్ము ధగధగా మెరుస్తున్నది.

వరాహావతారం మెరుపు వేగంతో రసాతలానికి పరిగెత్తింది. ఆ వేగానికి దిక్కులు అదిరాయి, ప్రళయవాయువులు వీచాయి.

రసాతల సముద్రంలోకి చొచ్చుకొని వెళ్ళి, అడుగున మునిగి ఉన్న భూమిని కొమ్ముతో గుచ్చి యజ్ఞవరాహము మీదకు ఎత్తింది.

అదే సమయంలో హిరణ్యాక్షుడు వరుణుడిపై దాడిచేసి పోరాటానికి పిలిచాడు.

వరుణుడు, "వీరాధి వీరుడివైన నీవు పోరాడవలసినది రసాతలం నుండి భూమిని ఉద్ధరిస్తున్న యజ్ఞవరాహంతో!" అని అన్నాడు. హిరణ్యాక్షుడు హుటాహుటిని వెళ్ళి యజ్ఞ వరాహావతారాన్ని ఢీకొన్నాడు.

వరాహరూప విష్ణువుతో హిరణ్యాక్షుడు గొప్ప పరాక్రమంతో పోరుతూ గదతో విష్ణువు గదను తృళ్ళగొట్టి నిల్చున్నాడు. విష్ణువు అతని యుద్ధనీతిని మెచ్చుకొని తిరిగి గదను ధరించాక, యిరువురికీ సంగ్రామం ఘోరంగా సాగింది. చివరకు వరాహావతారం తన కొమ్ముతో హిరణ్యాక్షుణ్ణి పొడిచి చంపింది.



వరాహావతారుడైన విష్ణువును భూదేవి వరించింది. వరాహమూర్తి భూదేవిని సందిట చేర్చుకొని తొడపై కూర్చుండబెట్టుకున్నాడు. బ్రహ్మాది దేవతలు పూల వాన కురిపిస్తూ, జగపతిగా విష్ణువును అనేక విధాలుగా స్తోత్రం చేశారు.

పందిరూపంతో తన తమ్ముణ్ణి చంపిన విష్ణువుపై పగ సాధించడానికి తీవ్ర సంకల్పంతో, ముందు బ్రహ్మవల్ల వరాలు పొందడానికి హిరణ్యకశిపుడు తపస్సుకు వెళ్ళాడు. అప్పుడు అతని భార్య లీలావతి గర్భవతిగా ఉన్నది.

ఆమె గర్భవాసాన్ని హతమార్చడానికి ఇంద్రుడు మాయోపాయంతో లీలావతిని చెరగొని, ఆకాశమార్గాన పోతూండగా, నారదుడు ఎదురై, "దేవేంద్రా! ఎంత పనికి ఒడిగట్టావు! నీ ప్రయత్నాన్ని విరమించు. సర్వకాల సర్వావస్థలలో హిరణ్యకశిపుడు పగతో విష్ణువు గురించే తలంచుతూండే వాడవడంవల్ల, లీలావతి గర్భస్థుడైన శిశువుకు ఆ విష్ణుచింతన సంక్రమించి, పగ భక్తిగా అతనిలో రూపాంతరం పొందింది. ఇదే విష్ణుమాయ అయిన ప్రకృతి విశేషాల్లో ఒకటి. లీలావతి గొప్ప విష్ణుభక్తుణ్ణి కనబోతూన్నది. అంచేత లీలావతిని విడిచిపుచ్చి, నీ దారిన నువ్వు వెళ్ళు!" అని చెప్పి లీలావతిని తన ఆశ్రమానికి తీసుకెళ్ళాడు.



ఆశ్రమంలో నారదుడు వేదాంత విష యాలనూ, విష్ణు గుణగణాలను వర్ణిస్తూ న్నప్పుడు, లీలావతి గర్భంలో ఉన్న బిడ్డ ఆసక్తితో వింటూ, ఊఁ కొడుతూండే వాడు. లీలావతి కుమారుణ్ణి ప్రస వించింది.

హిరణ్యకశిపుడు ఘోరమైన తపస్సు చేసి బ్రహ్మను మెప్పించాడు. భూమ్మీద గాని, ఆకాశంలోగాని, రాత్రిగాని పగలు గాని, ఇంటగాని, బయటగాని, మృగంచేత గాని మనిషిచేతగాని, దేవతలు మొదలైన వారివలన గాని, ప్రాణమున్న దానిచేత గాని లేనిదానిచేతగాని, సృష్టిలో ఉన్న ఏ రూపంచేత గాని, యింకా ఎన్నో విధాలుగా తనకు చావులేని వరాల్ని కోరాడు; బ్రహ్మ అతను కోరిన వరా లన్నిటినీ యిచ్చాడు.

వరాలను పొందిన విజయగర్వంతో హిరణ్యకశిపుడు వస్తూండగా, నారదుడి వలన జరిగినది విని, నారదాశ్రమానికి వచ్చి, కుమారుడి పేరు ప్రహ్లాదుడు అని నామకరణ మహోత్సవం జరిగాక, భార్యనూ, కుమారుణ్ణీ తన రాజధానికి తీసుకువెళ్ళాడు.

ఇంద్రుడిపై ప్రతీకారంగా హిరణ్య కశిపుడు స్వర్గం మీదకు దండయాత్ర చేసి స్వర్గసింహాసనం ఆక్రమించాడు. దిక్కు లన్నిటినీ జయించి, అష్ట దిక్పాలకుల్ని తన అదు పాజ్ఞల్లో పెట్టుకున్నాడు. దేవ తల్ని పశువుల్ని బాదినట్లుగా బాదాడు. శచీదేవిని అవమానించబోతే లీలావతి అడ్డుకొంది.

హిరణ్యకశిపుడు విజృంభించి మునుల ఆశ్రమాల్ని తగలబెట్టించాడు. విష్ణు విశ్వాసకుల్ని చిత్రవధలు చేయించాడు. విష్ణువును ఎదుర్కోవడమే అతని ధ్యేయం. విష్ణువును కవ్వించడానికి చేయవలసిన వన్నీ చేశాడు. అయినా విష్ణువు అతనికి తారసపడలేదు. వైకుంఠానికి దాడి వెళ్ళాడు. అక్కడా విష్ణువు అతనికి కన పడలేదు.

''నాకు భయపడి అదృశ్యంగా దాగున్నాడు, పిరికిపంద!'' అని హిరణ్యకశిపుడు తిరిగి వచ్చాడు.

ప్రహ్లాదుడు దినదిన ప్రవర్ధమానంగా ఎల్లప్పుడూ విష్ణుస్మరణ చేస్తూ పెరుగుతూన్నాడు. తనకు అటువంటి కులద్రోహి ఎందుకు పుట్టాలి! అని హిరణ్యకశిపుడు చింతించి, గురుపుత్రులైన చండామార్కులకు ప్రహ్లాదుణ్ణి అప్పగించి, విద్యాబుద్ధులు నేర్పమన్నాడు.

ప్రహ్లాదుడు గురుకులంలో హరిధ్యానంతోనే చదువంతా పూర్తి చేశాడు. తోటి బాలురకు విష్ణుభక్తి ప్రబోధంచేసి మోక్షమార్గంపట్ల ఆసక్తికలవారిగా చేశాడు.

చండామార్కులు ప్రహ్లాదుణ్ణి తండ్రి దగ్గిరికి తీసుకెళ్ళారు. హిరణ్యకశిపుడు కుమారుణ్ణి తొడపై కూర్చుండబెట్టుకొని, ''నాయనా! నువ్వు నేర్చిన విద్య తెలిసేలాగ మంచి పద్యం ఒకటి చెప్పు!'' అన్నాడు.

ప్రహ్లాదుడు, ''తండ్రీ! గురువులు చెప్పిన చదువంతా క్షుణ్ణంగా నేర్చాను. చదువులన్నిటి కంటె గొప్పదైన చదువు విష్ణువునందు మనసు నిల్పడం ఒక్కటే! విష్ణువును స్మరించే జన్మే జన్మ!'' అన్నాడు.

హిరణ్యకశిపుడు కుమారుణ్ణి క్రిందకు తోసి పట్టరాని ఆగ్రహంతో చండామార్కులతో, ''ఇదా మీరు నేర్పిన చదువు?'' అన్నాడు.



చండామార్కులిద్దరూ గజగజలాడుతూ, ''మా తప్పేమీ లేదు, మహాప్రభూ! మాపై ఆగ్రహించకు!'' అని వేడుకుంటూ, గురుకులంలో ప్రహ్లాదు డే విధంగా ప్రవర్తించినదీ వివరంగా విన్నవించుకున్నారు.

హిరణ్యకశిపుడు కొడుకుతో, ''విష్ణువు పందిగా నీ పినతండ్రిని చంపాడు. మన రాక్షస కులానికి పరమశత్రువు. నీవు విష్ణువును పొగడ్డం క్షమించరాని కులద్రోహం. విష్ణుభక్తి మాను, వాణ్ణి మర్చిపో!'' అన్నాడు.



''అయితే నీవు చావక తప్పదు. ఆహార పానాలు లేకుండా మాడి చావు!'' అంటూ ప్రహ్లాదుణ్ణి వెల్తురు చొరవని కారాగారంలో పెట్టించాడు.

పుత్రప్రేమతో లీలావతి తల్లడిల్లి పోయింది. రోజులు గడుస్తున్నాయి.

లీలావతి శోకం చూడలేక హిరణ్యకశిపుడు కారాగారం తెరిపించి, తన్మయుడై విష్ణుసంకీర్తన చేస్తూ నవనవలాడుతూన్న ప్రహ్లాదుణ్ణి చూసి, చాలా రోజులుగా అన్నపానాలు లేకుండా ఎలా బతికి ఉన్నాడా అని ఆశ్చర్యపడుతూనే, పట్టరాని ఆగ్రహంతో ప్రహ్లాదుణ్ణి ఏనుగులచేత మట్టించమన్నాడు.

ఏనుగులు సింహాన్ని చూసినట్లు బెదిరాయి. మావటివాళ్లు పొడిచి నడిపించితే, అతనిమీద నుంచి వెళ్ళాయిగాని, అతనికే అపాయమూ కలగలేదు.

పాములచేత కరిపించబోతే, కాటు వేయకుండా ముద్దాడి, పడగలు విప్పి గొడుగులుపట్టి ఆడాయి.

కొండశిఖరం నుంచి తోయించాడు. మంటల్లో వేయించాడు. సముద్రంలో పడ వేయించాడు. కాలకూట విషం త్రాగించాడు. ఎన్నిచేసినా, ప్రహ్లాదుడు సురక్షితంగా ఉండటం చూసి, హిరణ్యకశిపుడు, ''నువ్వు, చావకున్నా వెందు

''దానవేశ్వరుడవైన నీవు అన్నివిధాలా నన్ను శాశింపతగినవాడివే! కాని ఇనుము ముక్క అయస్కాంతాన్ని ఏ విధంగా అంటుకుంటుందో, అలాగే నా మనస్సు విష్ణువు పైనే లగ్నమై ఉన్నది; మందార పువ్వు మకరందాన్ని తుమ్మెద ఎలాగ విడిచిపెట్టలేదో, అలాగే విష్ణువును మర్చిపోవడం నా వశంలో లేదు. నాలో జీవము ఉన్నంతవరకూ విష్ణుచింతన పోదు. ఆ జీవము కూడా విష్ణువే!'' అన్నాడు వినయంగా.

ముక్కుపచ్చలారని బాలుడైన ప్రహ్లాదుడి మాటలకు విస్తుపోతూ హిరణ్యకశిపుడు కోపంతో అగ్నిలా ప్రజ్వరిల్లి,

చేత? ఆ రహస్యమేమిటో చెప్పు!'' అని అడిగాడు.

ప్రహ్లాదుడు నవ్వుతూ, ''ఇందులో రహస్యం ఏదీలేదు; ఏనుగుల్లో, పాముల్లో, రాళ్ళలో, అగ్నిలో, సముద్రాల్లో, విషంలో అన్నిట్లో, నీలో, నాలో ఉన్నది విష్ణువే అన్న సత్యాన్ని తెలుసుకోలేకపోతున్నావు! నన్ను చంపాలనుకుంటున్నదీ, నేను బతుకుతూన్నదీ, అతని లీలావినోదమే, నాన్నా!'' అన్నాడు.

ఆ మాటలకు హిరణ్యకశిపుడు కోపావేశంతో ప్రహ్లాదుణ్ణి బరబరా ఈడ్చుకు వెళ్ళి సభామంటపం మధ్య నిలబెట్టి, తన గదను తీసి పట్టుకొన్నాడు. లీలావతి మూర్ఛపోయింది. చుట్టూరా రాక్షస ప్రముఖులు నిర్విణ్ణులై బొమ్మల్లా నిలబడి చూస్తున్నారు.

సభామంటపానికి ఎదురుగా లోహ నిర్మితమైన పెద్ద జయస్తంభం ఉంది. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుడికి ఆ స్తంభాన్ని చూపుతూ ''ఓరీ కులద్రోహీ! అది, నా విజయస్తంభం! నా తమ్ముణ్ణి చంపిన విష్ణువుతో పోరాడి, నీ ముందే సంహరించి పగతీర్చుకుంటాను, అందులో ఉన్నాడా?'' అనడిగాడు.

''ఆ సందేహమే వద్దు. అంతటా ఉన్నాడు, అందులోనూ ఉన్నాడు,'' అన్నాడు ప్రహ్లాదుడు.

హిరణ్యకశిపుడు చరచరా వెళ్ళి గదతో స్తంభాన్ని కొట్టాడు. ప్రళయధ్వనితో భూనభోంతరాలు దద్దరిల్లాయి, పొగలమేఘాలు అంతటా విరజిమ్ముకున్నాయి. స్తంభం రెండుగా చీలిపోతూండగా వెలువడిన మిరుమిట్లుగొలిపే మెరుపుల మధ్య దశావతారాల్లో నాలుగోది అయిన నరసింహావతారంగా విష్ణువు ఆవిర్భవించాడు. సింహం తల, మనిషి శరీరము, చేతులకు సింహం గోళ్ళతో సృష్టిలో లేని రూపం గల నరసింహమూర్తి ప్రళయభీకరంగా గర్జించాడు. పాంచజన్యశంఖధ్వని వినిపించింది. సుదర్శనచక్రం అతని చుట్టూ తిరుగుతూ కనిపించింది.





# విష్ణుకథ

హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి ఆలింగనం చేసుకొని, "ప్రహ్లాదా! నీ మూలంగా ఇన్నాళ్ళకు విష్ణువుపై పగతీర్చుకొనే అవకాశం లభించింది!" అని చెప్పి గదను ఎత్తి నరసింహావతారంతో పోరాటానికి తలపడ్డాడు. చివరకు నరసింహం ప్రళయ గర్జన చేస్తూ ఎగిరి, హిరణ్యకశిపుడిపై ఉరికి ఒడిసిపట్టుకొని, సభామంటప ద్వారం దగ్గరకు తీసుకువెళ్ళాడు.

లోపలా, వెలుపలా కాని ద్వారం అరుగుమీద, రాత్రీ, పగలూ కాని సంధ్యా సమయంలో, ఆకాశమూ, భూమీ కాని తన తొడల మీద పెట్టుకొని, సజీవములూ, నిర్జీవములూ కాని గోళ్ళతో, బ్రహ్మవలన పొందిన వరాలన్నిటికీ, భిన్నంగా, విష్ణువు నరసింహరూపంతో హిరణ్యకశిపుడి రొమ్మునూ, పొట్టనూ భీకరంగా చీల్చి చంపాడు.

రాక్షసులు సమూహంగా నరసింహుణ్ణి ఎదుర్కోడానికి రాగా విష్ణుచక్రం వారిని అంతం చేసింది.

నరసింహమూర్తి ప్రేగుల్ని కంఠహారాలుగా వేసుకొని, ఉగ్రంగా చేస్తున్న అట్టహాసానికి దేవతలు భయపడ్డారు. లక్ష్మిదేవి కూడా భయపడింది. అప్పుడు ప్రహ్లాదుడు నరసింహావతారుణ్ణి స్తుతించి శాంతింపజేశాడు.

తండ్రికి ఉత్తరక్రియలు జరిపి, రాజ్యపాలన చేయవలసిందని చెప్పి ప్రహ్లాదుణ్ణి దీవించి, నరసింహావతారుడైన విష్ణువు



అంతర్ధానమయ్యాడు. జయవిజయుల తొలిజన్మ ముగిసింది.

విష్ణువు ఆనతిప్రకారం ప్రహ్లాదుడు చిరకాలం రాజ్యపాలనచేసి, కుమారుడైన విరోచనుడికి పట్టంకట్టి, విష్ణుభక్తి తత్పరుడై వనాలకు వెళ్ళాడు.

విరోచనుడి తర్వాత అతని కుమారుడు బలి రాజ్యానికొచ్చాడు. క్షీరసాగరమథనంలో పుట్టిన ఉచ్చైశ్రవాన్ని బలి, తీసుకున్నాడు. రాక్షసులశిల్పి మయుడు అతనికి నేలపైనా, నీటిలోనూ, అంతరిక్షంలో పోగల గొప్ప వాహనాన్ని నిర్మించి యిచ్చాడు.

అమృతం తమకు దక్కకుండా జరిగిన అన్యాయానికి ప్రతీకారంగా దేవతలతో యుద్ధానికి దిగాడు. దేవతలు అమృతం సేవించిన ధైర్యోత్సాహాలతో రాక్షసులను ఎదుర్కొన్నారు. బలి ఇంద్రుడితో గొప్పగా పోరాడాడు. దేవప్రముఖులకూ, రాక్షసప్రముఖులకూ ముఖాముఖీగా, విడివిడి యుద్ధాలు సాగాయి. ఆ దేవదానవ సంగ్రామంలో రాక్షసులు చిత్తుగా ఓడిపోయారు. హతులైన రాక్షసులను రాక్షసుల గురువైన శుక్రాచార్యుడు మృతసంజీవనీ విద్యను ప్రయోగించి తిరిగి బ్రతికించాడు.

ఓటమితో బలి మరింత పట్టుదలతో రాక్షసులందర్నీ కూడగట్టుకొని నాయకుడై, భూమండలం అంతటినీ జయించి, కట్టుదిట్టంగా పరిపాలన సాగిస్తూ, బలిచక్రవర్తి అనిపించుకున్నాడు. శుక్రుడు అతని చేత నూరు అశ్వమేధయాగాలు చేయించాడు.

బలి విజృంభించి స్వర్గం మీదకు దాడి చేశాడు. అతని ధాటికి వెరచి ఇంద్రాది దేవతలు స్వర్గాన్ని వదలి అరణ్యాలు పట్టారు. దిక్పాలకులు బలిచక్రవర్తికి వశవర్తులై మెలగసాగారు. స్వర్గమర్త్య పాతాళ ముల్లోకాలను బలిచక్రవర్తి ధర్మబద్ధంగా పాలిస్తూండగా, ఇంద్రుడి తల్లి అదితి భర్త కశ్యపప్రజాపతితో తన సంతతి వారైన దేవతలు, ఇంద్రుడు, శచీదేవి

అరణ్యాల్లో పడుతున్నపాట్లు చెప్పుకొని, వారికి తిరిగి స్వర్గసామ్రాజ్యం చేకూరే మార్గం చెప్పమన్నది.

అందుకు విష్ణువును గూర్చి వ్రతం చెయ్యమని కశ్యపుడు ఉపదేశించాడు. అదితి విష్ణువును ఆరాధించి మెప్పించింది. విష్ణువు ఆమె కడుపున పుట్టి దేవతలకు స్వర్గం సమకూర్చిపెడతానని చెప్పాడు.



ఆ విధంగా విష్ణువు అదితి కశ్యపులకు పొట్టి పిల్లవాడైన కుమారుడుగా పుట్టి, దశావతారాల్లో ఐదవదైన వామనావతారాన్ని ఎత్తాడు.

వామనుడు ఉపనయనం పొంది వేద విద్య పూర్తిచేసి, ఇంద్రుడి తమ్ముడుగా, అదితి అల్లారు ముద్దుబిడ్డగా పెరిగాడు.

అప్పుడు బలిచక్రవర్తి నర్మదానదీ తీరంలో, యాగాల్లోకల్లా గొప్పదైన విశ్వజిద్యాగాన్ని శుక్రుని అధ్వర్యంలో ప్రారంభించి గొప్పగొప్ప దానాలు చేస్తున్నాడు.

వామనుడు ఒడుగుజందెము, కృష్ణాజినము, కమండలం మొదలైనవాటిని ధరించి గొడుగూ, పావుకోళ్ళూ వేసుకొని, మూర్తీభవించిన బ్రహ్మతేజస్సుతో బలి చక్రవర్తి దగ్గరికి బయలుదేరాడు.

బుడి బుడి నడకలతో వస్తున్న వామనుణ్ణి చూసి, యాగశాలలో అంతా ముచ్చటపడ్డారు. వామనుడు బలిచక్రవర్తి ఎదుటకు వెళ్ళి జయం పలికాడు.

వామనుణ్ణి చూడడంతో బలిచక్రవర్తికి మహదానందం కలిగింది. "చిట్టినాయనా! ఎవరునువ్వు? ముక్కుపచ్చలారని సరికొత్త వటువుగా ఎక్కడికి బయల్దేరావు?" అని అడిగాడు.

వామనుడు, "నీ దగ్గిరికే బయల్దేరి వచ్చాను. ఎవర్నని చెప్పేది, అంతా నావారే! అయినా ఇప్పుడు ఒంటివాణ్ణి; సిరిగలవాడినే, అయినా ఇప్పుడు యాచకుణ్ణి! నీ ముత్తాతలు వీరాధివీరులు, ఇక నీ బల పరాక్రమాలు దిగంతాలు దాటాయి!" అని అంటూంటే, బలిచక్ర



వర్తి నవ్వుతూ, "నీ మాటలు చిత్రంగా వున్నాయి. పరాక్రమం గురించి మాట్లాడుతున్నావు. యుద్ధం చేయమనవుగద ? నేనిప్పుడు యాగదీక్షలో కంకణం కట్టుకొని ఉన్నానాయెను, యుద్ధప్రసక్తిలేదుమరి!" అని వినోదంగా అన్నాడు.

వామనుడు, "ఎంతమాట బలిచక్రవర్తీ! ఏదో నాతో పరిహాసం ఆడావుగాని మహోన్నత బల విక్రముడివైన నీ ముందర భూమికి అంటుకుపోతున్న పొట్టికుంకను నేనెక్కడ? మేటి దాతవై అంతులేని దానాలు చేస్తున్న నీ కీర్తివిని నిన్ను యాచించి దానం పుచ్చుకోవాలని వచ్చాను!" అన్నాడు.

"అలాగే పుచ్చుకో, నువ్వు ఏమడిగినా ఇస్తాను!" అని బలిచక్రవర్తి అన్నాడు.

అప్పుడు శుక్రాచార్యుడు బలిచక్రవర్తిని పిలిచి, "వామనుడెవరో కాదు, విష్ణువు! నిన్ను వంచించి, నీ సర్వస్వాన్నీ హరించడానికి వచ్చాడు. అతనికి ఎటువంటి దానప్రదానమూ చేయవద్దు!" అని హెచ్చరించాడు.

బలిచక్రవర్తి, "విష్ణువంతటి వాడు దేహీ అని చేయిచాచగా, నా చేయి మీదై దానం యివ్వడం గొప్ప అదృష్టమే కాకుండా, నా ఘనవిజయాన్ని చాటుతుంది! అంతేగాకుండా, ఇస్తానని లేదనడం అసత్యదోషం కదా!" అన్నాడు.

శుక్రుడు, "ఆత్మరక్షణకు అది అసత్యం అనిపించుకోదు. తనకు మాలిన ధర్మం ఆత్మహత్యాపాతకంతో సమానం!" అన్నాడు.

"ఏది ఏమైనా, అతడు నన్నేమిచేసినా, నేనేమైపోయినా అది నా ఓటమి కాదు, ధర్మవీరమే అవుతుంది! శిబిప్రముఖుల్లాగ దానశీలుణ్ణి అనిపించుకోవాలనే కీర్తికాంక్ష కూడా నాకులేదు. పిరికితనంతో అడిగినది ఇస్తానని, లేదని తప్పించుకొనే భీరువు అనిపించుకోవడం, నాకు సాధ్యంకాదు." అని బలిచక్రవర్తి అన్నాడు.

ఆ మాటలకు శుక్రుడు కోపంతో, "గురువుగా నీహితవుకోరి చెప్పింది వినకుండా

ధిక్కరిస్తున్నావు. నీ సర్వస్వాన్నీ, రాజ్యాన్నీ కోల్పోతావు!'' అని కోపంతో శపించినట్టు అన్నాడు.

బలిచక్రవర్తి, ''గురుదేవా! నన్ను శపించావని వరిమాట పడ్డావేగాని, నేను అన్నిటికీ తల ఒగ్గే దానం యివ్వడానికి సిద్ధపడ్డాను గదా! గురుధిక్కారం చేసి పొందిన శాపాన్ని విష్ణువు అమలు చేశాడే గాని, అన్యాయంగా బలిని వంచించలేదని విష్ణువుకి మాటరాకుండా నీ శాపం మేలు చేసింది! నీ శాపాన్ని సంతోషంగా స్వీకరిస్తున్నాను!'' అన్నాడు.

శుక్రుడు తెల్లబోయి నిరుత్తరుడై తల వంచుకున్నాడు. బలి వామనుడి దగ్గిరికి వెళ్ళబోతూండగా శుక్రుడు, ''ఓ దానవ నాథా! విష్ణువు బిచ్చానికి వచ్చి నిన్ను బిచ్చగాణ్ణే చేస్తాడో, అథఃపాతాళానికి అణి చేస్తాడో, ఏంచేసినా చెయ్యవచ్చు. ఈ త్రిలోకాధిపత్యమూ, సంపదలూ, వైభవమూ దేనికి కష్టించి సంపాదించావు? శరీరం తర్వాతనే కదా ఏ ధర్మసాధన అయినా!'' అని అన్నాడు.

బలి, ''రాజ్యమూ సంపదలూ సతతము వుండేవి కావు. ఎలా సంపాదించానో అలాగే పోగొట్టుకోవడం సహజమేకదా. శరీరం కూడా శాశ్వతం కాదుగదా!'' అన్నాడు.




శుక్రుడు, ''నీ వినాశం నీ ఒక్కడిదే కాదు, దానవకులానికే ముప్పూ, అవమానమూ తెస్తుందని తెలుసుకో!'' అన్నాడు.

''అంతేకాదు, ఒక దానవుడు ధర్మపాలన చేశాడు, విష్ణువుకి భిక్ష పెట్టాడు! అని దానవకులాని కంతటికీ ఘనత తెస్తుంది కదా!'' అని బలిచక్రవర్తి వామనుడి దగ్గిరికి వెళ్ళాడు.

భార్య వింధ్యావళి స్వర్ణకలశంతో నీళ్లు పోయగా బంగారు పళ్ళెంలో వామనుడి పాదాలు కడిగిన నీటిని శిరసున చల్లుకొని, బలిచక్రవర్తి వామనుడితో, ''ఓ వామన రూపా! నీవంటి వాడు దానం కోసం రావడం నా సుకృతం! నీకేం కావాలో



అడుగు! సిరులు, సంపదలు, భవంతులు, మణులు, సుందరీమణులు, సస్యక్షేత్రాలు, సామ్రాజ్య సర్వమూ, నా తనువు—అన్నీ నీవే!" అన్నాడు.

వామనుడు, "మహాబలీ ఆగవయ్యా! నీవు వల్లించినవన్నీ నా కెందుకు? కృష్ణాజినం పరుచుకుర్చొని బ్రహ్మనిష్ఠ జరుపుకోడానికి నా చిట్టిపాదాలతో మూడు అడుగుల చోటు చాలు! మూడడుగుల నేల, నీ దిగంతపర్యంతమైన సామ్రాజ్యంలో స్వల్పాతి స్వల్పమే అయినా, నాకు అదే ముల్లోకాల సాటి!" అన్నాడు.

"ఆ మూడడుగులే పుచ్చుకో!" అని బలిచక్రవర్తి జలకలశం వంచి ధారా దత్తం చేయబోతే నీరుపడలేదు. శుక్రుడు సూక్ష్మరూపంతో జలకలశం తొండంలో అడ్డుపడి జలధార పడకుండా చేశాడు.

వామనుడు దర్భపుడక తీసి దాంతో తొండంలోకి పొడిచాడు. శుక్రుడు కన్ను పోయి ఒంటికన్ను వాడయ్యాడు. అడ్డు తొలగి జలధార బలిచక్రవర్తి చేతి మీదుగా వామనుడి దోసిటపడ్డది. దాననిధి పూర్తి కాగానే, "ఇహ నీ అడుగులతో మూడు అడుగులు నేల కొలిచి తీసుకోవడమే తరవాయి!" అన్నాడు బలి.

వామనుడు అమాంతంగా అలా అలా పెరిగి విశ్వరూపం ధరించి పొడవు, వెడల్పు, ఎత్తులతో క్రింద, మధ్య, మీద అనే మూడింటినీ ఆక్రమించాడు. ఒక పాదంతో భూమి నంతటినీ కొలిచాడు. త్రివిక్రముడైన విష్ణువు పాదం నీడలో భూతలమంతా క్షణకాలం పాటుగా గాఢాంధకారం క్రమ్ముకొన్నది. ఆ తరువాత ఆకాశాన్నంతటినీ కొలిచాడు. సూర్యచంద్రాది గ్రహాలు, నక్షత్రమండలాలన్నీ అతని పాదానికి అంటుకొన్న రేణువులుగా కనిపించాయి. అప్పుడు బ్రహ్మ తన కమండలంలోని జలంతో విష్ణుపాదాన్ని అభిషేకించాడు. విష్ణుపాదం నుంచి జారిన నీరు ఆకాశగంగగా స్వర్గసీమలో మందాకినిగా ప్రవహించింది.

''బలిచక్రవర్తీ! మూడో అడుగు ఎక్కడ వెయ్యమంటావు?'' అని త్రివిక్రముడు అడిగాడు.

బలిచక్రవర్తి, ''ఓ త్రివిక్రమా! ఇదిగో నా శిరస్సు, దీనిపై మోపు!'' అని తల వంచాడు.

విష్ణువు విశ్వరూపాన్ని చాలించి యథా ప్రకారంగా వామనుడై అతని తలపై పాదాన్ని వేసి, ''బలీ! భూమ్యాకాశాల్ని సంపూర్ణంగా కొలుచుకొన్న నా పాదం నీ తలను పూర్తిగా కొలవలేక పోతున్నది సుమీ!'' అన్నాడు.

అప్పుడు ప్రహ్లాదుడు వచ్చి, ''నా మనుమడు బలి నీకు శత్రువు కాడు, అతణ్ణి అనుగ్రహించు!'' అని వామనుణ్ణి వేడుకున్నాడు.

బలిచక్రవర్తి భార్య వింధ్యావళి, చేతులు జోడించి నమస్కరించి ''వామనావరా! నా భర్తకు ఎటువంటి హానీ జరక్కుండా అనుగ్రహించడం నీకు ఉచితం!'' అని భక్తితో ప్రార్థించింది.

వామనుడు, ''అమ్మా! నీ భర్తకు హాని తలపెట్టడం ఎవ్వరికీ ఎప్పుడూ శక్యం కాని పని. అందువల్లనేకదా యాచకుడినై నేవచ్చి దానం పుచ్చుకున్నాను! అతని ధర్మబలం అలాంటిది!'' అని చెపుతూ ప్రహ్లాదుడి వంకచూసి, ''బలి నాకు ఎంత ప్రియతముడో తెలుసా?'' అని అంటూ వామనుడు విష్ణుకళతో విరాజిల్లుతూ పొడవైన వేత్రదండాన్ని పట్టుకుని కనిపించాడు.

''ఓ బలిచక్రవర్తీ! నీ సాటి ఇదివరకు లేడు, ఇకముందు ఉండబోడు. ఆదర్శ పాలకులైన చక్రవర్తులలో నీ పేరే మొదటిది. నిన్ను సుతలానికి పంపుతున్నాను. పాతాళలోకాలకు అధిపతిగా శాంతిసుఖాలతో చిరంజీవిగా వుంటావు. నీ భార్య, నీ తాత ప్రహ్లాదుడు నీతోనే వుంటారు. నీ సుతల ద్వారాన్ని, నేనిప్పుడు కనబడుతున్నట్లే దండపాణినై కాపాలాకాస్తూ, నీకు రక్షగా ఉంటాను,'' అని చెప్పి అంతర్ధానమయ్యాడు.






బలిచక్రవర్తి సుతలలోకానికి చేరుకొని పాతాళసామ్రాట్టుగా ప్రతినిత్యం విష్ణు పాదాలను అర్చిస్తూ ఉన్నాడు. దేవతలకు స్వర్గమూ, దేవేంద్రుడికి స్వర్గాధిపత్యమూ తిరిగిలభించాయి.

బలి వుండే సుతలలోక ద్వారాన్ని వేత్ర దండాన్ని పట్టుకొని వామన రూపుడైన విష్ణువు కాపలా కాస్తుండగా, ఒకప్పుడు రావణుడు సుతలాన్ని జయించాలని వెళ్ళాడు. ఈ పొట్టివాడు నన్నేం చేయ గలడు అని ప్రవేశించబోగా, విష్ణువు మహోన్నత ప్రమాణానికి భయంకర రూపంతో పెరిగి కాలిగోటితో రావణుణ్ణి చిమ్మాడు. ఆ విసురుకు రావణుడు లంకలో సొమ్మసిల్లి పడ్డాడు.

తాను సుభిక్షంగా పాలించిన భూమీ్మద పంటలూ అవీ ఎలా ఉన్నాయో పరివేక్షించ డానికి సంవత్సరానికొకసారి బలిచక్రవర్తి అదృశ్యంగా వస్తాడు. సస్యాలకు పుష్టినీ, జీర్ణకారిత్వాన్నీ, బలాన్నీ కలుగజేస్తాడు, కీటక, క్రిమి బాధలు లేకుండా కాపాడు తాడు. అతని రాకకు స్వాగతంగా దీపావళి పండగ అతి వైభవంగా జరుగుతుంది. మర్నాడు బలి పాడ్యమిగా బలిని పూజి స్తారు. వామనుడి త్రివిక్రమాకాశ విజ యానికి గుర్తుగా ఆనందంతో ఆకాశ దీపాన్ని పెడతారు.

దక్షిణమహాసముద్రంలో బలిచక్రవర్తి భూమీ్మదకు వచ్చే ద్వారంగా ఒక ద్వీపం ఏర్పడింది. అది బలిద్వీపంగా పేరొందింది.

7. దత్తాత్రేయ చరిత్ర



బలిచక్రవర్తి వంశీకులైన పల్లవచక్రవర్తులు అతనిపేరున మహాబలిపురాన్ని శిల్ప సంపదలతో నిర్మించారు. కాంచీపురంలో ఉన్నతమైన త్రివిక్రమవామనావతార శిల్పాన్ని నెలకొల్పారు.

బలిచక్రవర్తి కీర్తి చిరస్థాయిగా నిలిచింది.

బలిచక్రవర్తి పాలనలో అణిగి మణిగి ఉండిన క్షత్రియులు తలలెత్తి విజృంభించారు. బలంగల వాడిదే భూమి అయిపోయింది. రాజుల నిరంకుశ పాలనలో జనులు తల్లడిల్లిపోయారు.

అప్పుడు విష్ణువు దశావతారాల్లో ఆరోది అయిన పరశురామావతారం ఎత్తి అడవుల్ని నరికినట్టుగా ఇరవై ఒక్కసార్లు క్షత్రియుల్ని గండ్రగొడ్డలితో నిర్మూలించి, ఎప్పుడు ఏది అవసరమో అది సాధించడానికి అవతరిస్తూంటాడని నిరూపించాడు.

నాటి ధరాతలాన్నేలే రాజులందరిలో మేటి,నాయకుడూ, సామ్రాట్టూ అయిన హైహయచక్రవర్తి కార్తవీర్యార్జునుడు సుదర్శనచక్రం అంశతో పుట్టాడు.

ఒకానొక సమయంలో విష్ణువు యోగనిద్ర తీస్తూండగా శంఖచక్రాలు వాదులాడుకున్నాయి.

"సహస్రకిరణుడైన సూర్యుణ్ణి తరిణబట్టిన రజంతో విశ్వకర్మ నన్ను రూపొందించాడు. వెయ్యి కోణాలతో గిర్రున తిరుగుతూ అనేకమంది రాక్షసుల్ని నేనే కదా ఖండించింది! నన్ను ధరించి విష్ణువు 'చక్రి' అని ఖ్యాతి పొందాడు! నీకు వట్టి ధ్వని తప్పితే మరేదీ చేతకాదు!" అని చక్రం పలికింది.

పాంచజన్య శంఖం, "ఔరా, చక్రపురుషా! ఎంత పొగరుగా మాట్లాడావు! భూమ్మీద పొగరుబోతైన రాజుగా పుట్టు! విష్ణువు మునికుమారుడై కట్టెలు కొట్టే గొడ్డలి మాత్రంతో, నీ పొగరు అంతమొందిస్తాడు!" అని శాపం పలికింది.

శాపం పొందిన చక్రపురుషుడు కార్తవీర్యార్జునుడై పుట్టి హైహయసామ్రాజ్యాన్ని

నాలుగు చెరగులా విస్తరింపజేశాడు. అతడు భగవంతుని అవతారమైన దత్తాత్రేయుడి భక్తుడు, శిష్యుడు. అతని అనుగ్రహంతో అణిమాది సిద్ధుల్ని, అనేక శక్తుల్నీ పొందాడు. అవసరమైనప్పుడు అనేక అయుధాలతో వెయ్యి చేతులు వస్తూండేవి....అని సూతమహర్షి చెప్పగా, నైమిశారణ్య మునులు, ''సూత మునీంద్రా! దత్తాత్రేయుడు విష్ణువు అవతారమేకదా, దత్తాత్రేయ చరిత్ర వినాలని కుతూహలపడుతున్నాము!'' అని అన్నారు.

సూతుడు దత్తాత్రేయకథ ప్రారంభించాడు :

అత్రిమహర్షి కుమారుడికోసం విష్ణువును తలంచుతూ గొప్ప తపస్సు చేశాడు.

ఇటు అటు బ్రహ్మ, మహేశ్వరులతో కలిసి విష్ణువు ప్రత్యక్షమై, ''అత్రిమహర్షీ! నేను నీకు దత్తుడిని అయ్యాను! మేము ముగ్గురమూ ఒక్కటే కనుక త్రిమూర్తుల అంశలతో నేను నీకు కొడుకునౌతాను! దత్తాత్రేయుడిగా పిలువబడతాను!'' అని చెప్పి బ్రహ్మమహేశ్వర సహితంగా అంతర్థానమయ్యాడు.

అదే సమయంలో నారదుడు త్రిమూర్తుల అర్థాంగులమని గర్విస్తూన్న సరస్వతి, లక్ష్మి, పార్వతుల ముందు



అత్రిమహాముని భార్య అనసూయ పాతివ్రత్య మహిమ సాటిలేనిదని సహేతుకంగా నిరూపించాడు. త్రిదేవీమూర్తులకు సాధ్యం కాని పనులు చేసింది ఆమె.

అనసూయ గంగను పీడిస్తున్న పాప పిశాచాలను నిర్మూలించింది.

నారదుడిచ్చిన ఇనుప గుగ్గిళ్ళను కమ్మగా పచనం చేసి యిచ్చింది. సూర్యుణ్ణి ఉదయించకుండా చేసిన సుమతిని ఒప్పించి, సూర్యోదయమైతే చనిపోయిన ఆమె భర్తను అనసూయ తిరిగి బ్రతికించింది.

దేవీమూర్తులు ముగ్గురికీ అనసూయపై పట్టరాని ఈర్ష్యపుట్టింది. భర్తలు రాగానే



అనసూయను భంగపుచ్చి రమ్మని పంపారు.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు యతీశ్వరుల వేషాలతో అత్రి ఆశ్రమానికి అతిథులుగా వెళ్ళి భవతీభిక్షాందేహి అని నిలబడ్డారు.

అప్పటికింకా అత్రిమహాముని తపస్సు ముగించి ఆశ్రమానికి చేరలేదు. అతిథి సత్కార బాధ్యతలన్నీ అనసూయ మీదనే పెట్టి వెళ్ళాడు.

అనసూయాదేవి అతిథులుగా యతిరూపులై వచ్చిన త్రిమూర్తులకు అతిథి మర్యాదలు జరిపి భోజనానికి కూర్చోమన్నది.

అప్పుడు కపటయతులు ముగ్గురూ ఏక కంఠంతో, "ఓ సాధ్వీ! మా కొక విడువరాని నియమమున్నది—అది అది...." అని నసుగుతూ "నీవు నగ్నంగా వడ్డిస్తేనే గాని తినేదిలేదు!" అని అన్నారు.

అనసూయ, "అలాగా! సరే!" అంటూ వారిమీద నీళ్ళు చిలకరించింది. ముగ్గురు అతిథులూ ముద్దులొలికే ముగ్గురు పసిపాపలైపోయారు.

అనసూయకు మాతృత్వం పొంగి వచ్చింది. పసివాళ్ళకు పాలబువ్వ మెత్తగా కలిపి తినిపించింది. ఒడిలో చేర్చుకొని లాలించి పాలిచ్చింది. త్రిమూర్తులు పసిపాపలై అనసూయ ఒడిలో కమ్మగా నిద్రలోకి జారిపోయారు.

అనసూయ ముగ్గుర్నీ ఉయ్యాలతొట్టిలో పరుండబెట్టి. "ముజ్జగాలేలే ముమ్మూర్తులు నా పాపలైనారు. అదృష్టం అంటే నాదే! బ్రహ్మాండమే వీళ్ళకు ఉయ్యాలతొట్టి; నాలుగు వేదాలే గొలుసులు, ఓంకార ప్రణవనాదమే జోలపాట!" అంటూ తియ్యగా జోలపాడింది.

అప్పుడే ఆశ్రమంలోకి ఒక తెల్లని లేగ ఎద్దు ప్రవేశించి ద్వారం ముందు నిలబడి తలాడిస్తూ మువ్వల సవ్వడి చేసింది.

పెద్ద గరుడపక్షి రెక్కలల్లార్చుతూ ఆశ్రమం మీద తిరగసాగింది.



ఒక రాజహంస వికసిత పద్మాన్ని కరుచుకొని ఎగురుతూ వచ్చి గుమ్మం ముందు వాలింది.

ముద్దొచ్చే నాలుగు రంగుల కుక్క పిల్లలు తోకలాడిస్తూ, ఇంట్లోకి చొరబడ్డాయి. వాటికి తోడు ఒక నాగుపడగ విప్పి ఆడుతూ వచ్చింది.

అంతలో మాహతి వీణపై నీలాంబరి రాగాన్ని పలికిస్తూ నారదుడూ, అతని వెనుక లక్ష్మి, సరస్వతి, పార్వతి వచ్చారు.

నారదుడు అనసూయతో, "అమ్మా, ఈ ముగ్గురమ్మల భర్తలకు చెందిన ప్రాణులు గుమ్మంలో కనిపిస్తూంటే, వాళ్ళిక్కడే ఉంటారని ఇలా వచ్చారు. ఇప్పటికే భర్తల ఎడబాటు వల్ల విరహంతో తల్లడిల్లిపోతున్నారు. వారి భర్తల్ని వారికిప్పించు!" అన్నాడు.

అనసూయ ముగ్గురమ్మలకూ నమస్కరించి సవినయంగా, "తల్లులూ! ఆ ఊయలలో పసివారే మీ వారైతే తీసుకెళ్ళండమ్మా!" అన్నది.

దేవీమూర్తులు ముగ్గురూ నివ్వెరబోయి చూశారు. పసివారు ముగ్గురూ ఒక్కలాగే ఉన్నారు. ఒకటిగా నిద్రపోతున్నారు. లక్ష్మి పార్వతి సరస్వతులు తటపటాయిస్తూంటే, నారదుడు, "ఎవరి భర్తని వారు ఎరక్కపోవడమేమిటి? సిగ్గుపడకండమ్మా. త్వరగా తీసుకోండమ్మా!" అంటూ తొందరచేయగా, ఒక్కొక్కరొక పిల్లవాణ్ణి తీసుకున్నారు.

పిల్లవాళ్ళు ముగ్గురూ ఒక్కసారిగా త్రిమూర్తులుగా నిలబడ్డారు. సరస్వతి శివుణ్ణి, లక్ష్మి బ్రహ్మను, పార్వతి విష్ణువును తీసుకున్నట్లు అప్పుడు తెలిసింది. ముగ్గురమ్మలూ సిగ్గుపడుతూ దూరంగా వెళ్ళి నిల్చున్నారు. అప్పుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు వరసగా కలిసిపోయే లాగ అంటిపెట్టుకొని నిల్చున్నారు.

అదేసమయానికి అత్రి ఇంటికి చేరుకున్నాడు. తన ఇంట త్రిమూర్తులను చూసి చేతులు జోడిస్తున్నంతలో, బ్రహ్మ

విష్ణుమహేశ్వరులు కలిసిపోయి, ఒకే ఒక మూర్తిగా దత్తాత్రేయుడు రూపొందాడు.

మధ్య విష్ణువు, ఇటు అటు బ్రహ్మ మహేశ్వరుల ముఖాలతో, ఆరు చేతులతో శంఖ, చక్ర, గదా పద్మాలు, త్రిశూలం కమండలంతో, భుజాన వ్రేలాడే జోలెలో భిక్షాపాత్రతో, త్రిమూర్తుల సమ్మేళన మూర్తిగా విష్ణువు దత్తాత్రేయావతారంతో అత్రి, అనసూయల కుమారుడైనాడు.

నారదుడు నాదనామక్రియా రాగంతో వీణ మ్రోగిస్తూ దత్తాత్రేయుణ్ణి స్తుతించాడు. శివుని వాహనమైన నంది దూడ ఎద్దుగా అతని వెనుక ఉంటుంది. నాలుగు వేదాలు నాలుగు కుక్కల రూపుతో వెంట ఉంటాయి. సర్పము, గ్రద్ధ, హంస పరిసరాల్లో అనుసరిస్తూంటాయి. దత్తాత్రేయుడు మహర్షిగా సదా వనాల్లో తిరుగుతూ ఏకాంతంగా ఆత్మానుసంధానంలో ఉంటాడు. అనేక దివ్యశక్తులను, సిద్ధులను ప్రసాదించే దత్తాత్రేయుణ్ణి మునులు, సిద్ధులు, జ్ఞానులు సదా ఆరాధిస్తూంటారు. హైహయ రాజవంశానికి ఆరాధ్యదైవంగా పూజింపబడ్డాడు.

కార్తవీర్యార్జునుడు దత్తాత్రేయుణ్ణి అర్చించి మహాబలసంపన్నుడై, సైన్యాలతో విజయయాత్ర బయలుదేరాడు.



జమదగ్ని మహర్షి కుమాళ్ళలో రాముడు చివరివాడు. ఎప్పుడూ గొడ్డలి పట్టి తిరుగుతూ ఆశ్రమాలూ, జనపదాలూ నిర్మించడానికీ, భూమిని సాగుచేయడానికీ అనుకూలంగా అరణ్యాలు నరుకుతూండడమే అతని పని. హిమాలయాల్లో తపస్సు చేసి శివుణ్ణి మెప్పించాడు. శివుడు అతనికి గొప్ప ప్రభావంగల పరశువును ప్రసాదించాడు. ఆ గొడ్డలిని ధరించి పరశురాముడు అని పేరుపొందాడు. భృగు సంతతి వాడవడం వల్ల భార్గవరాముడు అని కూడా పిలువబడ్డాడు.

ఒకప్పుడు పరశురాముడి తల్లి రేణుకా దేవి నదికి వెళ్ళి ఎంతసేపటికీ రాలేదు.

జమదగ్ని దివ్యదృష్టితో భార్య ఏం చేస్తూందో చూశాడు. చిత్రరథుడనే గంధర్వుడు అప్సరసలతో జలక్రీడ చేస్తూంటే, రేణుక ఆ విలాసాన్ని మైమరచి చూస్తూ ఉండిపోయింది. జమదగ్నికి కోపం వచ్చింది.

భార్య వచ్చాక కుమాళ్ళను పిలిచి తల్లి తల నరకమన్నాడు. పరశురాముని అన్నలు అంత పని చేయలేక పోయారు. అడవి నుంచి వచ్చిన పరశురాముడితో జమదగ్ని, "నీ అన్నల తలలనూ, మీ అమ్మ తలనూ నరుకు!" అని అన్నాడు.

పరశురాముడు మారాడకుండా తండ్రి అజ్ఞను శిరసావహించి, ఒక వేటున అన్నలనూ, తల్లినీ తెగటార్చాడు.

జమదగ్ని పరశురాముణ్ణి మెచ్చుకొని ఏం కావాలో కోరుకోమన్నాడు.

"అన్నల్నీ, అమ్మనూ బ్రతికించు!" అన్నాడు పరశురాముడు.

జమదగ్ని అలాగే వాళ్ళను బ్రతికించాడు. తన తపోమహిమ పట్ల పరశురాముడుకి గల విశ్వాసానికీ, సూక్ష్మబుద్ధికీ జమదగ్ని సంతసించి, "పరశురామా! నీవు కారణజన్ముడివి, చిరంజీవిగా ఉంటావు!" అని ఆశీర్వదించాడు.

కార్తవీర్యార్జునుడు విజయయాత్ర ముగించి తన రాజధాని మాహిష్మతీ నగరానికి వెళ్తున్న దారిలో, జమదగ్ని ఆశ్రమం తగిలింది. అప్పుడు రాజూ, పరివారమూ, సైన్యాలూ ఆకలితో ఉన్నారు.

జమదగ్ని కామధేనువు అంశగల తన హోమధేనువు మూలంగా వారందరికీ గొప్ప విందుచేశాడు. ఆ ఆవు ఏది కావలిస్తే అది ఎంత మందికైనా యిస్తుంది. కార్తవీర్యుడు అలాంటిది తన దగ్గర ఉంటే, సైన్యాలకు తిండి సమస్య లేకుండా అన్ని విధాలా ఉపకరించుకో వచ్చుననే దురాశతో సైనికులకు ఆవును మాహిష్మతీ నగరానికి తోలుకురమ్మని ఆజ్ఞాపించాడు. అడ్డు వచ్చిన జమదగ్నిని ముష్కరులైన సైనికులు నేలకు త్రోసి ఆవును యీడ్చుకెళ్ళారు.






పడిపోయిన జమదగ్ని మరణించినట్లే ఉండిపోయాడు. రేణుకాదేవి భర్తమీద పడి ఏడుస్తున్నది. అప్పుడే అరణ్యాల నుండి పరశురాముడు ఆశ్రమానికి వచ్చాడు. జరిగింది తెలుసుకొని పరశువును ఎత్తి ఝుళిపిస్తూ, వెనుదిరిగి చూడకుండా మాహిష్మతీ నగరానికి పరుగెత్తాడు

అంతలో భృగుమహర్షి ఎక్కణ్ణించో వస్తూ జమదగ్ని ఆశ్రమం చేరాడు. రేణుకను ఓదార్చి, జమదగ్నిలోంచి పోతున్న ప్రాణాన్ని తన యోగశక్తితో నిలబెట్టి బ్రతికించాడు.

అక్కడ మాహిష్మతీ నగరానికి తోలుకుపోయిన ధేనువును కోరిన వాటిని ఆశ్రమంలో యిచ్చినట్లుగా రాజధానిలో యివ్వలేదని సైనికులు కొడుతున్నారు, పొడుస్తున్నారు. సరిగా ఆ సమయానికి పరశురాముడు ప్రళయరుద్రుడై వచ్చాడు. సైనికులు పారిపోయారు. ఆవును పరశురాముడు దువ్వి ఆశ్రమానికి వెళ్ళు అన్నట్లుగా తట్టాడు. ధేనువు ఉరకలువేస్తూ వెళ్ళింది.

"ఓ రాజాధమా! సంరక్షకుడై ఉండవలసిన రాజు దుర్మార్గుడైనప్పుడు శిక్షించక తప్పదు. మేడదిగి ఇవతలికిరా!" అని పరశురాముడు రాజప్రాసాదం ముందు కేకవేశాడు.

కార్తవీర్యుడు మొదట పరశురాముణ్ణి సాధారణ మునికుమారుడనుకున్నాడు

**8. పరశురామావతారం**



పరశురాముడు ఇంటికివచ్చి తన తండ్రి క్షేమంగా ఉండడం చూసి తాను చేసినది చెప్పాడు.

జమదగ్ని, ''నాయనా! నువ్వు చేసినది మునులమైన మనకు తగని పని. అందుకు పరిహారంగా నువ్వు తపస్సు చేయాలి!'' అన్నాడు.

పరశురాముడు, ''తండ్రీ! రాజు అధర్మ పరుడైనప్పుడు శిక్షించ వలసిన అర్హత అందరికీ ఉంది! నీ ఆనతి గనుక నేను తపస్సు చేస్తాను కాని, ప్రాయశ్చిత్తంగా కాదు,'' అని చెప్పి అరణ్యానికి పోయి తపస్సులో మగ్నుడయ్యాడు.

గాని, అతని ధాటి తెలిశాక వెయ్యి చేతులతో ఎదుర్కొన్నాడు. ఇద్దరికీ ద్వంద్వ యుద్ధం సాగింది.

కార్తవీర్యార్జునుడు ప్రయోగించిన అస్త్రాలను, శస్త్రాలను పరశురాముడు గొడ్డలితో తుత్తునియలు చేశాడు. అతని వెయ్యి చేతులను చెట్టుకొమ్మలు నరికినట్లుగా తెగ్గొట్టాడు. కార్తవీర్యుడు మొండి బోదెగా కూలిపోయాడు. అప్పుడు అతనికి తాను శాపవశంతో పుట్టిన చక్రపురుషుడనని గుర్తుకొచ్చింది. పరశురాముడు విష్ణువే అని తెలిసి మనస్సులోనే దండం పెట్టి దేహం చాలించి వెళ్ళి సుదర్శన చక్రంలో లీనమయ్యాడు.

కార్తవీర్యుడి వెయ్యిమంది కుమాళ్ళు హైహయక్షత్రియులందర్నీ కూడగట్టుకొని జమదగ్ని ఆశ్రమం మీదకు విరుచుకు పడ్డారు. అప్పుడు జమదగ్ని నిశ్చలంగా తపస్సమాధిలో ఉన్నాడు. రేణుకాదేవి, ''రామా! రా!'' అంటూ ఎలుగెత్తి ఇరవై ఒక్కసార్లు పిలిచింది.

హైహయులు జమదగ్ని తలను నరికేశారు. రేణుక ఇరవైఒక్కసార్లు గుండెలు బాదుకొంటూ భర్త మొండెంమీద పడి విలవిలా విలపించి సొమ్మసిల్లింది. జమదగ్ని తల దొర్లుకుంటూ దూరంగా పోయి రాళ్ళ మధ్య చిక్కుకుంది. రాజపుత్రులు ఆశ్రమాన్ని తగలబెట్టారు.

అ మంటల్లో రేణుక, భర్త కళేబరంతో కలిసి కాలిపోయింది.

అరణ్యంలో తపస్సు చేస్తున్న పరశురాముడికి ధ్యానభంగం అయింది. తల్లి పిలుపు ఇరవైఒక్కసార్లు చెవుల్లో మర్మరంగా వినిపించింది. మనస్సు కీడు శంకించింది. ఒక్క అంగలో ఆశ్రమం చేరుకున్నాడు.



ఆశ్రమం తగలబడుతున్నది. తల్లీ, తండ్రీ మసి అయ్యారు. హైహయ సైనికులు ఆశ్రమవాసుల్నీ, వారించ వచ్చిన పరిసర జానపద జనుల్నీ అమానుషంగా చిత్రవధ చేస్తున్నారు.

పరశువును ప్రసాదించిన శివుణ్ణి స్మరించి, పరశురాముడు గొడ్డలిని తీసి జ్వాలలాగ లేచాడు. ముళ్ళపొదల్ని నరికినట్లుగా అందినవారి నందర్నీ హతమార్చాడు.

రాళ్ళమధ్య పడి ఉన్న జమదగ్ని తలను తీసి రొమ్ముకు అదుముకొని, "తండ్రీ! కన్నీరు కూడా రాకుండా నా గుండె జ్వలించి పోతున్నది. క్షత్రియుల రక్తంతో నీకు తర్పణం చేస్తాను. నీ తలను ఆ రక్తపు మడుగుల్లో ముంచి అంత్యక్రియలు చేస్తాను!" అని అంటూ పరశురాముడు ఉన్నత శిలాగ్రం మీదకు ఎక్కి పరశువును ఎత్తి, "ఈ గొడ్డలితో భూమ్మీద రాజన్నవాడు లేకుండా నరుకుతాను!" అని ఇరవై ఒక్కమార్లు గర్జిస్తూ ప్రతిజ్ఞ చేశాడు. దిక్కులు ప్రతిధ్వనించాయి. అతని భీషణ ప్రతిజ్ఞ విని బ్రహ్మ, మహర్షులు వచ్చి శాంత వచనాలు పలికారు.

భృగుమహర్షి, "నాయనా! దుర్మార్గుల్ని ఆ భగవంతుడే శిక్షిస్తాడు, సాధు సజ్జనుల్ని రక్షిస్తాడు! నువ్వు శాంతించు!" అన్నాడు.

పరశురాముడు, "ఆ భగవంతుడు ఆకాశంనుంచి ఊడిపడడు; మనిషిగా పుట్టి మనుషుల మధ్యే ఉంటాడు. అలాంటి వాడినే నేను అని పితామహులు



గ్రహించాలి. శాంతవచనాలతో నాకు పనిలేదు!'' అంటూ అదే పరుగున హిమాలయానికి వెళ్ళి శివుణ్ణి గూర్చి తపస్సు చేశాడు.

శివుడు ప్రసన్నుడై పరశురాముణ్ణి శాంతపరచ బోయాడు. పరశురాముడు, ''శివుడి ఆజ్ఞలేనిదే చీమైనా కుట్టదుగదా! లయమూర్తివైన నీకు చెప్పవలసింది లేదు. నా ప్రతిజ్ఞ నెరవేర్చడానికి కావలసిన బలాన్నియివ్వు!'' అన్నాడు.

శివుడు అతనికి అన్ని అస్త్రాలను యిచ్చి ప్రత్యేకమైన దివ్యాస్త్రాన్ని యిస్తూ, ''ఇది భార్గవాస్త్రంగా నీ పేరున నిలుస్తుంది! నీవు కారణజన్ముడివైన అవతార మూర్తివి! వెళ్ళు, నీకు అడ్డులేదు!'' అని ఆమోదంతో ఆశీర్వదించాడు.

పరశురాముడు గోలోకంలో విష్ణువు మరొక రూపంగా ఉండే కృష్ణుణ్ణి ధ్యానించి, కృష్ణ కవచాన్ని పొందాడు. కృష్ణుడు అతనికి తన అంశను గొప్ప ధనుస్సుతో కలిపి ప్రసాదించి, రామావతారంలో తిరిగి తీసుకుంటానని చెప్పాడు.

పరశురాముడు క్షత్రియులపై విజృంభించాడు. రాజుల దుష్పరిపాలనలో అగచాట్లు పడుతున్న జనానీకం అతని అండ చేరారు. కార్తవీర్యుడి కుమాళ్ళతో సహా హైహయులందరూ నగరం విడిచి పారిపోయారు. పరశురాముడు ఆగ్నేయాస్త్రాన్ని నగరంపై వేశాడు. పరశురామ ప్రీతిగా మాహిష్మతీ రాజధాని ఇరవై ఒక్క రోజులపాటు జ్వాలల్లో నామరూపాల్లేకుండా దగ్ధమైంది.

కార్తవీర్యుడి వెయ్యిమంది కుమాళ్ళూ, హైహయవంశ క్షత్రియులూ, దేశ దేశాల రాజులందరూ కూడగట్టుకొని పరశురాముణ్ణి ఎదుర్కొన్నారు. బలిపశుల్ని నరికినట్లుగా పరశురాముడు అందర్నీ తెగటార్చి, వాళ్ళ రక్తాన్ని ఐదు మడుగుల నిండా నింపి, జమదగ్ని తలను వాటిలో ముంచి, ముంచి పితృతర్పణం చేశాక అగ్ని సంస్కారం జరిపాడు.



శమంత పంచకం అనబడే ఆ అయిదు రక్తపు మడుగుల ప్రదేశమే తరువాతి కాలంలో కురుక్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. మరొకసారి బలికోరింది. మహాభారత సంగ్రామంలో అక్కడే రక్తం వరదలై పారింది.

పరశురాముడు యజ్ఞం చేసి శుచి చేసుకొని తండ్రికి ఉత్తరక్రియలు జరిపాడు. తరవాత క్షత్రియ సంహారానికి బయలుదేరాడు. వెతికి, వెతికి క్షత్రియుల్ని గండ్రగొడ్డలికి ఆహుతి చేశాడు. క్షత్రియ మాతలు వంశాంకురాలైన పిల్లల్ని బ్రాహ్మణుల ఇళ్ళల్లో దాచారు. తాము కూడా బ్రాహ్మణ కాంతలుగా వేషాలు మార్చుకొని. పసివాళ్ళను బ్రాహ్మణ బాలలుగా చేసి తల దాచుకొన్నారు.

ఆ విధంగా పరశురాముడు ఇరవైఒక్క సార్లు దేశాలు గాలించి క్షత్రియులనిపించుకొనేవారు కనిపించకుండా దండయాత్రలు చేశాడు. అతని ప్రతిజ్ఞ తీరింది. క్షత్రియ సంహారం చేశాక తన అధీనమైన భూమినంతటినీ కశ్యపుడికి దానంచేసి, వెళ్ళి దక్షిణ సముద్రంలో ఉన్న మహేంద్ర పర్వతం మీద తపస్సులో నిమగ్నుడయ్యాడు.

బ్రాహ్మణుల ఇళ్ళల్లో, మునుల ఆశ్రమాల్లో పెరిగి పెద్దవారైన క్షత్రియకుమారులందరికీ కశ్యప ప్రజాపతి పరశురాముడిచ్చిన రాజ్యాల భూముల్ని పంచియిచ్చాడు. రాజ్యాలు ఏర్పడ్డాయి. రాజవంశాలు తలలెత్తాయి.

అటువంటి రాజవంశాల్లో ఇక్ష్వాకు సంతతికి చెందిన రఘుమహారాజు గొప్ప కీర్తిగాంచి, రఘువంశానికి మూలపురుషుడయాడు.

రఘువంశంలో విష్ణువు దశరథమహారాజు పెద్ద కుమారుడుగా రామావతారం ఎత్తి, ఆదర్శ మానవత్వాన్ని ఆచరణలో చూపించాడు. రాక్షస సంహారం చేశాడు. రామరాజ్యంగా పేరు పొందేలాగ రాజ్యపాలన చేశాడు. రాజుగా ప్రజాభిమతాన్ని

బట్టి ఎలాంటి త్యాగాన్నైనా చేయక తప్పదని నిరూపించాడు.

"దశావతారాల్లో ఏడవది అయిన రామావతారం వాల్మీకిమహర్షి రచనలో రామాయణ కావ్యంగా విశేషవ్యాప్తి పొందింది." అని చెప్పి సూతమహర్షి రామకథను ప్రారంభించాడు.



హిరణ్యకశిపుడూ, హిరణ్యాక్షుడూ, విష్ణువుచేత హతులై, రెండో రాక్షస జన్మగా రావణుడూ, కుంభకర్ణుడుగా పుట్టి అడ్డూ అదుపూ లేకుండా, లోకభయంకరులై విజృంభించారు.

రావణాసురుడు గొప్ప తపస్సు చేసి బ్రహ్మవలన దేవ, యక్ష, గంధర్వాదులెవ్వరిచేతా హానిలేని వరాన్ని పొందాడు. మానవమాత్రులు తన్నేం చేయగలరనే నిర్లక్ష్యంతో నరులను కలపలేదు.

కుంభకర్ణుడు పర్వతాకారుడు. తపస్సు చేసి ఆరునెలలు నిద్ర, ఆరునెలలు జాగృతిగా వరం పొంది, మనుషుల్ని చంపి తింటూండేవాడు.

రావణుడు, కుబేరుడి పుష్పక విమానాన్ని లాక్కొని అతణ్ణి లంకనుంచి వెళ్ళగొట్టి, లంకానగరాన్ని స్వాధీనం చేసుకొని లంకేశ్వరుడై రాక్షసులైన వారినందర్నీ కూడగట్టుకుని, లోకాలు జయించి వీరవిహారం చేశాడు.

రావణుడు పదితలలవాడు. కైలాసం వెళ్ళి నందీశ్వరుడి ముఖాన్ని కోతిముఖమని వెక్కిరించి, కోతులవల్లనే లంకకు ముప్పు వాటిల్లుతుందని శాపం పొందాడు.

ఇరవై భుజాల తీటతీరేలాగ కైలాసాన్ని ఎత్తి, శివుడు కాలి బొటనవ్రేలితో నొక్కేసరికి పర్వతం కింద నలిగి పెద్ద పెట్టున ఆర్తారావం చేసి రావణుడు అనిపించుకున్నాడు. అంతకు ముందు దశకంఠుడని పిలువబడుతూండేవాడు.

రావణుడు ఒక్కొక్క తలను ఖండించుకొని శివుణ్ణి అనేక విధాలుగా స్తోత్రగానాలు చేసి, శివుడి అనుగ్రహం పొందగలిగాడు.

రావణుడు ఎంత గొప్ప శివభక్తుడో, అంత దురహంకారి. ఎంతటి పరాక్రమ వంతుడో అంత దుర్మార్గుడు. పరస్త్రీలను అపహరించుకు రావడం సాటిలేని ఘనత, ఎదురులేని వీరత్వంగా భావించి స్త్రీలను చెరపట్టడం అతనికొక పరిపాటి అయింది.

ఇష్టపడని కాంతను బలాత్కరించితే పదితలలు వెయ్యి చెక్కలౌతాయని శాపం కూడా సంపాదించు కున్నాడు.

రావణాసురుడి భార్య మండోదరి మయుని కూతురు. భర్త హితవు కోరి హితవు చెబుతూండేది. అతని సవతి తమ్ముడు విభీషణుడు ఉత్తముడు. రావణుడికి మంచి చెబుతూండేవాడు. కాని, రావణుడు ఒకరు చెబితే వినేలాంటి వాడు కాదు.

వింధ్య పర్వతానికి దక్షిణాన వున్న భూభాగమూ, సముద్రమూ, ద్వీపాలూ రావణరాజ్యంగా, లంకా మహాసామ్రాజ్యంగా రాక్షస సమూహాలు స్థావరంగా చేసుకొని, నరభక్షకులై, ఆర్యావర్తంలో యజ్ఞయాగాదులు జరక్కుండా ధ్వంసం చేస్తూ, ఋషులను చిత్రహింసలు పెట్టి వినోదిస్తూ, ఊళ్ళూ ఆశ్రమాలూ తగల బెడుతూ చెలరేగుతూండేవారు.

కృశధ్వజుడు అనే రాజర్షి వేదం చదువుతూండగా, పుట్టిన వేదవతి అనే కన్య విష్ణువును భర్తగా కోరుతూ తపస్సు చేస్తూండగా, రావణుడామెతో విష్ణువు కంటే తానే అధికుడననీ, తనతో వచ్చేయ మనీ ఆమె కొప్పు పట్టుకొన్నాడు.

వేదవతి, "దురాత్మా! నీవు తాకిన శరీరం విడుస్తున్నాను. నీ లంకలోనే నా అంతట నేను పుట్టి నీ సర్వనాశనానికే కారణం ఔతాను! విష్ణువే నన్ను వరిస్తాడు!" అని చెప్పి యోగాగ్ని రగుల్చు కొని దగ్ధమైపోయింది.

రాక్షస నిర్మూలనం చేసి లోక కల్యాణం చేకూర్చడం కోసం విష్ణువు అవతరించ వలసిన తరుణం వచ్చింది. విష్ణువు మాన వుడుగా, దేవతలు వానరులుగా జన్మించారు.






దశరథమహారాజు పుత్రకామేష్టి యాగం చేసి, అగ్నిదేవుడిచ్చిన పాయసపాత్ర అందుకుని, ఆనందపారవశ్యంతో కౌసల్యకు, కైకేయికి ఆ పాయసాన్ని పంచి యిచ్చాడు.

అతనికి కౌసల్య, సుమిత్ర, కైకేయి-ముగ్గురు రాణులు.

కౌసల్యాదేవి, సుమిత్రకుగాను తన కిచ్చిన దాట్లోంచి కొంత పాయసాన్ని వేరొక పాత్రలోకి తీసింది. అలాగే కైకేయి కూడా ఆ పాత్రలో తనకిచ్చిన పాయసం నుంచి తీసి కొంతవేసింది.

చైత్రశుద్ధ నవమినాడు కౌసల్యకు విష్ణువు రాముడుగా నీలమేఘం ఛాయగల శరీరకాంతితో పుట్టాడు.

తర్వాత కైకేయికి శంఖపద్మాల అంశతో ముత్యపు తెలుపుగల భరతుడు పుట్టాడు.

శేషుని అంశతో బంగారు వన్నెగల లక్ష్మణుడూ, చక్రగదల అంశతో పగడపు ఎర్రజీరతో శత్రుఘ్నుడూ, సుమిత్రకు పుట్టారు.

చైత్రశుక్లనవమి రామనవమిగా పేరొంది కోసల రాజ్యమంతటా ఆనందోత్సవాలు జరుగుతూండగా మూడో చైత్రం వచ్చింది. అయోధ్యానగరంలో చక్రవర్తి పెద్దకుమారుడి పుట్టినరోజు వేడుకలు, దానధర్మాలు ఘనంగా జరిగాయి.

చైత్రపౌర్ణమినాడు రాజసౌధం మీద విరిసిన వెన్నెట్లో నలుగురు చిరంజీవులతో,

9. రామావతారం



ముగ్గురు రాణులతో దశరథుడూ, మంత్రి సుమంత్రుడూ, రాముణ్ణి ఎత్తుకొని తిప్పి ఆడించే రాజబంధువూ, అంతరంగికుడూ అయిన భద్రుడూ చిత్రాన్నాలతో విందు చేసుకున్నారు.

కౌసల్య రాముణ్ణి ఎత్తుకొని చంద్రుణ్ణి చూపి ఆడిస్తూంటే రాముడు చందమామ కావాలని ఒకటే మారాం పెట్టి ఎన్ని విధాల బుజ్జగించినా ఏడుపు మానలేదు.

అప్పుడు సుమంత్రుడు ఒక అద్దాన్ని తెప్పించి రాముడి ముందుంచి, అందులో చంద్రబింబాన్ని చూపించాడు. రాముడు సంతోషంతో తననూ, చంద్రుణ్ణీ అద్దంలో చూసుకుంటూ, 'రామచంద్రుడు' అని ముద్దు ముద్దుగా అంటూ చిరుచేతులతో చప్పట్లు కొట్టాడు. అది మొదలు రామచంద్రుడు అనిపించుకున్నాడు.

తర్వాత భద్రుడు రాముడిని ఎత్తుకొని అద్దంలోకి చూపిస్తూ, "మరి ఇప్పుడో?" అన్నాడు.

రాముడు, "రామభద్రుడు!" అన్నాడు. ఆ విధంగా రామభద్రుడు అని కూడా అనిపించుకున్నాడు.

పిమ్మట లక్ష్మణ భరత శత్రుఘ్నులు రాముడి పక్కల చేరి అద్దంలో కనిపించారు. పైన నిండుచంద్రబింబం గొడుగు లాగ కనిపించింది. అందరికీ ఆ దృశ్యం రామ పట్టాభిషేకాన్ని స్ఫురింపజేసింది. దశరథుడి ఆనందానికి మేర లేదు. ముగ్గురమ్మలూ మురిసిపోయారు.

రాకుమారులు పెరుగుతున్నారు.

లక్ష్మణుడు ఎల్లప్పుడూ రాముడి వెన్నంటి వుండేవాడు. ఆ వెనుక, భరత శత్రుఘ్నులిద్దరూ జంటగా వుంటూ ఆడుకుంటూ ఒకే ప్రాణంగా వుండేవారు.

అన్న, తమ్ములు నలుగురైనా అంతా ఒకే పరిపూర్ణరూపంగా కనిపిస్తూండేవారు.

రాకుమారులు కులగురువైన వసిష్ఠ మహర్షి దగ్గిర విద్యావంతులైనారు.

రాముడు వయసుకి పిన్న అయినా పెద్దచదువులే చదివాడు; సర్వశాస్త్రాలూ,

వేద వేదాంగాలూ, ధర్మసూక్ష్మాలూ, యోగ రహస్యాలూ తెలుసుకున్నాడు.

వసిష్ఠుడు, "రామచంద్రా! మీ వంశ కర్త సూర్యుడు, నీవు రవి రాముడివి! ఇక్ష్వాకకుల తిలకానివి! నీ ముత్తాత రఘు మహారాజు గొప్ప కీర్తిగాంచిన వాడు. నీవు రఘువంశ సుధాంబుధి చంద్రుడివి! రఘు రాముడివి!" అని పేర్కొంటూ రాముణ్ణి ఆశీర్వదించాడు—అని సూతుడు చెప్పగా, నైమిశారణ్య మునులు, "సూత మునీంద్రా! సూర్యవంశ రాజుల చరిత్రలను విపులంగా వినగోరుతున్నాము!" అని కోరారు.



సూతుడు చెప్పసాగాడు:

మహాకల్పారంభంతో వివస్వంతుడు అనే పేరున ప్రకాశించిన సూర్యుడికి కుమారుడైన వైవస్వతుడు మనువు అయ్యాడు.

వైవస్వతమనువుకి ఇక్ష్వాకుడు మొదలైనవారు పదిమంది కుమాళ్ళు.

వారందరూ గొప్ప రాజులై ధరణిని ఏలారు. వారిసంతతి బాగా పెరిగింది. ఆ విధంగా సూర్యవంశం శాఖోపశాఖలై విస్తరించింది.

ఇక్ష్వాకుని సంతతివారైన ఇక్ష్వాకుల్లో దిలీపుడు, రఘువు గొప్ప ధర్మపరులైన చక్రవర్తులుగా పేరుపొందారు.

దిలీపమహారాజు సంతాన ప్రాప్తికోసం కులగురువైన వసిష్ఠుని ఆదేశానుసారంగా కామధేనువు అంశ అయిన నందినీ ధేనువును భక్తిశ్రద్ధలతో, అర్చిస్తూ, అడవుల్లో మేపుతూండగా, ఆవు ఒక గుహలోకి వెళ్ళింది. ఆ గుహలో ఒక భయంకరమైన సింహం ఆవును పట్టుకొంది. దిలీపుడు సింహాన్ని చంపడానికి ధనుస్సుకు బాణం సంధించబోతే, అతని చేయి స్తంభించి అలాగే ఉండిపోయింది.

అప్పుడు సింహం అతనితో, "ఓ రాజా! ఆవు నాకు లభించిన ఆహారం! నన్ను చంపబోవటం అధర్మం కనుకనే, నీ చేయి అలా వుండిపోయింది!" అన్నది.



అది విన్న దిలీపుడు, ''నన్ను ఆహారంగా తీసుకొని ఆవును విడిచిపుచ్చు.'' అని ప్రార్థించాడు. సింహం అదృశ్యమైంది.

నందినీ ధేనువు అతని భక్తికి సంతసించి, ఆ దృశ్యమంతా తాను కల్పించినదే అని చెప్పి సంతానప్రాప్తి కలిగేలా దిలీపుడికి వరమిచ్చి అనుగ్రహించింది.

దిలీపుడి కుమారుడే రఘుమహారాజు. రఘువు గొప్పదానపరుడుగా కీర్తిగాంచాడు. అతిథిగా వచ్చిన తపస్వి మనోవాంఛితాన్ని గ్రహించి, రఘువు తన రాణిని తపస్వి ఆశ్రమానికి తీసుకెళ్ళి దిగబెట్టి వచ్చాడు. తపస్వి తన తప్పు తెలుసుకొని పశ్చాత్తాపం పొంది, ఆమెకు సగౌరవంగా మ్రొక్కి రాజమందిరానికి పంపించాడు.

దానమిచ్చినదాన్ని తిరిగి పరిగ్రహించడానికి రఘువు సమ్మతించలేదు. రాణి తన్ను నరికి చంపమని భర్తను వేడుకొన్నది.

రఘువు ఎత్తిన కత్తి ఆమె మెడ మీద పూలరాశిగా పడింది. రాజదంపతుల మీద దేవతలు పూలవాన కురిపించారు.

రఘు మహారాజు తనది అంటూ ఏదీ మిగుల్చుకోకుండా సంపదనంతనూ దానం చేసినా చాలకపోగా, కుబేరుడి దగ్గిర ధనరాసులు తేవడానికి వెళ్ళాడు.

యక్షులు రఘువు అలకానగరాన్ని చేరకుండా, యక్ష మాయలన్నీ అతనిపై ప్రయోగించి విఫలులయ్యారు. కుబేరుడు రఘు మహారాజుకు సాదరంగా అనేక సంపదలనిచ్చి పంపాడు. రఘువు ఆ ధనాన్నంతనూ అర్థించేవారు మిగలకుండా పంచాడు.

రఘువు కుమారుడు అజుడు. అజ మహారాజు గొప్ప శూరుడు.

స్వయంవరంలో అజుణ్ణి భోజరాజ పుత్రిక ఇందుమతి వరించింది. అజుడు ఇందుమతితో బయలుదేరుతుండగా స్వయంవరానికి వచ్చిన రాజులందరూ ఒక్కుమ్మడిగా విరుచుకుపడ్డారు. అజుడు

వారినందర్నీ ఎదుర్కొని యుద్ధం చేసి గెల్చాడు.

అజుడు ఇందుమతితో ముచ్చటగా ఉద్యానవనంలో విహరిస్తూండగా, ఆకాశ మార్గాన వెళ్తూన్న నారదుడి వీణకు చుట్టిన దేవలోకపు పుష్పమాల జారి గాలితో యెగిరి వచ్చి ఇందుమతి మెడలో పడింది. వెంటనే ఆమె మరణించింది.

అజుడు ప్రియసతి వియోగానికి పరితపిస్తూండగా, నారదుడు వచ్చి అతణ్ణి ఓదార్చి ఇందుమతి పూర్వవృత్తాంతాన్ని చెప్పాడు :



హరిణి అనే దివ్యాంగన, తృణబిందుడు చేస్తూన్న తపస్సు భంగపుచ్చడానికి ఇంద్రుడు పంపగా, ఋషిశాపం వల్ల మనిషిగా పుట్టింది. శాపవిమోచనం కూడా ఋషి చెప్పాడు.

సుర పుష్పమాల పడడంతో ఆమెకు తాను సురకాంతను అనే స్ఫురణ కలిగి మానవ శరీరాన్ని విడిచి, దేవలోకానికి వెళ్ళిపోయింది.

అజుని కుమారుడు దశరథుడు. ఇక్ష్వాకు వంశీయులైన రాజులు దేవతలకు, రాక్షసులకు జరిగే యుద్ధాల్లో దేవతలకు సహాయంగా వెళ్లేవారు. అలాగే దశరథుడు కూడా ఇంద్రుడికి సహాయంగా శంబరాసురుడి మీదకు యుద్ధానికి వెళ్ళాడు. దశరథుడితో కైకేయి కూడా రణరంగానికి వెళ్ళింది. ఆ యుద్ధంలో రథచక్రం ఊడిపడకుండా కైకేయి కాపాడింది. దశరథుడు సంతోషించి రెండు వరాలు కోరుకోమన్నాడు. తనకు కావలసినప్పుడు ఆ రెండు వరాలు కోరుకుంటాననీ, అప్పుడు యివ్వమనీ కైకేయి చెప్పింది.

దశరథుడు ఒకనాటి చీకటి రాత్రి, పంటపొలాలు పాడుచేసే ఏనుగులను వేటాడ్డానికి వెళ్ళాడు. ఆ చీకటిలో కమండలువుతో నీరు ముంచుకొంటున్న శబ్దాన్ని ఏనుగు నీరు పీల్చుతున్నదని భావించి మునిబాలకుణ్ణి బాణంతో



చంపాడు. ఆ బాలుడు పెట్టిన కేకతో నిజం తెలుసుకొని దశరథుడు నీరు తీసు కెళ్ళి, అంధులైన బాలుడి తలిదండ్రుల దప్పిక తీర్చాక జరిగింది చెప్పాడు.

ఆ మునిదంపతులు పుత్రశోకంతో, "నువ్వూ, మాలాగే కుమారుణ్ణి తలంచు కొంటూనే ప్రాణాలు విడిచెదవు గాక!" అని దశరథుణ్ణి శపించి ప్రాణాలు విడిచారు.

సూర్యవంశపు రాజుల్లో శరణాగత రక్షణకు శిబిచక్రవర్తి కీర్తిగాంచాడు. శిబిని పరీక్షించడానికి ఇంద్రుడు పావురం గానూ, అగ్ని డేగగానూ వెంట తరుముతూ వచ్చాడు. పావురం శిబి తొడమీద వాలింది. పావురం బరువు మాంసాన్ని తన శరీరం నుండి తీసుకోమని శిబి డేగకు చెప్పాడు.

శిబి తన శరీరాన్ని ఎంత కోసి త్రాసులో వేసినా పావురంతో సరితూగలేదు. అప్పుడు శిబి తన్ను పూర్తిగా తీసుకోమని త్రాసు సిబ్బెలో కూర్చున్నాడు.

ఇంద్రుడూ, అగ్ని నిజరూపాలతో కని పించి శిబికి అనేక వరాలిచ్చి మెచ్చు కొన్నారు.

వసిష్ఠుడితో పోటీపడి గొప్ప తపో బలంతో, వసిష్ఠుడితో సమానంగా మహర్షిగా గుర్తింపు పొందిన విశ్వామిత్రుడు కూడా సూర్యవంశపు రాజే!

సూర్యవంశజుడు, ఇక్ష్వాకులకు చెందినవాడే అయిన అంబరీషుడు గొప్ప రాజర్షి, పరమ విష్ణుభక్తుడైన రాజు.

అంబరీషుకి లక్ష్మి తన అంశతో కుమార్తెగా పుట్టింది. ఆమె పేరు శ్రీమతి.

శ్రీమతి చిన్నతనం నుంచే విష్ణువును తన భర్తగా భావించి ఆరాధిస్తూ వచ్చింది.

శ్రీమతి సౌందర్యం ముల్లోకాల్లో చెప్పుకో బడింది.

నారదుడు తాను మాయాతీతుడననే అహంతో పర్వతుడనే మహామునితో ప్రగ ల్భాలు పలికాడు. పర్వతుడు కూడా నారదుడితో కలిసి త్రిలోక సంచారం చేస్తూండేవాడు.

నారదుడు పర్వతుడు కలిసి అంబరీషుడి దగ్గరకు వెళ్ళారు. అంబరీషుడు వారిని పూజించి, కుమార్తె శ్రీమతి చేత మునులిద్దరి పాదాలకు మ్రొక్కించి ఆశీర్వదించమన్నాడు.

విష్ణుమాయా ప్రభావం నారద, పర్వతుల్ని ఆవరించింది. శ్రీమతిని చూసి మైమరచి నాకంటే నాకు శ్రీమతితో వివాహం జరిపించమని అంబరీషుణ్ణి కోరారు. శ్రీమతి నాది అంటే నాది అని ఇద్దరూ వాదులాడుకోసాగారు. వెంటనే తమతో వివాహం నిశ్చయం చేయమని అంబరీషుణ్ణి ఒత్తిడి చేశారు.

అంబరీషుడు మునుల వాలకానికి దిగ్భ్రాంతుడై నోటమాట రాకుండా ఉండిపోయాడు. శ్రీమతి తనకు స్వయంవరం ఏర్పాటు చేయమని తండ్రితో చెప్పింది.

అంబరీషుడు నారద, పర్వతులతో, "మీ ఇద్దరికిద్దరూ మహర్షి శ్రేష్ఠులే! మీ ఇద్దరూ నన్ను ఇరుకులో పెట్టడం భావ్యంకాదు గనుక, నా కుమార్తెకు స్వయంవరం చాటిస్తున్నాను. స్వయంవరానికి మీరిద్దరూ రావలసిందిగా ప్రార్థిస్తున్నాను!" అని చెప్పాడు.

చిన్న ముఖాలు వేసుకొని మునులిద్దరూ వెళ్ళిపోయారు.

శ్రీమతిని ఎలాగైనా తనదిగా చేసుకోవాలని నారదుడికి ఊహలమీద ఊహలు, ఉపాయాలమీద ఉపాయాలు తోచాయి. నారదుడిని శ్రీమతి వరించకుండా ఉంటే చాలు అని పర్వతుడు తీవ్రంగా ఆలోచించ సాగాడు.

నారదుడు విష్ణువు దగ్గరికి వెళ్ళి మణికిరీటము, కౌస్తుభమణి, వైజయంతీ మాల మొదలైన విష్ణువేషాన్ని తనకు ఇవ్వమని అడిగాడు. విష్ణువు తన రూపాన్ని అలాగే నారదుడికి ఇచ్చాడు.

నారదుడు వెళ్ళాక పర్వతుడు వచ్చి విష్ణువును స్తుతించి, స్వయంవరంలో నారదుడి ముఖం కోతిముఖంగా మారేలాగ చేయమని కోరాడు. విష్ణువు సరే అని చెప్పాడు.





# విష్ణు కథ

శ్రీమతి స్వయంవరానికి దేశదేశాల రాజులు, ముల్లోకాల్లోని ప్రముఖులు అంతా వచ్చారు. విష్ణు వేషంతో నారదుడు స్వయంవర మంటపం ప్రవేశించగానే అంతా ఘొల్లున నవ్వారు. తన ముఖం కోతి ముఖంగా మారిందని తెలుసుకొని నారదుడు అవమానంతో ఉడికిపోయాడు.

శ్రీమతి విష్ణువును ధ్యానించింది. విష్ణువు ఆమె ముందు సాక్షాత్కరించాడు. శ్రీమతి మాలవేసి విష్ణువును వరించి, అతనితో వైకుంఠానికి వెళ్ళింది.

అది చూసి నారదుడు మరింత కోపంతో పర్వతుణ్ణి కూడగట్టుకొని అంబరీషుడిపై మండిపడ్డాడు. అడిగినప్పుడు తమకు యివ్వకుండా శ్రీమతిని విష్ణువుకి అప్పగించినందుకు అంబరీషుణ్ణి నాశనం చేయదలచి, శపించడానికి సిద్ధపడ్డారు. అప్పుడు విష్ణుచక్రం వచ్చి వారిని వెంట తరిమింది.

పర్వత నారదులిద్దరూ వైకుంఠానికి పరుగెత్తారు.

అక్కడ శ్రీమతితో ఉన్న విష్ణువును చూసి నారదుడు మరింత ఉడుకుమోత్తనంతో, "నువ్వు కూడా నీ శ్రీమతిని—అంటే నీ భార్యామణిని పోగొట్టుకొని విలపిస్తావు! నన్ను కోతిముఖంవాడిని చేసి మోసగించావు, వానరులే నీ సహచరులై సహాయపడతారు గాక!" అని విష్ణువును శపించాడు.

నారదుడి శాపానికి విష్ణువు మందహాసం చేశాడు. శ్రీమతి లక్ష్మీదేవిగా నిజరూపం

10. దుర్వాస గర్వభంగం



అప్పటినుంచీ అంబరీషుడికి ఎవరివల్లా ఎటువంటి హానీ జరగకుండా, తన చక్రం అతనికి రక్షణగా ఉండేలాగ విష్ణువు అనుగ్రహించాడు.

దుర్వాసుడికి తపోబల గర్వంతో బాటు తామసం ఎక్కువ. ఒకనాడు తన ఆశ్రమం నుండి బయలుదేర బోతూండగా, ఆనంద పారవశ్యంతో కన్నులు మూసి విష్ణుసం కీర్తన పాడుతూ వస్తున్న నారదుడు ఎదు రయ్యాడు.

''ఓహో, నారదా! కలహ భోజనంతో కడుపు నిండినట్టుందే! చాలా ఆనంద పారవశ్యంలో మునిగి ఉన్నావు!'' అంటూ దుర్వాసుడు నారదుణ్ణి పలకరించాడు.

నారదుడు కళ్ళు తెరిచి వంగి వంగి నమ స్కరిస్తూ, ''దుర్వాసుల వారికి ప్రణా మాలు! అలాంటి దేమీపడక నకనకలాడు తున్నదే గాని, మహర్షీ! విష్ణుభక్తి తత్పరు లైన వారిని చూసినపుడల్లా నాకు పర మానందం పొంగుతూనే ఉంటుందాయె. అంబరీషుణ్ణి చూసి ఇలా వస్తున్నాగదా మరి....,'' అన్నాడు మరొకసారి వంగి వంగి ప్రణామం చేస్తూ.

''అంతటివాడా, అంబరీషుడు?!'' అన్నాడు దుర్వాసుడు.

''ఔను, మహర్షీ! విష్ణువు అనుగ్రహం పొందిన రాజర్షిసత్తముడు, ద్వాదశీ

పొందింది. మునులను ఆవరించిన మాయ తొలగింది. జరిగినదానికి సిగ్గుపడుతూ నారద పర్వతులు విష్ణు పాదాల మీద పడ్డారు.

నారదుడు విష్ణు పాదాన్ని కన్నీటితో తడుపుతూ, శపించినందుకు నొచ్చు కొంటూంటే విష్ణువు నెమ్మదిగా మంద హాసం చేస్తూ, నారదుడి తల నిమిరి, ''నారదా! త్రికాలవేత్తవైన నువ్వు విచా రించడమేమిటి! నీ నోటిమాట అమోఘం. నువ్వు శపించింది కూడా నా సంకల్పమే! నా రామావతార సమయంలో అలాగే జరుగుతుందిలే! అదీ లోకకల్యాణం కోసమే!'' అని చెప్పాడు.

వ్రతం అతని ప్రాణం!'' అన్నాడు నారదుడు.

''ఏమిటి నారదా! ఆ రాజును తెగపొగి డేస్తున్నావు?!'' అన్నాడు దుర్వాసుడు.

''అతణ్ణి చూస్తే తెలుస్తుంది, పొగడ్త కాదని! నీలాంటి మహర్షీశ్వరుడు అతని సదనాన్ని పావనం చేయడం వల్ల, అతని జన్మ ధన్యమౌతుంది, చరితార్థుడై మరింత వినుతికెక్కుతాడు!'' అని చెప్పి నారదుడు నారాయణ నామ జపం చేస్తూ వెళ్ళాడు.

నారదుడి మాటలు దుర్వాసుణ్ణి రెచ్చగొట్టాయి. అంబరీషుడి దగ్గిరికి బయలుదేరాడు.

ఏకాదశి ఉపవాసం చేసి, ద్వాదశీ వ్రత సమాప్తిగా అప్పుడే భుజించడానికి అంబరీషుడు సిద్ధమౌతున్నాడు. దుర్వాసుడి రాకకు పరమానంద భరితుడై, అర్ఘ్యపాద్యాదులతో పూజించి, భోజనానికి ఆహ్వానించాడు.

దుర్వాసుడు నదిలో స్నానం చేసి వస్తానని చెప్పి వెళ్ళాడు. వెళ్ళినవాడు ఎంతకూ తిరిగి రాలేదు. ద్వాదశిఘడియలు మించిపోతున్నవి: ద్వాదశి దాటకుండా భోజనం చేయకపోతే వ్రతభంగం అవుతుంది. అతిథి రాకుండా తింటే దోషమౌతుంది!



అప్పుడు విజ్ఞులైన పెద్దలు అంబరీషుడితో కొంచెం నీరు చప్పరించితే వ్రత భంగమూ కాదు, అతిథి రాకుండా భుజించిన దోషమూ అంటదు అని చెప్పగా అలాగే అతను జలపారణం చేశాడు.

ద్వాదశి పోయి త్రయోదశి వచ్చినట్లే హుటా హుటిగా ఆగ్రహావేశంతో పట పట పళ్ళు కొరుకుతూ, జటాజూటాన్ని విప్పి విదలిస్తూ దుర్వాసుడు వచ్చాడు.

''ఓ రాజాధమా! విష్ణుభక్తుడి నంటూ గర్వించి ఆతిథ్యధర్మానికి అపచారం చేస్తావా? నాకే అవమానం తలపెట్టడానికి నీ కెన్ని గుండెలు? నేనెవర్నో తెలుసా? నా పేరు వింటేముల్లోకాలూ, ముమ్మూ



ర్తులూ గడగడలాడవలసిందే! నా శాపానికి తిరుగులేదు. దుర్మరణం పాలౌతావు గాక!'' అని హుంకరిస్తూన్న దుర్వాసుడి పాదాల మీద తలవాల్చి అంబరీషుడు, ''ఋషీశ్వరా! వ్రత భంగం కాకుండా వుండేందుకు జలపారణం మాత్రమే చేశాను. మన్నించమని వేడుకొంటున్నాను!'' అన్నాడు.

దుర్వాసుడు అంబరీషుని తలను తన్ని, ''దుర్వాసుడి కోశంలో మన్నించడం అనేది లేదు! భక్తీ, తపశ్శక్తుల్లో ఏది గొప్పదో నువ్వు స్వయంగా చూద్దువుగాని!'' అని అంటూ జటాజూటాన్ని సింహంలాగ విదల్చాడు.

దుర్వాసుడి తపోమహిమ అంతా అతని జడల్లో అనేక శక్తులుగా నిక్షిప్తమై వుంది. పొడవైన ఒక జడను తీసి పట్టుకొని మరో చేత్తో యోగదండాన్ని ఎత్తి ఆడిస్తూ జడను ఝుళిపించాడు.

జడ నుండి నిప్పురవ్వలు విరజిమ్ముతూ దట్టమైన నల్లని పొగలు సుడులు తిరుగుతూ ఆకాశానికి లేచాయి. ఆ పొగల్లో భయంకరాకారంతో పర్వతంలా కృత్య అనే మహా భూతం ఆవిర్భవించింది.

కృత్య ప్రళయభీకరంగా గర్జిస్తూ అంబరీషుడిని చంపడానికి వురకబోతున్న మరుక్షణంలో అతనికి రక్షణగా విష్ణువు అనుగ్రహించిన చక్రం జ్వాలలు కక్కుతూ రివ్వునవచ్చి కృత్యను ముక్కలు ముక్కలుగా నరికి మటుమాయం చేసింది. అదిచూసి దుర్వాసుడికి ముచ్చెమటలు పోశాయి.

కృత్యను నాశనం చేసిన విష్ణుచక్రం అంతటితో ఆగక, దుర్వాసుడి మీదకు వెళ్ళింది.

దుర్వాసుడు మరొక జడను పెరికి విసిరాడు. పర్వతమంత వజ్రపాషాణం అడ్డునిలిచింది. చక్రం దాన్ని తుక్కుతుక్కుగా తూలగొట్టి దుర్వాసుణ్ణి వెంబడించింది.

ఇంకొక జడను ఋషి విసిరాడు! ఆకాశమంత మంచు మేఘం ఏర్పడి వెనువెంటనే చక్ర జ్వాలల్లో ఆవిర్లు గక్కుతూ హరించిపోయింది.

దుర్వాసుడు పరుగెత్తుతూంటే అతని జటాజూట మంతా వెంట తరిమే చక్ర జ్వాలలు తగిలి మసి మసి అయింది. ఈ విధంగా అతడి తపశ్శక్తి అంతా ఆహుతి అయిపోయింది.

చెట్టనక పుట్టనక, అడవులు నదులు పర్వతాలు దాటుతూ, దుర్వాసుడు పరుగెత్తుతున్నాడు. చక్రం తరుముకొంటూ వస్తోంది; మునిని ముల్లోకాలు తిప్పింది. దుర్వాసుడు బ్రహ్మలోకానికి పరుగు తీస్తుంటే నారదుడు ముసి ముసి నవ్వులతో, "హా! దుర్వాసులవారేనా! ఏమిటా పరుగు?" అని అంటూంటే మారు మాట రాక వెన్నెంట వస్తోన్న చక్రాన్ని చూపిస్తూ దుర్వాసుడు అదే పరుగున బ్రహ్మముందు పడ్డాడు.

"నేను విష్ణునాభికమలంనుంచి వచ్చిన వాణ్ణి. నేనేం చెయ్యగలను? చక్రాన్ని వారించగలనని ఎలాగ అనుకున్నావు, దుర్వాసా?" అన్నాడు బహ్మ.

"బ్రహ్మవని వస్తే ఇంతేనా నీ పస! నన్ను రక్షించగల ఆ మహేశ్వరు డున్నాడులే!" అన్నాడు ఋషి.



"ఔను, ఔను, దుర్వాసా! ఆ మాటా నిజమే. ఎంత త్వరగా వెళ్తావో కైలాసానికి, వెళ్లు వెళ్లు!" అన్నాడు బ్రహ్మ చేతులు దులుపుకొంటూ.

కైలాసానికి వెళ్ళి దుర్వాసుడు శివుణ్ణి రక్షించమని మొరపెట్టాడు.

"చక్రం విష్ణువుది. కోరి విరోధం తెచ్చుకో మన్నావా? వెళ్ళు. నీ దురహంకారానికి ఫలితం అనుభవించక తప్పుతుందా మరి! వెళ్ళు, వెళ్ళు!" అన్నాడు శివుడు.

దుర్వాసుడు వైకుంఠానికి పరుగెత్తి విష్ణువు ముందు పడి, దీనాతి దీనంగా చక్రాన్నివారించమంటూశరణువేడాడు.



''అంబరీషుడికి రక్షగా నా చక్రాన్ని ఎప్పుడో అనుగ్రహించాను. అందువల్ల, ఇప్పుడు నేనేం చేసేది మహర్షీ? అంబరీషుణ్ణే చక్రాన్ని వారించమని అర్థించు!'' అన్నాడు విష్ణువు.

దుర్వాసుడు హతాశుడై లేచాడు. అతని అహంకారం నశించింది. అతని తల బోసి పోయి వుంది. తపశ్శక్తి అంతా తుడుచుకు పోయింది, భక్తి ముందు తపశ్శక్తి ఎందుకూ పనికి రాదని తెలిసింది. అంబరీషుడి దగ్గిరకు బయలుదేరాడు. చక్రం శాంతంగా వెంట వెళ్తున్నది. దుర్వాసుడు పాదాలు పట్టుకోబోతూంటే అంబరీషుడు వారించి, లేవనెత్తి చక్రాన్ని ఆగమన్నాడు. చక్రం వెనక్కు మళ్ళి కొంతసేపటికి అదృశ్యమైంది.

అగ్రగణ్యులైన విష్ణువు భక్తుల్లో అంబరీషుడు పేరు పడ్డాడు.

సూర్యవంశ రాజుల్లో గాధి ఒక ప్రముఖుడు. గాధి కుమారుడు విశ్వామిత్రుడు, కృశాశ్వుడి దగ్గిర ధనుర్విద్య నేర్చాడు. అనేక అస్త్రాల్ని పొందాడు. అస్త్రవేత్తగా పేరు పొందాడు.

విశ్వామిత్రుడు రాజ్యపాలనకు వచ్చాక ఒకనాడు సపరివారంగా వసిష్ఠుని ఆశ్రమానికి వెళ్ళాడు వసిష్ఠ మహర్షి తన హోమధేనువు మహిమ వల్ల అందరికీ గొప్ప విందు చేశాడు.

పదిలక్షల గోవులను తీసుకొని హోమధేనువును ఇమ్మని విశ్వామిత్రుడు అడిగాడు; వసిష్ఠుడు యివ్వనన్నాడు.

విశ్వామిత్రుడు బలాత్కారంగా గోవును పరివారంచేత తోలించుకొని వెళ్ళబోతూంటే, వసిష్ఠుడు తన తపోబలంతో హోమధేనువు నుండి అనేక మంది శబర యోధుల్ని పుట్టించాడు.

విశ్వామిత్రుణ్ణి అతని పరివారాన్ని ధేనువు నుండి వచ్చిన యోధులు చిత్తుచిత్తుగా తరిమికొట్టారు.

రాజరికం కంటే తపోబలం మిన్న అని తెలుసుకొని విశ్వామిత్రుడు రాజ్యం

విసర్జించి అనేక సంవత్సరాలు గొప్ప తపస్సు చేశాడు. తపస్సు సాధించి వసిష్ఠుడితో సమానుడనిపించుకున్నాడు. అప్పటినుంచి విశ్వామిత్రుడు వసిష్ఠుడితో పోటీగా వుంటూ వచ్చాడు.

రావణుడి అనుచరులైన రాక్షసులు తమ తమ బలాలతో ఆర్యావర్తం మీద విరుచుకుపడి యజ్ఞయాగాల్ని ధ్వంసం చేస్తూ, మునులను ఋషులను బాధించి, ఆశ్రమాలు తగలబెట్టసాగారు.

విశ్వామిత్రుడు గొప్ప యాగం తల పెట్టాడు. అది జరగకుండా మారీచుడు, సుబాహుడు అనే రాక్షస ప్రముఖులూ, తాటక అనే రాక్షసీ పట్టుదలతో ధ్వంసం చేస్తున్నారు.

విశ్వామిత్రుడు యాగభంగానికి చింతాక్రాంతుడై, హిమాలయ ప్రాంతంలో ఉన్న తన సిద్ధాశ్రమంలో ధ్యానమగ్నుడై కూర్చున్నాడు.

ఆ ధ్యానసమాధిలో అతనికి విష్ణువు అవతారంగా సూర్యవంశంలో, రఘువు సంతతిలో పుట్టి పెరుగుతూన్న రాముడు కనిపించాడు!

లోకకల్యాణం కోసం రాక్షసనిర్మూలన చేయవలసి ఉన్న రాముడికి వసిష్ఠుడు నేర్పిన శాస్త్రవిద్య లెందుకూ అక్కరకు రావు! అస్త్ర, శస్త్ర విద్య, ధనుర్విద్యాపాటవం కావాలి! వాటిని అందించగల గురువు అతనికిప్పుడు కావాలి! రాముడికి అస్త్రాలు ఉపదేశించగల సమర్థుడు విశ్వామిత్రుడు ఒక్కడే!

విశ్వామిత్రుడికి ధ్యానసమాధిలో లక్ష్మిదేవి సీతగా జనకుని కూతురుగా పెరుగుతున్నది కూడా కనిపించింది. సీతారాముల కల్యాణం కూడా త్వరలో జరగాలి.

రాముడి వల్లనే తన యాగరక్షణ కూడా జరగాలి! తనకు తెలిసిన అస్త్ర విద్యనంతా రాముడికి ఉపదేశించి, అస్త్రవిద్యాకోవిదుణ్ణిగా చేయవలసిన బాధ్యత తనదిగా గుర్తించి విశ్వామిత్రుడు అయోధ్యకు బయల్దేరాడు.





# విష్ణు కథ

లక్ష్మిదేవి వేదవతిగా అవతరించి తపస్సు చేస్తున్నప్పుడు రావణుడు కొప్పు పట్టుకున్న కారణంగా యోగాగ్నితో ఆమె దహించుకుపోయి లంకలో పుట్టింది.

లంకా పట్టణాన్ని అనుసరించుకొని అందమైన గొప్ప సరోవరం ఉన్నది. ఎప్పటిలాగే ప్రాతఃకాలాన్నే రావణుడు ఆ సరోవరంలో స్నాన సంధ్యలువార్చి శివార్చనకు తామరపువ్వుల్ని ఏరుతూండగా, ఒక పెద్ద తామర పువ్వు సరోవర మధ్యంలో ధవళకాంతుల్ని ప్రసరిస్తూ కనుపించింది: దాని దగ్గరికి చేరుతూండగా ఆ పువ్వులో బంగారంలాగ మెరిసిపోతున్న అందమైన స్త్రీశిశువు క్యారుమంటూ కనిపించింది.

ఆ పసిపిల్లను చూసి రావణుడు ముచ్చట పడుతూండగా అశరీరవాణి, "ఓ రావణా! ఆ బిడ్డ నీకూ, నీ లంకకూ చేటుగా పుట్టిన బిడ్డ!" అని వినిపించింది.

రావణుడు రాక్షసవీరభటులకు ఆ పసిపాపను చంపి రండని ఉత్తరువు చేశాడు.

ఆ పసిపాప ఏం చేసినా చావలేదు. కత్తులు అదృశ్యమైనాయి. అగ్ని ఆరిపోయింది. రాతిబండలు పూలకుప్పలైనాయి. క్రూరమృగాలు పారిపోయాయి.

రాక్షసులు విసిగి ఆ పిల్లను పంచలోహాలతో చేసిన పెట్టెలో పెట్టి గట్టిగా బంధించి సముద్ర మధ్యంలో పడవేశారు.

ఆ పెట్టె సముద్రాన్ని దాటి భూమిని చీల్చుకొని భూగర్భంలోకి అలా వెళ్ళింది.

**11. సీతారామ కళ్యాణం**



మిథిలా రాజ్యాన్నేలే జనకమహారాజు గొప్పజ్ఞాని, రాజర్షి. యజ్ఞం కోసం చదును చేయడానికి భూమిని దున్నిస్తున్నాడు. నాగలి చాలుకు ఖణేల్మని పెట్టె తగిలింది. పెట్టెను తీసి అందులో ముద్దులు మూటగట్టే బంగారుపాపను జనకుడు తనకు భూదేవి ప్రసాదించిన కుమార్తెగా ఎత్తుకొన్నాడు.

నాగేటిచాలుకు సీత అని పేరు. నాగలి చాలుకు దొరికినందు వల్ల ఆ పిల్ల 'సీత' అనీ, జనకుని కుమార్తె కనుక 'జానకి' అనీ భూమిలో దొరికి నందువల్ల 'భూజాత' అనీ పిలువబడుతూ అల్లారుముద్దుగా పెరిగింది.

సీత తోటి పిల్ల స్నేహితురాండ్రతో ఆడుతూ, బంతిని వెతుకుతూ పూలతో పూజింపబడి ఉన్న పెద్ద ధనుస్సును బెండు ఎత్తినట్లుగా ఎడమచేత్తో ఎత్తి దాని చాటున వున్న బంతిని తీసుకుంది. తర్వాత ఆ ధనుస్సు ఆటకు బాగుందని అవలీలగా తీసుకువచ్చి బొమ్మరింటి గోడలాగ పెట్టి, ఆట సాగించింది.

జనకుడు కళ్ళారా అదంతా చూసి నిర్విణ్ణుడైపోయాడు.

ఆ ధనుస్సు జనకుని పూర్వీకులు శివుడి దగ్గిర్నుంచి పుచ్చుకొని పూజిస్తూ వచ్చారు. త్రిపురాసుర సంహారంలో శివుడు ఆ వింటితోనే యుద్ధంచేశాడు. ఆ శివధనువును ఎత్తాలంటే బలాఢ్యులైన వారు మూడు వందలమంది ఉంటేనే గాని సాధ్యపడదు.

అలాంటి వింటిని ఎత్తిన సీత సామాన్యురాలు కాదనీ, ఆ శివధనుస్సును ఎత్తి ఎక్కుపెట్టగల వాడు మాత్రమే సీతకు తగ్గ వరుడనీ జనకుడు అనుకున్నాడు.

సీతకు స్వయంవరం జరిపినప్పుడు ముందు ఆ విషయాన్నే చాటిచెప్పి, అటువంటి వాడికే యిచ్చి కళ్యాణం జరపాలని నిశ్చయం చేసుకున్నాడు.

సీత మిథిలానగరంలో అలాగే పెరిగి పెద్దదైంది.

విశ్వామిత్రుడు యాగరక్షణకు రామ లక్ష్మణులను పంపమని దశరథుణ్ణి అడి గాడు. అందుకు దశరథుడు, "రాక్షసుల నుండి యాగరక్షణకు పసివాళ్ళను ఎలాగ పంపమంటావు, మహర్షీ! వాళ్ళు, అస్త్రవిద్యలు యింకా నేర్చుకో వలసిన వాళ్ళు!" అన్నాడు.

"అందుకేగదా నేను వచ్చినది! రాచబిడ్డలకు ఏ విద్య కావాలో నాకు తెలుసు. ఆ విద్య నేను నేర్పుతాను!" అంటూ విశ్వామిత్రుడు వసిష్ఠుడిని సగర్వంగా చూశాడు.



వసిష్ఠుడు చిరునవ్వుతో విశ్వామిత్రుణ్ణి మెచ్చుకొని, రామలక్ష్మణుల్ని, అతనితో పంపమని దశరథుడితో చెప్పాడు.

రామలక్ష్మణులు మునులకు మల్లే జుత్తు ముళ్ళు వేసుకొని విశ్వామిత్రుడి వెంట ధనుర్బాణాలు ధరించి బయలు దేరారు.

దారిపొడవునా విశ్వామిత్రుడు వారికి ధనుర్విద్యా విశేషాలు బోధిస్తూ సిద్ధాశ్ర మానికి తీసుకెళ్ళాడు.

రామలక్ష్మణులు విశ్వామిత్రుని సుని శిత శిక్షణలో ధనుర్విద్యాపారంగతు లయ్యారు. విశ్వామిత్రుడు ఋషులతో కలిసి యాగం మొదలు పెట్టడానికి ఏర్పాట్లు చేస్తూండగా భయంకరంగా అరుచుకుంటూ తాటక పిడుగులాగ ఆశ్రమం మీద పడింది.

విశ్వామిత్రుడు తాటకను చంపమని రాముడికి ఆనతిచ్చాడు. రాముడు తాట కపై శరపరంపర కురిపించాడు. ఒంటి నిండా దట్టంగా బాణాలు గుచ్చుకొని తాటక పెద్ద పర్వతంలాగ భూమిమీద పడి విల విలా తన్నుకొని ప్రాణాలు విడిచింది.

విశ్వామిత్రుడు రాముణ్ణి, అతని బాణ ప్రయోగ కౌశలానికి మెచ్చుకొన్నాడు.

యాగం ప్రారంభమయింది. విశ్వా మిత్రుడు రాముడికి అస్త్రాల్ని ఉపదేశిం చాడు. రామలక్ష్మణులు ధనుర్ధరులై తిరు గుతూ యాగరక్షణ చేస్తున్నారు.




మారీచుడు, సుబాహుడు ఒక్కుమ్మడిగా విరుచుకు పడ్డారు. రాముడు రెండే బాణాలు విడిచాడు. సుబాహుడు చచ్చాడు. మారీచుడు బాణం దెబ్బతిని కొసప్రాణాలతో సముద్రంలో పడి కొట్టుకు పోతూ ఎలాగో లంక చేరాడు.

యాగం నిర్విఘ్నంగా సాగింది. విశ్వామిత్రుడు యాగసమాప్తిలో రాముడి చేత హవిస్సులు వేయించి హోమం చేయించాడు. యజ్ఞకుండం జ్వాలలపై తేలుతూ అర్ధచంద్రాకారం మొనగల ఒక బాణం దివ్యకాంతులీనుతూ వచ్చింది.

విశ్వామిత్రుడు, ''రామా! అది నీ బాణం. 'రామబాణం' అని పేరొందుతుంది. శత్రువు కంఠం నరికి తిరిగి నీ చేతికి వస్తుంది!'' అని చెప్పి బాణాన్ని రాముడికి అందించాడు. రాముడు బాణాన్ని కళ్ళకు అద్దుకొని పొదిలో పెట్టుకొని విశ్వామిత్రుడి పాదాలకు ప్రణమిల్లాడు.

యాగం చాలా కాలంగా సాగింది. ఆ కాలంలోనే విశ్వామిత్రుడు రాముడికి మహాస్త్రాలన్నీ ఉపదేశించాడు.

''రామా! నేనూ, నువ్వూ సూర్యవంశం వాళ్ళం. నాకు తెలిసిన అస్త్రవిద్యనంతా నీకు ఉపదేశించి నందుకు నా కెంతో తృప్తిగా ఉంది. నీలాంటి వాడికి గురువు ననిపించు కుంటున్నందు కెంతో ఆనందంగా ఉంది!'' అన్నాడు విశ్వామిత్రుడు.

''గురుదేవా! నీ కృపకు పాత్రుడనైన నేను ధన్యుణ్ణి!'' అన్నాడు రాముడు.

విశ్వామిత్రుడి సిద్ధాశ్రమంలోనే రాముడు, లక్ష్మణుడు యౌవనవంతులయ్యారు.

ఒకనాడు అస్త్రాలప్రయోగ విశేషాంశాలు చెప్తూ విశ్వామిత్రుడు, రాముణ్ణి తనివితీరా చూస్తూ, ''రామా! నీ విశాల నయనారవిందాలు శాంతిచంద్రికలు వెదజల్లుతూ, నా ఆశ్రమాన్ని శాంతినిలయంగా చేయగా నీవు శాంతరాముడివి; సుందర రాముడివి!'' అన్నాడు.

తన వెంట రమ్మన్నట్లుగా విశ్వామిత్రుడు బయలుదేరాడు. రామలక్ష్మణులు అనుసరిస్తున్నారు. విశ్వామిత్రుడు మిథిలానగరం దారి పట్టాడు.



దారిలో గౌతమాశ్రమం మీదుగా వెళ్తూండగా, రాముడి పాదం తగిలి ఒక బండరాయి అహల్యగా మారి రాముడి పాదాలకు ప్రణమిల్లింది. రాముడు ఆశ్చర్యంతో వెనక్కు జరిగాడు.

అదే సమయానికి చిరకాలంగా చేస్తూన్న తపస్సు చాలించి గౌతమ మహర్షి వచ్చాడు.

రాముణ్ణి భక్తిగా చూస్తూ, "రామచంద్రా! నా భార్య శాపంతీరింది. నీవు పావనరాముడివి!" అన్నాడు.

గడువు తీరి అహల్య శాపవిమోచనం జరిగింది. తనలో ఏముందని? అన్నట్లుగా రాముడు అయోమయంగా చూశాడు.

గౌతముడు తదేకంగా రాముణ్ణి చూసి, "ఔను, రామా! నీవు నివురుగప్పిన నిప్పువు! మాయా మానుషవిగ్రహుడివి!" అన్నాడు.

విశ్వామిత్రుడు ఔను! అన్నట్టుగా తలపంకించాడు.

"విష్ణువు అవతారాల్లో రామావతారం తర్వాత కృష్ణావతారంలో, కృష్ణుడు తాను అవతారమూర్తిగా తెలిసే అనేక లీలలు చేసి, మాయామానుష విగ్రహుడు అనిపించుకున్నాడు. రాముడు పరిపూర్ణ మానవుడిగా కర్తవ్యపాలన చేశాడు, మనిషిలాగే సాధించాడు. అదే రామావతార విశేషం!" అని సూతుడు వివరించి రామకథను సాగించాడు.

గౌతముడు అందర్నీ ఆశ్రమంలోకి తీసుకెళ్ళి, అతిథిసత్కారాలు చేశాడు. విశ్వామిత్రుడు గౌతమాశ్రమం నుండి రామలక్ష్మణులతో బయలుదేరాడు.

దూరంగా కోలాహలం వినిపించింది.

జనకమహారాజు సీతాస్వయంవర మహోత్సవానికి మహర్షులందరికీ భక్తిపూర్వకమైన తన ఆహ్వానం అందించి



రమ్మని, తన పురోహితుడైన శతానందుణ్ణి పంపించాడు. శతానందుడు అహల్యా గౌతముల కుమారుడు. శతానందుడి పల్లకి వెనక మిథిలారాజ్య లాంఛనాలతో పరివారం వస్తున్నారు. శతానందుడు విశ్వామిత్రుణ్ణి దర్శించడానికి సిద్ధాశ్రమానికి వెళ్తున్నాడు.

దారిలోనే ఎదురైన విశ్వామిత్రుణ్ణి చూసి, శతానందుడు దిగి ప్రణామం చేసి జనకుడి ఆహ్వానం విన్నవించాడు.

విశ్వామిత్రుడి వలన అహల్యా శాప విమోచన వృత్తాంతం విని శతానందుడు మహదానందంతో రాముణ్ణి శతవిధాల కీర్తించి, జననీజనకుల దగ్గిరికి వెళ్ళాడు.

రామలక్ష్మణ విశ్వామిత్రులు మిథిలకు చేరారు.

సీత, ఉద్యానవనంలో విహరిస్తున్నది. ఆమెతో చెల్లెలైన ఊర్మిళ ఉన్నది.

ఆ ఉద్యానవనంలోనుంచి విశ్వామిత్రుడు రామలక్ష్మణులు వెళ్తున్నారు.

సీత, రాముడు ఒకర్నొకరు చూసుకున్నారు. 'తనవాడు వచ్చాడు!' అనే ఆనందంతో అడుగులు తడబడుతూండగా, సీత అంతఃపుర మందిరంలోకి పరుగుతీసింది. ఊర్మిళ మనస్సు లక్ష్మణుడిపై లగ్నమైంది.

రాజాధిరాజులు, బలసంపన్నులు ఎవ్వరూ శివధనుస్సును ఎత్తలేకపోయారు.

జనకుడు నిరాశపడుతూంటే, తండ్రి చెంత ఉన్న సీత, దూరాన ఉన్న రాముడిని ఓరచూపులతో చూస్తూ, ఉత్సాహంగా తండ్రి వంక రాముణ్ణి చూడుమన్నట్లుగా చూసింది.

విశ్వామిత్రుడు రాముణ్ణి ముందుకు పంపాడు. ఆచార్యదేవుడి ఆదేశం శిరసావహించి తాను నిమిత్తమాత్రుణ్ణి అన్నట్టుగా వెళ్ళి, శివధనుస్సుకు నమస్కరించి, రాముడు గున్నయేనుగు చెరుకు లాగినట్లు శివధనుస్సును అవలీలగా ఎత్తిపట్టి, నారిని బలంగా లాగి ఎక్కుపెట్టే





సరికి, గొప్ప ధ్వనితో భూనభోంతరాళాలు దద్దరిల్లగా, శివధనుస్సు విరిగిపోయింది.

ఆ మహాధ్వని తరంగాలు దిగంతాలు వ్యాపించి, దక్షిణ మహాసముద్రంలో మహేంద్ర పర్వతం మీద తపస్సులో ఉన్న పరశురాముడి చెవినిసోకాయి.

పరశురాముడు విష్ణువు మారురూపమైన గోలోకవాసియైన కృష్ణుడు చెప్పిన మాటలు గుర్తుకు తెచ్చుకున్నాడు. కృష్ణుడు యిచ్చిన కోదండాన్ని, విష్ణు అంశను రాముడికి అప్పగించడానికి బయల్దేరాడు.

సీత రాముడి మెడలో మాలవేసి సిగ్గు దొంతరలతో చరచరా తండ్రి చెంత చేరింది. సీతారాముల వివాహానికి దశరథుడు సకుటుంబ సపరివారంగా మిథిలకు చేరాడు.

పెళ్ళిపీటలపై సీతారాములు తలంబ్రాలు పోసుకుంటున్నప్పుడు, సీత కమలం వంటి దోసిట్లో ముత్యాలు పద్మరాగాల్లా ప్రకాశించాయి. రాముడి తలపై జాజిమల్లెల్లాగ తెల్లగా విరిశాయి. రాముడి శ్యామలశరీరంపై జారుతూ, ఇంద్రనీలాల్లాగ కనిపించాయి.

సీతకు చెల్లెళ్ళయిన ఊర్మిళను లక్ష్మణుడికీ, మాండవిని భరతుడికీ, శతరూపను శత్రుఘ్నుడికీ యిచ్చి వివాహం సీతారామ కళ్యాణమహోత్సవంలోనే జరిపించారు.

దశరథుడు కొడుకులు కోడళ్ళతో అయోధ్యకు తిరుగుప్రయాణమయ్యాడు. హుటాహుటిగా వస్తున్న పరశురాముణ్ణి చూస్తూనే రథం దిగి ప్రణమిల్లి రాముడికి బదులుగా తన తల నరకమని ప్రాధేయపడ్డాడు.

పరశురాముడు, ''ఓ, రామా! ఆ హరవిల్లు విరిచావుట, ఈ వింటిని ఎక్కుపెట్టు!'' అని తన చేతనున్న కోదండాన్ని అందించాడు. దాన్ని అందుకుంటున్నప్పుడే పరశురాముడిలోని విష్ణుఅంశ రాముడికి చేరింది. కోదండాన్ని రాముడు ఎక్కుపెట్టాడు.





# విష్ణు కథ

రాముడు కోదండాన్ని ఎక్కుపెట్టగానే, పరశురాముడు, ''రఘురామా! ఇకనుండి క్షత్రియులపై పగ విడిచి ప్రశాంతంగా తపస్సు చేసుకొంటాను. నేనిచ్చిన కోదండం నీదే! నీవు కోదండరాముడివి!'' అని చెప్పి వెళ్ళాడు.

అయోధ్యానగరం నూతన వధూవరుల ఆగమనంతో కళకళలాడింది.

సీతారాములు ఒకే ఒక్క పరిపూర్ణ స్వరూపంగా అనురాగ సామ్రాజ్య సింహాసనం అలంకరించారు.

ఒకనాడు రాముడు, ''సీతా! ఈ రాజప్రాసాదంలోకంటే, మనం సుందరవనాల్లో విహరిస్తూంటే ఇంకెంత ఆనందంగా ఉంటుందో! వనలక్ష్మిలాగ నువ్వు కనిపిస్తూంటే....'' అని అంటూంటే సీత బుగ్గలు ఎరుపెక్కాయి.

వారికి రోజులు మధురంగా గడుస్తున్నాయి.

కొంత కాలానికి దశరథుడికి దుర్నిమిత్తాలు తోచాయి. ఉల్కలు రాలుతూ కనిపించాయి. ఆతనికి ముని దంపతుల శాపం గుర్తు వచ్చింది, ప్రాణభయం పట్టుకుంది.

రాముడికి వెంటనే పట్టాభిషేకం చెయ్యాలని నిశ్చయించి వసిష్ఠుడిచేత ముహూర్తం పెట్టించాడు.

అక్కడ సత్యలోకంలో బ్రహ్మ పద్మాసనంలో చిదానందంగా ఉన్నాడు. సరస్వతి వీణపై రాగమాలిక ఆలపిస్తున్నది.

12. శ్రీరామ వనవాసం



నారదుడు, "అమ్మా, వాగ్దేవీ! లోక కల్యాణార్థం వాళ్ళ నోట ఎలాంటి వాక్కులు పలికిస్తావో మరి! అంతా నీ దయ!" అని వెళ్ళాడు.

గూనిమంథర కైకేయితో అరణంగా వచ్చిన నమ్మిన ముసలిదాసి. అప్పుడే నిద్రలేస్తున్న కైకేయిని జాలిగా చూస్తూ నిలబడ్డది.

కైకేయి, "ఏమిటి, మంథరా, అలా దిగాలుగా నిల్చున్నావు?!" అనడిగింది.

"ఏం చెప్పమంటావు, తల్లీ! రేపు రాముడికి పట్టాభిషేకమట! పట్టాభిషేకం!!" అంది మంథర.

కైకేయి తన మెడలోని ముత్యాల హారం తీసి మంథర మెడలో వేస్తూ, "ఎంత మంచివార్త తెచ్చావే, మంథరా!" అంటూ ఆనందం పట్టలేకపోయింది.

మంథర పెదవి విరుస్తూ, "అయ్యో, కైకేయీ! ఎంత అమాయకురాలివి పాపం! ఒట్టి వెర్రిబాగులదానివి!" అన్నది.

"ఏమిటి నువ్వనేది?" అన్నది కైకేయి.

"రాముడు రాజైతే, ఆ కౌసల్య ముందు నేనూ, నువ్వూ దాసీలమే! బాగా ఆలోచించు, ఆలసించకు, కోప గృహం లోకి వెళ్ళు! నీ రెండు వరాలు ఇప్పుడు కోరుకో! భరతుణ్ణి దేనికి కన్నావు? రాముడి వెనక ఛత్రచామరాలు పట్టడాని

నారదుడు, అతని వెనక దేవతలు వచ్చారు. నారదుడు, "రాముడు సింహాసనం ఎక్కి కూర్చుంటే రాక్షస నిర్మూలనం ఎలా జరుగుతుంది? అని దేవతలంతా తల్లడిల్లుతూన్నారు!" అన్నాడు బ్రహ్మతో.

బ్రహ్మ సరస్వతి వంక చూశాడు. సరస్వతి మందహాసంతో, "జరగవలసింది జరగకమానదుకదా, నారదా! త్రికాల వేత్తవు! అదుగో అటు చూడు! నీకు వారసురాలు మంథర కైకేయి మంది రానికి వెళ్తున్నది!" అన్నది.

దేవతలూ, నారదుడూ క్రిందికి భూమ్మీదకు చూశారు. గూని మోసుకొంటూ మంథర గొణుక్కొంటూ వెళ్తూన్నది.

కేనా?'' అని మంథర చురకలు పెట్టినట్టు అన్నది.

తన రెండు వరాలు ఇప్పుడు కావాలని కైకేయి కోరింది. ''ఏవి కావాలో అవి తీసుకో!'' అన్నాడు దశరథుడు.

''పధ్నాలుగేళ్ళు రాముడు వనవాసం చెయ్యాలి! భరతుడికి పట్టాభిషేకం కట్టాలి!'' అన్నది కైక.

ఆ మాటలు వింటూనే దశరథుడు జుట్టు పీక్కొంటూ అలాగే శయ్య మీద మూర్ఛపడిపోయాడు.

రాముడికి పిలుపు అందింది.

''పితృ వాక్య పరిపాలన తన కర్తవ్యం! దశరథుడు ఆడితప్పినవాడని' పించుకోకూడదు. రఘువంశంలో అటు వంటిది లేదు!'' అనుకున్నాడు రాముడు. తండ్రి మాట నిలబెట్టడానికి రాముడు చెట్టు బెరడుతో తయారైన బట్టలు ధరించి వనవాసం చెయ్యడానికి సిద్ధమయ్యాడు.

లక్ష్మణుడు మహాసర్పం బుసలు కొడుతున్నట్లు వచ్చాడు. కైకేయినీ, దశరథుడినీ నరికేస్తానని కత్తి దూశాడు. రాముడు తమ్ముడిని శాంతపరిచాడు.

రాముడితో సీత, లక్ష్మణుడు బయలు దేరారు.

అయోధ్యా పౌరులు దారికి అడ్డంగా పడుకున్నారు. రాముడు వారిని సమా



ధానపరిచి గంగానదిని దాటి అరణ్య మార్గం పట్టి, భరద్వాజాశ్రమం చేరు కున్నాడు.

మర్రిపాలు తలకు పట్టించి, రామ లక్ష్మణులు మునులకుమల్లే జుట్టుముళ్ళు వేసుకున్నారు.

దశరథుడు మూర్ఛనుండి తేరుకొని, రాముడు వనవాసం వెళ్ళిన సంగతి తెలుసుకొని, ''రామా! రామా!'' అంటూనే ప్రాణాలు విడిచాడు.

అప్పుడు భరతశత్రుఘ్నులు తాతగారి ఊళ్ళో ఉన్నారు. నందిగ్రామం నుండి భరతశత్రుఘ్నులు' వచ్చాక, భరతుడు తండ్రికి ఉత్తరక్రియలు జరిపాడు.



నీ పాదుకల్ని సింహాసనం మీద ఉంచుతాను!'' అని చెప్పి రాముడి పావుకోళ్ళను తలపై పెట్టుకొని తీసుకెళ్ళాడు.

రాముడు సీతాలక్ష్మణ సమేతంగా అరణ్యం లోలోపలికి చొచ్చుకువెళ్ళాడు.

ఖరుడు, దూషణుడు అనేవాళ్ళు దండకారణ్యంలో రావణుడి ప్రతినిధులు. వాళ్ళు వింధ్యపర్వతాలకు దిగువనున్న భూమి అంతా ఆక్రమించారు. వాళ్ళు రాక్షస గుంపులతో తిరుగుతూ, అరణ్యంలో ప్రవేశిస్తున్న నరులను చూశారు.

ఆకలిగొన్న క్రూర మృగాల్లాగ సీతారామలక్ష్మణుల్ని చంపడానికి, పెద్ద పెద్ద బండ కత్తులూ, శూలాలతో చుట్టుముట్టారు రాక్షసులు.

రామలక్ష్మణులు ధనుర్బాణాలు తీసి రాక్షసమూకలను చెల్లాచెదరుగా చేశారు. రాముడు ఖరదూషణుల్ని చంపాడు. రాక్షసులు చాలామంది చచ్చారు. హతశేషులైనవారు పారిపోయారు.

నివాసయోగ్యమైన ప్రదేశంకోసం వెదుకుతూ వెళ్తూండగా, తాటిచెట్టును మించిన ప్రమాణంలో భయంకరాకారుడైన విరాధుడు సీతను అరచేత్తో ఎత్తి భుజాన పెట్టుకొని పారిపోతూంటే, రాముడు ఒక మహాస్త్రాన్ని వేసి రాక్షసుణ్ణి చంపాడు.

భరతుడు తల్లి ముఖం చూడలేదు, శత్రుఘ్నుడు మంథర గూనిపోయేలాగ తన్నాలనుకున్నాడు, కాని దాని జాడ కనిపించలేదు.

భరతుడు రాముణ్ణి తీసుకురాడానికి సపరివారంగా శ్వేతఛత్రాలు పట్టించుకుని వెళ్ళాడు.

భరతుడితో రాముడు, ''మన తండ్రి మాట నిలపడంలో మన ఇద్దరివంతూ ఉంది. నీవు నా తమ్ముడివి, నా మాట విను. పట్టాభిషిక్తుడివై రాజ్యపాలన చెయ్యి!'' అన్నాడు.

భరతుడు తల అడ్డంగా తిప్పి, ''నేను రాజ్యపాలన మాత్రం చూసుకుంటాను,



హతశేషులైన రాక్షసులు శూర్పణఖతో ఖరదూషణుల చావుకబురు చెప్పారు.

శూర్పణఖ రావణాసురుడి చెల్లెలు. ఖరుడు, దూషణుడు శూర్పణఖ సొంత తమ్ముళ్ళు.

దండకారణ్యాల్లో గ్రుమ్మరుతూండే రాక్షసులందరికీ శూర్పణఖ నాయకురాలు. రామలక్ష్మణుల్ని చీల్చి చెండాడాలని బయలుదేరింది.

ఊడలే మానులైన ఐదు మర్రిచెట్లతో నిండిన పంచవటికి రాముడు, సీతా లక్ష్మణులతో చేరాడు. పక్కనే గోదావరి ప్రవహిస్తున్నది.

పర్ణశాలను నిర్మించుకొని, రాముడు సీతతో వనవిహారం చేస్తూ వనవాసం గడుపుతున్నాడు. లక్ష్మణుడు అన్నను, వదినను సేవిస్తూ, పర్ణశాలను దివారాత్రాలు కాపలా కాస్తున్నాడు.

శూర్పణఖ అట్టహాసంగా విరుచుకపడింది. రాముణ్ణి చూసి తన్ను వరించమంది, వేడింది, బెదిరించింది. సీతను చంపడానికి ఉరికింది. లక్ష్మణుడు శూర్పణఖను చంపకుండా ముక్కు, చెవులు కోసి తరిమాడు.

శూర్పణఖ లంకకు వెళ్ళి రావణాసురుడితో తనకు జరిగిన పరాభవాన్ని మొరపెట్టుకొంది. సీత అందాన్ని వర్ణించి రెచ్చగొట్టింది. రావణుడు ప్రతీకారంగా సీతను చెరగొని తేవడానికి మారీచుణ్ణి బంగారు లేడిగా పంపాడు.

సీత మాయలేడిని చూసి ముచ్చటపడింది. రాముడు వెళ్ళి పట్టుకోవాలని బాణంవేశాడు. బాణం తగిలి మాయలేడి మారీచుడై, ''హా, సీతా! హా, లక్ష్మణా!'' అని రాముడు చేసినట్టు ఆర్తనాదం పెద్ద పెట్టున చేసి మరీ చచ్చాడు.

అది రాక్షసమాయ, రాముడికెటువంటి హానీ జరగదని లక్ష్మణుడు ఎంత చెప్పినా సీత వినలేదు. నిష్ఠురోక్తులు పలికింది. లక్ష్మణుడు పర్ణశాల ముందు మూడు గీతలు గీచి వెళ్ళాడు.



దశరథుడి ఆప్తమిత్రుడైన జటాయువుకి దహనసంస్కారం చేసి, రామలక్ష్మణులు వెళ్తుండగా, కబంధుడు వన్యమృగాల్తో బాటు వారిని దగ్గరకు లాక్కున్నాడు.

కబంధుడు విచిత్రమైనవాడు. పర్వత మంతటి కడుపు, దానికే కోరలతో అవు లించుకొని ఉన్న పెద్ద నోరు, ఒక నిప్పు లాంటి కన్ను, యోజనాల పొడవునా చాచుకునే చేతులు ఉన్నాయి. తల అంటూ వేరే లేదు, కాళ్ళుగాని మరే అంగాలుగాని లేవు.

రామలక్ష్మణులు కత్తులు తీసి కబం ధుడి చేతులు నరికారు. కబంధుడు శాప గ్రస్తుడైన గంధర్వుడు. శాపవిమోచనం పొంది ఆ గంధర్వుడు, గంధర్వలోకానికి పోతూ, ''నీకు వానరులతో మైత్రి కుదురు తుంది, ప్రయోజనకారి అవుతుంది,'' అని రాముడికి చెప్పాడు.

ఋష్యమూక పర్వతం మీద వానర వీరులతో ఉంటున్న సుగ్రీవుడు రాముడి వద్దకు హనుమంతుణ్ణి పంపాడు.

ముక్కోటి దేవతలు వానరులయ్యారు. హనుమంతుడు శివుడి అంశన పుట్టినవాడు. అంజనాదేవి, వాయుదేవుడి అనుగ్రహంతో హనుమంతుణ్ణి కన్నది. అంజనేయుడు వాయుపుత్రుడు. మారుతి అని పిలువ బడ్డాడు.

సీత ఒంటరిగా ఉంది. రావణుడు వృద్ధతాపసి వేషంతో భిక్షకు వచ్చాడు. సీత భిక్ష వెయ్యడానికి మూడు గీతలూ దాటింది. రావణుడు నిజరూపుతో సీతను ఎత్తుకుపోయాడు.

రామలక్ష్మణులు సీతను వెదుకుతూ వెళ్ళారు. రాముడు సామాన్య పామర మానవుడిలాగే విలపించాడు.

వారలా వెళ్ళగా వెళ్ళగా, రెక్కలు తెగి పడి ఉన్న జటాయు పక్షి, ''సీతను విడిపించడానికి పోరాడాను, నా రెక్కలు నరికి రావణుడు దక్షిణ దిశగా సీతను ఎత్తుకుపోయాడు,'' అని చెప్పి ప్రాణాలు విడిచింది.

పసితనంలో ఆంజనేయుడు ఉదయ సూర్య బింబాన్ని పండని ఎగిరి కబళించ బోగా, ఇంద్రుడు వజ్రాయుధంతో కొట్టాడు. మారుతి మూర్ఛిల్లాడు. వాయుదేవుడికి కోపం వచ్చి స్తంభించాడు. అప్పుడు దేవతలు హనుమంతుణ్ణి చిరంజీవిగా దీవించి, అనేక వరాలు యిచ్చారు.

బ్రహ్మ ఆంజనేయుడి చెవులకు విచిత్ర ప్రభావంగల కుండలాలు తగిలించి, అవి ఎవరికి కనపడి మెచ్చుకుంటే అతడే విష్ణువుగా గుర్తించి, ఆరాధ్యదైవంగా సేవించమని హనుమకు చెప్పాడు.

హనుమంతుడు సుగ్రీవుడి పంపున రామలక్ష్మణుల దగ్గిరికి బ్రహ్మచారి రూపంతో వెళ్ళాడు. రాముడు అతడిని చూసి లక్ష్మణుడితో, "సుందరుడైన ఇతని కర్ణకుండలాలు ఎంత ముచ్చటగా ఉన్నాయో, చూడు!" అంటూ మెచ్చుకున్నాడు.

అప్పుడు హనుమంతుడు రాముడు విష్ణువు అవతారమని గుర్తించి, నమ్మిన బంటు అయ్యాడు. రాముడి చేత సుందరుడు అనిపించుకొన్న హనుమంతుడు, 'సుందరుడు' అని పేరు పొందాడు.

హనుమంతుడి మూలంగా రాముడు, సుగ్రీవుడు అగ్నిసాక్షిగా మిత్రులయ్యారు.

సుగ్రీవుడి అన్న వాలి, కిష్కింధకు రాజు. తమ్ముడిని ద్రోహిగా అపోహపడి చంపబోగా సుగ్రీవుడు తప్పించుకుని పోయి ఋష్యమూక పర్వతం మీద తల దాచుకున్నాడు. వాలి తమ్ముడి భార్యను నిర్బంధంలో ఉంచాడు.

ఆపదలో ఉన్న మిత్రుణ్ణి కాపాడడం తన ధర్మంగా రాముడు ఎంచి, వాలిని సంహరించి సుగ్రీవుణ్ణి కిష్కింధా నగరానికి రాజును చేయడానికి మాట యిచ్చాడు.

వాలి ఎదురుగా నిలిచినవాడి బలం వాలిని చేరేలా వరం ఉంది. ఆ కారణంగా వాలి సుగ్రీవులు పోరాడుతుండగా చెట్టు చాటునుండి రాముడు బాణంకొట్టి వాలిని కడతేర్చాడు.





# విఘ్న కథ

సుగ్రీవుడు కిష్కింధకు రాజై, వాలి కుమారుడు అంగదుణ్ణి యువరాజును చేసి, రాచకార్యాలన్నీ అప్పజెప్పి, తాను సుఖాల్లో తేలుతూ రాముడి సంగతే మరిచాడు. లక్ష్మణుడు విల్లెక్కుపెట్టి కిష్కింధకు వెళ్ళాడు. హనుమంతుడు రామకార్యం నెరవేర్చడం తక్షణకర్తవ్యంగా సుగ్రీవుడికి బుద్ధిచెప్పాడు.

వానరులను నాలుగు దిక్కులకూ సీత జాడ తెలుసుకు రమ్మని సుగ్రీవుడు ఆజ్ఞాపించాడు. అంగదుడు, హనుమంతుడు, జాంబవంతుడు మొదలైనవారంతా దక్షిణ దిశకు బయలుదేరుతున్నప్పుడు, రాముడు తన వేలిఉంగరాన్ని తీసి హనుమంతుడికి సీతకు ఆనవాలుగా యిమ్మని యిచ్చాడు.

దక్షిణ సముద్రతీర ప్రాంతం చేరుకొని వానరులు, ''జటాయువు రావణుడు సీతనెత్తుకొని దక్షిణంగా వెళ్ళాడని చెప్పాడేగాని, ఎటు మళ్ళాడో, ఎక్కడ దాచాడో, ఏం చేశాడో ఎవరికి తెలుసు?'' అని అనుకుంటూండగా, వానరులను ఆహారంగా కబళిద్దామనుకుంటున్న జటాయువు అన్న సంపాతి అనే పర్వతాకారంగల రెక్కలులేని పక్షి మెల్లగా నడుస్తూ వచ్చింది.

ఒకప్పుడు సంపాతీ, జటాయువూ సూర్యమండలానికి ఎగురుపందెం వేసుకున్నారు. జటాయువు ఎగరలేక విరమించాడు. సంపాతి ఎగిరి రెక్కలు కాల్చుకున్నాడు. దక్షిణ సముద్ర తీరాన



నువ్వు అవలీలగా సముద్రాన్ని లంఘించి రామకార్యం నెరవేరుస్తావు!'' అని ఎరుక చేశాడు.

అప్పుడు హనుమంతుడు రాముణ్ణి ధ్యానించి నేలనుతన్ని ఆకాశానికి ఎగిరాడు.

మారుతి సముద్రాన్ని లంఘిస్తూండగా, అతడి శక్తియుక్తుల్ని పరీక్షించడానికి దేవతలు సురసను పంపారు.

దేవతాస్త్రీ అయిన సురస భయంకర రాక్షసాకారంతో నోరావులించి హనుమంతుణ్ణి ఎదుర్కొంది. హనుమ శరీరాన్ని పెంచాడు. సురస కూడా పెరిగింది. హనుమంతుడు యింకా పెరిగాడు. సురస మరింత, మరింత పెరిగి మ్రింగవచ్చింది. హనుమంతుడు చప్పున సూక్ష్మాతిసూక్ష్మంగా తగ్గిపోయి, సురస నోట్లో దూరి, పెరిగిపోయి దాన్ని చీల్చుకొని బయటపడి ఎగిరి వెళ్ళాడు. సురస దేవతాస్త్రీ రూపంతో వెళ్ళిపోయింది. దేవతలు హనుమంతుణ్ణి శ్లాఘించారు.

హనుమంతుడు అలా ఎగురుతూండగా సముద్రంలో పడిన అతని నీడను రాహువు తల్లి సింహిక అనే జలరాక్షసి ఘట్టుకొని లాగసాగింది. హనుమంతుడు తన్నేదో కిందినుంచి వెనక్కు లాగుతున్నదనిపించి కిందికి చూశాడు. సింహికను పిడిగుద్దులతో చంపేశాడు.

అవిటివాడై పడిపోయి ఎలాగో దొరికిన ప్రాణుల్ని తిని బ్రతుకుతున్నాడు.

సంపాతి వానరుల వలన జరిగినదంతా తెలుసుకొని, అంగదుణ్ణి వీపున ఎక్కించుకొని నిటారుగా లేచి దూరదూరాల్లో సముద్రానికి అవల ఉన్న లంకను చూపించాడు.

శతయోజన పర్యంతమైన సముద్రాన్ని లంఘించి లంకను చేరగలవాడెవడు? అనుకున్నారు వానరులు.

హనుమంతుడికి అతని శక్తిసామర్థ్యాలు అతనికి తెలియకుండా, బాల్యంలో అల్లరి చేయగా ఋషులు శాపం పెట్టారు. అది తెలిసిన జాంబవంతుడు, ''హనుమంతా!

హనుమంతుడు అవరోధాలన్నీ జయించి, అలా ఆకాశాన వెళ్తూండగా సువర్చల అనే సాగరకన్య చేపరూపంతో నోరు తెరిచి ఆశ్చర్యంగా చూస్తూండగా హనుమంతుడి చెమట బిందువొకటి పడింది. చేప మింగింది. అందువల్ల సువర్చల గర్భం ధరించి మత్స్యవల్లభుడు అనే కుమారుణ్ణి కన్నది.

ఒకప్పుడు ఇంద్రుడు పర్వతాలకు ఉండే రెక్కలను వజ్రాయుధంతో నరుకుతూండగా, హిమవంతుడి కుమారుడైన మైనాకుడు భయపడి సముద్రంలో దాక్కున్నాడు.



హనుమంతుడిని చూసి మీదకు వచ్చి, "అంజనేయా, కాస్త నాపై వాలి సేద దేరమని అభ్యర్థిస్తున్నాను," అన్నాడు.

మైనాకుడి మాట కాదనకుండా హనుమంతుడు, కొద్దిక్షణాలు మైనాకపర్వతం మీద కాలుమోపి తిరిగి రివ్వున ఎగిరాడు.

హనుమంతుడు మెరుపులాగ లంకను చేరాడు.

లంకానగరాన్ని పరిరక్షించే లంకానగర దేవత లంకిణి, హనుమంతుడి ఆగమనాన్ని గుర్తించి, భీకరాకృతితో శూలాన్నెత్తి పొడవబోయింది.

హనుమంతుడు సూక్ష్మరూపంతో తప్పించుకొని, లంకాద్వారాన్ని దాటబోయాడు. లంకిణి హనుమంతుణ్ణి ఈగను పట్టినట్లు గుప్పెట్లో పట్టింది. హనుమంతుడు లంకిణి అరచేతిని కరిచాడు. లంకిణి వదిలేసింది. దాని అరచేయి రక్తం కారుతూన్నది.

హనుమంతుడు ఒక్క ఉదుటున లంఘించి పిడికిలితో లంకిణి గుండె మీద గుద్దాడు. ఆ ముష్టిఘాతంతో లంకిణి దిమ్మరపోయి పడిపోయింది.

లంకిణి తేరుకొని అంజనేయుడికి నమస్కరించి, "ఎప్పుడైతే నేను యిలా కూలిపడతానో, ఆ నాటితో లంకకు వినాశ కాలం పడుతుందని నాకు, బ్రహ్మ చెప్పాడు. శాపంవల్ల నేను క్షుద్రదేవతగా



సీత జాడ ఎక్కడా లేదు. అలా వెతుకుతూ అశోకవనం చేరుకున్నాడు. అక్కడ రామనామ స్మరణ విన్నాడు.

ఒక చంద్రశిలా నిర్మిత మంటపంలో సీత రాముణ్ణి తలంచుతూ శోకిస్తూన్నది.

ఆ మంటపం చుట్టూరా పెద్ద బల్లేలు, కత్తులు మొదలైన ఆయుధాలు పట్టుకొని రాక్షసస్త్రీలు కాపలా ఉన్నారు.

మంటపం చేరువనే ఉన్న శింశుపా వృక్షం ఎక్కి హనుమంతుడు కొమ్మల మాటున కూర్చుని చూస్తున్నాడు.

సీత మంటపం నుండి వచ్చి, పక్కనున్న అశోక చెట్టు కింద కూర్చున్నది.

యిలా లంకా నగరాన్ని యిన్నాళ్ళూ కాపలా కాస్తూ వచ్చాను. నేను వెళ్ళిపోతున్నాను, యిక నీవు వెళ్ళు!'' అని చెప్పి గంధర్వస్త్రీ రూపంతో ఆకాశానికి ఎగిరి అంతర్థానమైంది.

హనుమంతుడు లంకా నగరం ప్రవేశించాడు. మణిదీపాలతో, ఎత్తైన సౌధాలతో కన్నులు మిరుమిట్లు గొలుపుతున్న లంకా వైభవానికి ఆశ్చర్యపోయాడు.

హనుమంతుడు సూక్ష్మరూపంతో సీత కోసం నగరమంతా వెతికాడు. రావణాసురుడి అంతఃపుర భవనాలన్నీ వెతికాడు. మండోదరిని సీత అనుకొని భ్రమపడి పొరపాటు గ్రహించాడు.

రావణుడు పటాటోపంగా అశోకవనంలోకి వస్తున్నాడు. అతని వెనక దేవ, గంధర్వ, నాగ, యక్ష, రాక్షస, మానవ సుందరీమణులు గుంపులు, గుంపులుగా అతడి వైభవాన్ని కీర్తిస్తున్నారు.

రావణుడు అశోకవృక్షం దగ్గిరికి వచ్చి, '' ఓ, సీతా! ఇప్పటికైనా, నా మాట విను! క్షుద్ర మానవుడైన రాముణ్ణి నమ్ముకోకు. రాముడు లంక చేరగలడనేది కల్ల!'' అన్నాడు.

సీత ఒక గడ్డిపరకను పెరికి దానితోనే, '' ఓ, రావణా! నీ ప్రగల్భానికీ, బలవైభవాలకీ నేను లొంగుతాననేది కల్ల! నీవు దొంగవు! నిన్ను శిక్షించడం రాజైన

రాముడికి కర్తవ్యధర్మం. దశకంఠ శోషగా వాగకు. రాముడు నిన్ను పరి మార్చక ముందే, నీ ముచ్చటలన్నీ తీర్చుకో! అంతఃపురానికి వెళ్ళు. త్వర లోనే నీకు అంత్యకాలం!'' అన్నది.

రావణుడా మాటలకు పెద్ద గండ్ర కత్తి తీసి, ''నిన్ను ముక్కలుగా నరుకు తాను!'' అన్నాడు.

''అలా చేయవు! నా అంతట నేను, నీకు లొంగిపోతానని అనుకుంటున్నావు. రాముడి భార్య, రావణుడి ప్రతాప వైభవా లను చూసి లొబడిపోయింది అనిపించు కోవాలని, నీ దురహంకార దురాకాంక్ష!'' అన్నది సీత.

''ఔను! మా రాక్షస వనితకు జరిగిన పరాభవానికి, అదే సరియైన ప్రతీకారం! అదే నా పట్టుదల!'' అన్నాడు రావణుడు.

''కాదు! నువ్వు రాముడిని ఎదుర్కొని జయించి, నన్ను తీసుకుపోవలసింది. నువ్వు పిరికివాడవు. మాయలు పన్ని చోర వృత్తిని అవలంబించావు. రాముడు నిన్ను సంహరించాలి! ఇది నా పట్టుదల!!'' అన్నది సీత.

రావణుడు రుసరుసలాడుతూ వెళ్లాడు.

హనుమంతుడు రాక్షస స్త్రీలు లేని సమయం చూసి, చెట్టు దిగి, సీతకు రాముడి ఉంగరాన్ని యిచ్చాడు. చుక్కలు



తల పూవులుగా పెరిగిన తన విశ్వరూపం చూపించి, తన వీపున కూర్చుంటే రాముడి దగ్గరకు చేరుస్తానన్నాడు.

''అది సక్రమం కాదు; రాముడు రావణుడిని సంహరించి నన్ను విడిపిం చాలి! అంతవరకు సీత అశోకవనంలో శోకంలోనే ఉంటుందని రాముడితో చెప్పు!'' అని చెప్పి సీత తన పాపిట నున్న చూడామణిని తీసి, రాముడికి యిమ్మని హనుమంతుడికి యిచ్చింది.

హనుమంతుడు తన రాక తెలియాలని సుందరమైన అశోకవనాన్ని ధ్వంసం చేశాడు. చంపవచ్చిన జంబుమాలిని, అక్షయుడిని, వేలాది రాక్షసుల్ని చంపాడు.



రావణుడి పెద్ద కుమారుడు ఇంద్ర జిత్తు బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. బ్రహ్మపట్ల గౌరవంగా క్షణకాలం హను మంతుడు అస్త్రానికి బద్ధుడై, రావణుడికి ముఖాముఖి బుద్ధి చెప్పాలని కట్టుబడి రావణ సభకు వెళ్ళాడు.

రావణుడు ఎత్తైన సింహాసనం మీద నుంచి, కింద ఇనుప గొలుసులతో బందీగా వున్న హనుమంతుణ్ణి వంగి పరిహాసంగా చూశాడు.

హనుమంతుడు మేను పెంచి గొలు సులు తెంచుకొని, రావణుడి తల తన్నే ఎత్తున తన తోకను పెంచి, చుట్ట చుట్టు కొని దానిపై కూర్చున్నాడు.

హనుమంతుడు, "ఓయి, రావణ రాక్షసరాజా! నేను రాముడి దూతను. రాముడు కోతులనే మహావీరులుగా నడి పించి, నీ లంకను ముట్టడించగల సమర్థు డైన మానవశ్రేష్ఠుడు. బలమున్నదని గర్వించకు. బలవంతమైన సర్పము చలి చీమలచేత ఏ విధంగా చస్తుందో, నీకు చెప్పనవసరం లేదు. సీతను రాముడికి అప్పగించి మన్నించమని వేడు!" అని చెప్పాడు.

రావణుడు పట్టరాని ఆగ్రహంతో కత్తి తీశాడు. విభీషణుడు రావణుడితో, "దూతను చంపకూడదు, అది పౌరుషం అనిపించుకోదు!" అన్నాడు.

రావణుడు, "అలాగైతే, యీ వాన రుడి తోక పొగరు అణిగేలా గుడ్డలు చుట్టి చమురుపోసి కాల్చండి!" అని ఆజ్ఞా పించాడు.

రాక్షసభటులు హనుమంతుడి తోకకు గుడ్డలు చుట్టినకొద్దీ తోక పెరిగిపోతూనే ఉంది. చమురు చాలలేదు. నిప్పంటిం చారు. హనుమంతుడు శరీరం పెంచి సింహనాదం చేసి ఛెంగున ఎగిరాడు.

కాలుతున్న తోకను గిరగిరా తిప్పుతూ, సౌధాల మీంచి దూకుతూ, లంకా పట్ట ణాన్ని అగ్నికి ఆహుతి చేశాడు. అతనికి అగ్ని చల్లగా తోచింది ఆర్పడానికి వీలు

కాకుండా లంకాదహనం జరిగింది. రావణుడి అంతఃపుర సౌధాలు కాలి పోయాయి. మంటల్లో చాలామంది రాక్షసులు చచ్చారు. విభీషణుడి మందిరం మాత్రం చెక్కు చెదరలేదు.

హనుమంతుడు అశోకవనంలో సీత క్షేమంగా ఉండడం చూసి, రివ్వున ఎగిరి సముద్రంలో తోకను ముంచి మంటలార్పుకొని, చూడామణిని పట్టుకొని రాముడి ముందు వాలాడు.

రాముడు చూడామణిని చూసి, సీతను చూసినట్లుగా గుండెలకు హత్తుకొన్నాడు.

హనుమంతుడు అంతా చెప్పాడు.

రాముడు హనుమను ఆలింగనం చేసుకొని, "హనుమా! చూసి రమ్మంటే కాల్చి వచ్చావన్నమాట! నీవంటివాడు అండ ఉండగా, నేను సాధించలేనిదంటూ ఉండదు. సీతకూ, నాకూ సంధానకర్తవై, ఆనందం చేకూర్చిన నీవు బుద్ధిమంతుడవు, ఆనంద సంధాతవు, కీర్తిమంతుడవు ఔతావు!" అన్నాడు.

రాముడు కోదండాన్ని ఎత్తి పట్టుకొని, సీత చెప్పినట్టుగా రావణసంహారానికి దీక్షాకంకణం కట్టుకున్నాడు.

విభీషణుడు రావణుడికి సవతి తమ్ముడు. రాముడితో వైరం పెట్టుకోవద్దనీ, సీతను సగౌరవంగా తీసుకెళ్ళి, రాముడికి అప్పగించి, లంకానగరాన్నీ, లంకావాసుల్నీ కాపాడమని చెప్పాడు.

"నీ ఒక్కడి పట్టుదల, మూర్ఖతవల్ల రాక్షసకులానికే ముప్పు తేవడం అన్యాయం!" అని విభీషణుడు చెప్పిన దానికి, రావణుడు మండిపడి, "ఓరీ, పిరికిపందా! నువ్వు రాక్షసకులంలో తప్ప పుట్టావు! శూర్పణఖకు చేసిన పరాభవం రాక్షస జాతికంతటికీ పరాభవం అని తెలుసుకో! నువ్వు కులద్రోహివి! వెంటనే లంక వదలి వెళ్ళిపో! మళ్ళీ కనిపించావో, నిన్ను చిత్రవధ చేస్తాను!" అన్నాడు.

విభీషణుడు తన అనుచరులతో లంక వదిలిపెట్టాడు.





# విష్ణు కథ

విభీషణుడిలాగే రావణుడి పట్టమహిషి మండోదరి కూడా భర్తకు హితవు చెప్పింది. "నాథా! ముక్కు చెవులు కోసినందుకో, వరించమంటే వరించనందుకో, నీ చెల్లెలు అవమానం భరించలేకపోయినప్పుడు, ఒంటరిదాన్ని, అసహాయురాల్ని, బంగారాన్నో, పశువునో, పక్షినోలాగ ఎత్తుకువచ్చినందుకు, సీత ఎంత బాధపడుతుందో ఊహించావా? శూర్పణఖ ప్రతీకారంతో సీతను ఎత్తుకు రమ్మన్నట్లే, సీతకు జరిగిన అవమానానికి ఆమెకుయింకెంత కసి ఉంటుందో ఆలోచించు!" అన్నది.

రావణుడు, "ఔను మండోదరీ, ఇప్పుడు తెలుస్తున్నదిగానీ. కానీ—ఏమైనా కానీ, రావణుడు తల వంచడం అనేది లేదు! నీ భర్త భీరువుకాడు. పిరికి మందు నూరి పోయకు! ఆ రాముడు ఏం చేయగలడో నేనూ చూస్తాను," అన్నాడు.

ఎక్కడెక్కడి వనాల్లోని వానరులంతా చేరుకొని రాముడి సేనగా తయారయ్యారు. సుగ్రీవుడు, నీలుడు, అంగదుడు, సుషేణుడు, జాంబవంతుడు మొదలైన ప్రముఖులంతా సేనానాయకులై రాముడికి అండదండలుగా నిల్చారు. హనుమంతుడు రాముడి కార్యకర్తగా, అంగరక్షకుడిగా లంకపై దాడికి సర్వసన్నాహాలు ప్రారంభమయ్యాయి.

హనుమంతుడు పర్వతాలు, కొండలు తెచ్చి సముద్రంలో వేశాడు.



రాముడు వారధి కట్టించి, కోదండాన్ని, రామబాణాన్ని రెండు చేతులతో పట్టుకొని, వానర సేనలు వెంటరాగా, ఇరు పక్కల లక్ష్మణుడు, హనుమంతుడు నడుస్తుండగా, లంకను ముట్టడించడానికి బయలుదేరాడు. విభీషణుడు వారిని అనుసరించాడు.

వానరులు పెద్ద బండలు, శిలలు తెస్తున్నారు. చిన్న కోతులు రాళ్ళు మోసుకొస్తున్నారు.

నూరు యోజనాల పొడవునా లంకకు సముద్రం మీద సేతు నిర్మాణం అతి వేగంగా ఎంతో ఉత్సాహంతో ప్రారంభమైంది. నీలుడు సేతు నిర్మాణపర్యవేక్షణా బాధ్యత తీసుకున్నాడు.

విభీషణుడు ఆకాశమార్గాన రాముడి శరణాగతుడై వచ్చాడు. రాముడతనికి అభయమిచ్చి లంకకు రాజును చేస్తానని చెప్పాడు. అప్పటికప్పుడు సముద్ర జలాలతో అతణ్ణి లంకకు రాజుగా అభిషేకించాడు.

వేగులు రాముడు వానరసేనలతో సముద్రం దాటి వస్తున్నవార్త తెచ్చారు. రావణుడు చకితుడయ్యాడు. ఒక నరుడు వానరులను కూడగట్టుకొని, సముద్రం మీద నూరు యోజనాల పొడవు వంతెన కట్టి, ముల్లోకాలను గడగడలాడించే రావణాసురు డంతటివాడిని కొట్టి తన సొత్తయిన భార్యను తెచ్చుకున్నాడు అని అనిపించుకోవడమే! ఏమిటిది? ఇది జరుగుతుందా? కట్టడం మాత్రమే జరిగినంత మాత్రాన మిగతా రెండూ జరుగుతాయని భయపడ్డం దేనికి? అని అనుకుంటూన్న రావణుడితో, మంత్రి ప్రహస్తుడు, "శత్రువును దారిలోనే ఎదుర్కొని తుద ముట్టించడం మంచిది!" అన్నాడు.

రావణుడు నవ్వి, "మన కుంభకర్ణుడికి తగినంత ఆహారం దొరకడం లేదు. వాళ్ళు లంకకు రానీ! సాలెగూటిలో చిక్కుకున్న ఈగల్లాగ, నా తమ్ముడి ఆకలికి పనికొస్తారు!" అన్నాడు.

రాముడు వానరసేనలతో వారధిని దాటి లంకా తీరాన్ని చేరాడు.

లంకానగరం ఎత్తయిన పర్వతం చిప రంటా నిర్మించబడింది. పర్వతాగ్రం మీది సౌధంలో రావణుడు ఉంటాడు.

ఆ సౌధాగ్రం నుంచి రావణుడు రాముడు విడిసిన తీరాన్ని చూశాడు. తీరం పొడవునా చీమలబారుల్లాగ వానరసేనలు వ్యూహాలు పన్నుతున్నారు.

అంగదుడికి వీరావేశం వచ్చింది. రివ్వున ఎగిరి వెళ్ళి రావణాసురుడి సౌధం మీద వాలాడు.

"ఓ. రావణా! ఒకప్పుడు నిన్ను తోకతో చుట్టి విసిరేసిన వాలి కుమారుణ్ణి నేను, అంగదుణ్ణి! అప్పటి నుంచి నువ్వు, మా తండ్రిపట్ల గౌరవమర్యాదలతో మిత్రుడిగా ఉన్నావు గనుక, చెబుతున్నాను. ఇప్పటికైనా మించిపోయింది లేదు. రాముడితో వైరం మాను. శరణు వేడు. వానరమూకతో రాముడేం చేయగలడన్న ధీమాతో వుండకు. వానరులెంతటివారో నీకు మళ్లీ చెప్పనవసరం లేదు!" అన్నాడు.

రావణుడికి కోపం వచ్చి కత్తి ఎత్తాడు. అంగదుడు రావణుడి కిరీటాన్ని కాలితో తన్ని పడద్రోసి, తిరిగి వానరసైన్యం వున్న చోటుకు ఎగిరి వెళ్ళాడు



వానరసేన విజృంభించి లంకా నగరాన్ని ముట్టడించి చికాకు పరుస్తూంటే, రావణుడు కుంభకర్ణుడి నిద్ర చెడగొట్టించి, అతణ్ణి వెంటనే యుద్ధానికి వెళ్ళమన్నాడు.

కుంభకర్ణుడు ఘోరమైన తపస్సు చేసినప్పుడు బ్రహ్మ సరస్వతి చేత అతని కోరికలు తారుమారు చేయించాడు. ఆరు నెలలు తిండి, ఒకరోజు నిద్ర కోరుకోవాలనుకున్న కుంభకర్ణుడు, ఆరు నెలల నిద్ర, ఒకరోజు తిండి కోరుకున్నాడు. బ్రహ్మ అతడికి అలాగే వరమిచ్చాడు.

ఆరు నెలల నిద్ర పూర్తిగా తీరకపోతే, కుంభకర్ణుడి శక్తి తగ్గిపోతుంది. అతడు



రావణుడు అతని మీద పెద్ద ఆశ పెట్టుకొని ఉన్నాడు. మేఘాల్లోంచి యుద్ధం చేసే వాడవడంవల్ల మేఘనాథుడు అని పేరొంది, ఇంద్రుణ్ణి జయించి కట్టి తెచ్చి, ఇంద్రజిత్తు అనిపించుకొన్న మహావీరుడు. మంత్రతంత్రాలు నేర్చిన ఇంద్రజిత్తు జిత్తులమారి, మహామాయావి. పధ్నాలుగేళ్ళు బ్రహ్మచర్యంతో నిద్రాహారాలు లేకుండా కఠోరదీక్ష గడిపిన వాడివల్లనే గాని, మరెవ్వరివల్లా అతనికి ప్రాణభయంలేదు.

ఇంద్రజిత్తు మాయ సీతను కల్పించి, రాముడికి కనిపించేలాగ ముక్కముక్కలుగా నరికాడు.

లక్ష్మణుడు అది అంతా మాయాజాలమని అన్నకు ధైర్యం చెప్పి గొప్పగా యుద్ధం చేశాడు.

అలాగే రావణుడు విద్యుజ్జిహ్వుడనే వాడి చేత రాముడి తలను తయారు చేయించి, శూలానికి గుచ్చి సీతకు చూపమని పంపాడు.

దానిని చూసిన సీత, "ఇలాంటి చేతిపనివి కాకుండా, రావణుడి అసలు తలలు తెగి నేల దొర్లేరోజు వచ్చిందిలే," అని చెప్పింది.

ఇంద్రజిత్తు మేఘాల్లో దాగి రామలక్ష్మణులపై నాగాస్త్రాన్ని వేశాడు. గరు

రావణుడు చేసిన పనికి విసుక్కున్నాడు, అన్నకు వినయంగా హితబోధ కూడా చేశాడు.

రావణుడు, "చేస్తే యుద్ధం చెయ్యి, లేదా వెళ్ళి పడుకో!" అన్నాడు.

నిద్ర చెడిన కోపంతో కుంభకర్ణుడు వానరులను పట్టుకు తినసాగాడు. రామలక్ష్మణులు నిర్విరామంగా యుద్ధం చేశారు. ఆ యుద్ధంలో రాముడు కుంభకర్ణుడిని సంహరించాడు.

ఆ తరవాత యోధాన యోధులైన రాక్షస ప్రముఖులందరూ కూలిపోయారు. రావణుడి పెద్దకొడుకు ఇంద్రజిత్తు యుద్ధానికొచ్చాడు.

త్మంతుడు నాగులను నిర్మూలించి రామలక్ష్మణులను పాముల వల నుండి తప్పించాడు.

సీతారాముల సేవలో పద్నాలుగేళ్ళు కఠోరదీక్ష గడిపిన లక్ష్మణుడి చేతిలో ఇంద్రజిత్తు చావు రాసి ఉందని విభీషణుడు చెప్పాడు.

లక్ష్మణుడూ, విభీషణ, హనుమంతులూ వెళ్ళి నల్లటి మేకపోతులను బలిచేస్తూ, ఇంద్రజిత్తు చేస్తున్న హోమాన్ని ధ్వంసం చేశారు. లక్ష్మణుడు ఇంద్రజిత్తును సంహరించాడు.



రావణుడు పాతాళ లంకాధిపతియైన మైరావణుడిని రామలక్ష్మణులను కాళికి బలి వేయమన్నాడు.

నిద్రిస్తున్న రామలక్ష్మణులను మైరావణుడు తన మాయాజాలంతో ప్రతిమల్ని చేసి, పాతాళ లంకకు ఎత్తుకుపోయి, కాళికాలయంలో బలికి సిద్ధంగా ఉంచాడు.

హనుమంతుడు పాతాళ లంక చేరి, ద్వారపాలకుడుగా ఉన్న మత్స్యవల్లభుడితో పోరాడుతూండగా, సువర్చలాదేవి వారిద్దరూ తండ్రీ కొడుకులౌతారని చెప్పి పోరు మాన్పించింది.

హనుమంతుడు సూక్ష్మరూపంతో కాళికాలయం ప్రవేశించి, రామలక్ష్మణులను భుజాల మీద ఎక్కించుకొని యివతలకు తెచ్చాడు. రామలక్ష్మణులు మైరావణుడితో యుద్ధం చేశారు.

రాముణ్ణి తన దైవంగా ఆరాధించే చంద్రసేనను మైరావణుడు చెరతెచ్చాడు. ఆమెవల్ల హనుమంతుడు మైరావణుడి ప్రాణరహస్యాన్ని తెలుసుకొని దాన్ని ధ్వంసం చేశాడు. మైరావణుడిని రాముడు హతమార్చాడు.

రాముడు చంద్రసేనకు ఆత్మతత్వాన్ని బోధించి, మరుజన్మలో విష్ణువును పొందగలవని ఆశీర్వదించాడు.

పాతాళలంకకు మత్స్యవల్లభుడిని అధిపతిని చేసి, హనుమంతుడు రామలక్ష్మణు



లను భుజాల మీద మోసుకొని లంకకు వచ్చాడు.

మాయోపాయాలన్నీ విఫలం కాగా, రావణుడు ఉక్కు యోధుల్నీ, చతురంగ బలాల్నీ పుట్టించే పాతాళ లంకా యాగాన్ని ప్రారంభించాడు. విభీషణుడు ఆ రహస్యాన్ని తెలుసుకొని దాన్ని భంగపుచ్చే ఉపాయం చెప్పాడు.

అంగదుడు అదృశ్యకరణి విద్యాప్రభావంతో వెళ్ళి మందోదరి జుట్టుపట్టి రావణుడి ఎదుటికి యీడ్చుకెళ్లాడు. రావణుడి దీక్షభగ్నమై యాగధ్వంసం అయింది.

రావణుడు హతాశుడై చివరకు యుద్ధానికి బయలుదేరాడు. అప్పుడు కూడ మందోదరి సీతను రాముడికి అప్పగించమని భర్తకు హితవు చెప్పింది.

"రావణుడు రావణుడే!" అని సింహగర్జన చేసి పది గుర్రాలు పూన్చిన రథం మీద రావణుడు యుద్ధానికి వెళ్ళాడు.

ఇంద్రజిత్తును చంపిన లక్ష్మణుడిని చూడగానే అతడికి ఆగ్రహావేశం ముంచుకొచ్చింది. ఒకప్పుడు బంధ విమోచనకు మారుపణంగా ఇంద్రుడి నుంచి తీసుకున్న శక్తిమహాయుధాస్త్రాన్ని రావణుడు లక్ష్మణుడిపై వేశాడు. లక్ష్మణుడు పడిపోయాడు.

హనుమంతుడు క్షణాల మీద హిమాలయ పర్వతానికెళ్ళి సూర్యోదయంలోపలే సంజీవిని తెచ్చి, మూర్ఛ నుండి లక్ష్మణుడిని కాపాడాడు.

రామరావణుల మధ్య యుద్ధం జరుగుతున్నప్పుడు, దేవలోకం నుండి ఇంద్రుడు రాముడికి మాతలి సారథిగా దివ్యరథాన్ని పంపాడు.

రామరావణ భీషణ సంగ్రామంలో రావణుడి తలలు తెగిపడి నేలమీద దొర్లుతూంటే తిరిగి తలలు మొలుచుకొస్తున్నాయి.

అప్పుడు విభీషణుడు రాముడితో రావణుడి కడుపులో ఉన్న అమృత

భాండం ఊడిపడేలాగ ఛేదించమని చెప్పాడు. రాముడు బ్రహ్మాస్త్రంతో ఆ పని చేశాడు.

రావణుడు ఒంటితలతో ఏకాకిగా నేల కూలాడు.

ఆ విధంగా గుట్టుమట్లన్నీ చెప్పిన విభీషణుడివల్ల, "ఇంటిగుట్టు లంకకు చేటు!" అనే సామెత వచ్చింది.

రావణ సంహారంతో లంకాసామ్రాజ్యం పతనమై రాక్షస రాజ్యం అంతరించింది. విభీషణుడు లంకకు రాజయ్యాడు.

రావణ కుంభకర్ణుల చావుతో జయ విజయుల రెండో జన్మ ముగిసింది.

అశోకవనం నుండి సీత వచ్చింది.

రాముడు, "సీతా! దుర్మార్గుణ్ణి శిక్షించి రాజుగా నా కర్తవ్యాన్ని నిర్వర్తించాను. నిన్ను రావణుడు ఎత్తుకెళ్ళి లంకలో ఉంచాడు. నిన్ను నేను ఎలాగ స్వీకరించి అయోధ్యకు తీసుకెళ్ళగలను? ఇక నీ యిష్టానుసారంగా నీవు నడుచుకో వచ్చును!" అని చెప్పాడు.

సీత అక్కడున్నవారితో ఆజ్ఞాపిస్తున్నట్లుగా తనకోసం అగ్నిగుండాన్ని సిద్ధం చేయమని చెప్పింది.

సీత రాముడి పాదాలపై దృష్టి నిలిపి భక్తితో నమస్కరించి, అగ్నిలోకి దూకింది. అగ్నిగుండంలో జ్వాలలు ఉవ్వెత్తున లేచాయి.

ఆ జ్వాలలోంచి అగ్నిదేవుడు సీతను నవవికసిత పద్మంలాగ దోసిట ఎత్తి వచ్చి, "రామా! సీత నిప్పులాంటిది! పావని! స్వీకరించు!" అని చెప్పాడు.

అదే సమయంలో స్వర్గంనుండి దశరథుడు విమానంలో అందరికీ కనిపించి, "నాయనా! రామచంద్రా! అగ్నిపరీక్షలో సీత పవిత్రురాలని నిరూపణ అయింది. సీతతో అయోధ్యకు వెళ్ళి రాజ్యపాలన చెయ్యి!" అని కుమారుని ప్రేమతో ఆదేశించాడు.

రాముడు ఎందరు ఎక్కినా నిండని పుష్పక విమానంలో అందరితో అయోధ్యకు చేరాడు.





# విష్ణు కథ

రాముడు పట్టాభిషిక్తుడై, లక్ష్మణ భరత శత్రుఘ్నుల అండదండలతో రాజ్యాన్ని చక్కదిద్ది, ఆదర్శప్రాయంగా రాజ్య పాలన చేస్తూండగా, ప్రజలు అన్నివిధాలా ఆనందిస్తున్నారు.

ఒకనాడు పల్లెటూరి బ్రాహ్మణుడు ఒకడు తన అయిదేళ్ళ కొడుకు శవం తెచ్చి రాజద్వారం దగ్గిర నిలబడి ఏడవటం మొదలు పెట్టాడు. తనకున్న ఒకే కొడుకు అకాలమరణం పొందినందుకు ఏడుస్తూ ఆ బ్రాహ్మణుడు—రాజు సరిగా పాలిస్తే ఇలాటి అకాలమరణాలుండవనీ, ఇన్నాళ్ళకు ఇక్ష్వాకుల పరిపాలనలో, రాముడి హయాంలో దేశం దిక్కుమాలినదయిందనీ అన్నాడు.

రాముడీ సంగతి తెలుసుకుని చాలా చింతించి, తన మంత్రులనూ, వసిష్ఠుడు మొదలైన బ్రాహ్మణులనూ పిలిపించి, వారితో బ్రాహ్మణ బాలుడి అకాలమరణం గురించి చెప్పాడు. శంబుకు డనే ఒక శూద్రుడు గొప్ప తపస్సు చేస్తున్నాడనీ, అది యుగధర్మానికి విరుద్ధమనీ, అందుకే ఆ బాలుడు చనిపోయాడనీ, నారదుడు రాముడితో అన్నాడు.

రాముడు లక్ష్మణుడితో, "నీవు వెళ్ళి ఆ బ్రాహ్మణుణ్ణి ఓదార్చి, ఆ బాలుడి కళేబరాన్ని తైలభాండంలో భద్రంగా వుంచు," అన్నాడు. తరవాత అతను ఆయుధాలు తీసుకుని పుష్పకం ఎక్కి పడమరా, ఉత్తరమూ, తూర్పూ గాలించి,

15. రామరాజ్యం



చివరకు దక్షిణదిక్కున ఒక సరస్సులో తలకిందుగా తపస్సు చేస్తున్న మనిషి నొకణ్ణి చూశాడు.

రాముడు పుష్పకం దిగి, తన కత్తి దూసి శంబుకుడి తల నరికాడు. శంబుకుని తల కళ్ళు విప్పి ఆనందంగా రాముణ్ణి చూసి, "రాఘవా! మరణమన్నది ఏదో ఒకలాగ తప్పనిది, నీవు నిమిత్తమాత్రుడివి. వర్ణాశ్రమ ధర్మాలకు కట్టుబడి ఉన్న వివిధవర్గాలతో కూడిన ప్రజలకు నీవు రాజువి; రాజు ప్రజా సేవకుడు. ఆ ధర్మాన్ని నిర్వర్తించావు. నీవు విచారించవలసిన పనిలేదు. నిన్నెటువంటి పాతకమూ అంటదు; నేను కులానికీ, వృత్తికి అతీతుడైన యోగిని; విష్ణుసాయుజ్యాన్ని పొందుతున్నాను!" అని చెప్పి కళ్ళు మూసింది.

శంబుకుని భార్య కపిల రాముడితో, "సీతాపతీ! రాజధర్మ నిర్వహణలో ముస్ముందు నీవు ఎదుర్కొనవలసి ఉన్న కఠోర పరీక్షకు ఇది నాంది! నేను నా భర్తతో సంతోషంగా వెళ్తున్నాను. దృఢ చిత్తుడవై కర్తవ్య పాలన చెయ్యి!" అని చెప్పి భర్తతో చితిపై సహగమనం చేసింది.

రాముడు తిరిగి వస్తున్న దారిలో, ఒక గుడ్లగూబకు చెందిన చెట్టు తొర్రను దురాక్రమణ చేసిన గ్రద్దను శిక్షిస్తున్నట్లుగా దాని తలమీద చేత్తో తట్టాడు.

ఆ వెంటనే గ్రద్ద రూపం పోయి బ్రహ్మదత్తుడనే రాజు శాపవిమోచనం పొంది వెళ్ళాడు.

విశ్వామిత్రుడు రాముడి కొలువుకు వచ్చి, తనను అవమానించిన శకుంతుడు అనే రాజును వధించవలసిందిగా ఆజ్ఞాపించాడు.

అప్పటికప్పుడే రాముడు గురువు ఆనతిని తలదాల్చి శకుంతుణ్ణి వధించడానికి బయలుదేరాడు.

హనుమంతుడి తల్లి అంజనాదేవి శకుంతుడికి శరణు ఇచ్చింది. హనుమంతుడు తల్లి మాట నిలపడానికి, రామ

బాణానికి ఎదురొడ్డి రామనామం జపిస్తూ కన్నులు మూసి నిలబడ్డాడు. రాముడు విడిచిన బాణం హనుమంతుని హృదయంలో లీనమైంది.

ఇది చూసిన విశ్వామిత్రుడు దురాగ్రహం విడిచి శకుంతుణ్ణి దీవించి అక్కడి నుంచి వెళ్ళాడు.

ఒక అర్ధరాత్రి రాముడి శయన మందిరం ముందు ఒక కుక్క న్యాయం కోసం ఆర్తనాదం చేసింది. రాముడు దిగ్గున వచ్చి రక్తం కారుతూన్న దాని గాయాన్ని అదిమి పట్టాడు.



కుక్క తాను కిందటిజన్మలో పూజారిగా ఉన్నందువల్లే కుక్కగా పుట్టాననీ, నిష్కారణంగా తన్ను కొట్టినవాడిని పూజారిగా నియమించవలసిందనీ, అదే తగిన శిక్ష అనీ చెప్పింది. దాని గాయం మాయమై సుఖంగా వెళ్ళింది.

ఏ ప్రాణికీ నొప్పి కలగకుండా చక్కగా రాజ్యపాలన జరుగుతున్న రామ రాజ్యంలో—"పరాయివాడి ఇంట ఉన్న భార్యను తెచ్చిపెట్టుకొనేలాంటి సిగ్గుచేటు పని చేయడానికి, రాజ్యమేలే రాముడిని కాను—!" అనే మాట ఒక అల్పుడి నోట వెలువడింది.

సీతను అరణ్యంలో వదిలి రమ్మని రాముడు లక్ష్మణుడితో చెప్పాడు. లక్ష్మణుడు ఆక్రోశంతో ఆవేశపడుతూంటే, "లక్ష్మణా! ఒక అల్పుడు ఆడంబరంగా పలికిన మాట ఎంతోమంది మనస్సుల్లోనో దాగి ఉండవచ్చును గదా! రాజ్యమంటే నేలకాదు, మనుషులు! భిన్నవర్గాలతో నిండిన ఆ ప్రజల్ని పాలించడం అనేది కత్తి పదును మీద నడక! స్వార్థానికి ఏ మాత్రం తావు లేదు. జనవాక్యాన్ని కర్తవ్యంగా ఎంచి, గుండెను రాయి చేసుకొనవలసిన రాజును నేను!" అని రాముడు అన్నాడు.

మునిపత్నులతో ఆశ్రమాల్లో ముచ్చటగా గడపాలన్న నిండు చూలాలైన సీత కోరిక చెల్లించే నెపంతో, లక్ష్మణుడు రథం



మీద సీతను తీసుకెళ్ళి కీకారణ్యంలో దిగవిడిచి వచ్చి, ''అయ్యో! ఆ నాడు హనుమంతుడు సంజీవిని తెచ్చి నన్ను బ్రతికించింది ఇందుకా!'' అని గుండె లవిసేలాగ రోదించాడు.

వాల్మీకి మహర్షి సీతను తన ఆశ్రమానికి తీసుకెళ్ళాడు. సీత కుశుడు, లవుడు అనే అందమైన కవల కుమాళ్ళను కన్నది.

అయోధ్యా రాజ్యంలో అనావృష్టి ఏర్పడింది. వర్షాలు సరిగ్గా కురవక భూమి బీటలు బారింది. సీతావియోగంతో కుమిలి పోతున్న రాముడితో అశ్వమేధ యాగం చేయమని పెద్దలు ఆదేశించారు. బంగారంతో సీత విగ్రహాన్ని చేయించి పక్కనుంచుకొని రాముడు యాగదీక్ష పట్టాడు.

లవకుశులు వాల్మీకి రచించిన రామాయణాన్ని గానం చేస్తూ అయోధ్యకు వచ్చారు. ముని బాలకులమని చెప్పుకొన్న వారిని చూసి రాముడు ముచ్చటపడి కౌగలించుకొని కానుకలిచ్చి పంపాడు.

రఘు వంశీయులకు తప్ప అన్యులకు పట్ట శక్యం కాని అశ్వమేధయాగాశ్వాన్ని లవకుశులు పట్టి కట్టేశారు.

యాగాశ్వాన్ని విడిపించడానికి వచ్చిన శత్రుఘ్న, భరత, లక్ష్మణులతో యుద్ధం చేసి, వాళ్ళను మూర్ఛపోయేలా చేసిన లవకుశులను రాముడు ఎదుర్కొన్నాడు.

లవకుశులు తల్లి మీద ఆన పెట్టి బాణాలు వదిలారు. రాముడు మూర్ఛపోగా సీత వచ్చి పాదాలుపట్టి మేల్కొలిపింది. రాముడితోబాటు అంతా మూర్ఛ నుండి లేచారు.

వాల్మీకి రాముడికి కుమాళ్ళనూ, సీతనూ అప్పగించాడు. రాముడు సీతతో సింహాసనంపై కూర్చొని లవకుశులను తొడలపై కూర్చుండబెట్టుకొని వారిని యువరాజులుగా ప్రకటించాడు.

తరువాత రాముడు సీత తన ఔచిత్యానికి తగ్గట్టుగా అయోధ్యా ప్రజలముంధు శపథం చేయవలసిందని చెప్పాడు.



సీత అయోధ్యానగర మధ్యంలో నిల బడి ఆకాశాన్ని చూసి, అయోధ్యా రాజ్యంపై వర్షం కురవాలని పలికింది. మరుక్షణంలో ఆకాశం మబ్బులతో నిండి అమృత జలధారలతో రాజ్యమంతటా వాన కురిసింది.

ఆ తరువాత సీత నేలను చూస్తూ, "అమ్మా! రఘువంశదీపకులైన కుమాళ్లు తండ్రి అండ చేరుకున్నారు. నాకు కావ లసిందింకేమీలేదు, నన్ను స్వీకరించు!" అన్నది.

భూమి కంపించింది. భూమి రెండు పాయలుగా చీలింది. దివ్యకాంతులు వెలువడ్డాయి. రత్నసింహాసనంపై భూదేవి మీదకువచ్చి సీతను తన ఒడిలోకి తీసు కొని భూమిలోకి వెళ్ళిపోయింది. పుష్ప వృష్టి కురిసింది. భూమి వెంటనే మూసుకుంది.

రాముడు భూమిని చీలుస్తానని విల్లెక్కుపెట్టాడు. అప్పుడు ఆకాశవాణి, "రామా! భూదేవిపై ఆగ్రహించడం పాడి కాదు. సీత భూజాత. భూమిలోకి వెళ్ళి నిజనివాసం చేరింది!" అని పలికింది.

రాముడు కుమాళ్ళను చూసుకొంటూ చాలా కాలం రాజ్యం చేశాక, యమధర్మ రాజు బ్రాహ్మణవేషంతో వచ్చి, దేవ రహస్యం చెప్పవలసి ఉందనీ, లక్ష్మణు డిని ద్వారం దగ్గిర కాపుంచమనీ, ఎవరి నైనా రానిచ్చితే లక్ష్మణుడు మరణదండన పొందాలనీ, రాముడితో చెప్పి ఒప్పిం చాడు. లక్ష్మణుడు ద్వారపాలన చేస్తు న్నాడు. యముడు నిజరూపంతో కనిపించి రాముడితో అవతరించిన పని తీరిందనీ, వైకుంఠానికి విష్ణువుగా చేరవలసిందనీ చెప్పాడు.

అదే సమయంలో దుర్వాసుడు వచ్చి తక్షణం రాముడిని చూడటానికి వెళ్ళ నివ్వకపోతే రఘువంశాన్ని శపిస్తానన్నాడు. దుర్వాసుణ్ణి లోనికి వెళ్ళనిచ్చి, లక్ష్మ ణుడు అలాగే వెళ్లి సరయూనదిలో మునిగి పోయాడు.

రాముడు లవకుశులను పట్టాభిషిక్తుల్ని చేసి రాజ్యపాలన చేయించాడు.

అది శ్రావణమాసం. సరయూనది నిండుగా ఉరకలెత్తి ప్రవహిస్తూన్నది. ఆనాడు పూర్ణిమ. చంద్రగ్రహణపర్వదినం.

మంగళ తూర్యనాదాలు మ్రోగుతూండగా, భరతశత్రుఘ్నులు ఇరువైపులా అంటిపెట్టుకొని నడుస్తుండగా, రాముడు సరయూనదికి బయలుదేరాడు. అశేష ప్రజానీకం అనుసరించారు.



రాముడు నదీజలాల్లో ప్రవేశించాడు. వెనుకనే తమ్ముళ్ళు దిగారు. అప్పుడే గ్రహణం విడిపోయి, నిండు చంద్రబింబం దేదీప్యమానంగా ప్రకాశించింది. ఆకాశం నుండి జలజలా అఖండంగా పూలవాన కురిసింది. సామ, దేవగాంధార, హిందోళ, సురట రాగాల మేళవింపుతో వీణాధ్వనులు దిక్కులు మారుమ్రోగుతూండగా వినిపించాయి.

అంతటా వెన్నెల మరింత తెల్లగా వెల్లివిరుస్తున్నది, పూలవాన కురుస్తున్నది; క్షీరసాగరం లాగ సరయూనది పూలరాసులతో నిండిన ఉవ్వెత్తు కెరటాలతో వడివడిగా సాగింది!

అంతకుముందే క్షీరసాగరంలో లక్ష్మణుడు శేషతల్పంగా, సీత లక్ష్మిగా అమరి ఎదురుచూస్తున్నారు. భరతశత్రుఘ్నులు శంఖచక్రాలు కాగా రామావతారం చాలించి, విష్ణువు లక్ష్మిపాదాలొత్తగా శేషతల్పం అలంకరించాడు.

మాయామానుష విగ్రహుడై ఉత్తమ మానవతామూర్తిగా పితృవాక్యపాలనకై వనవాసం చేసి, కార్యసాధకుడైన మానవమాత్రుడిగా వానరులను కూడగట్టుకొని వారధినికట్టి, అజేయుడనని విర్రవీగిన రావణుడినికొట్టి రాక్షసపాలన అంతమొందించి సీతను తెచ్చి, ఏకపత్నీవ్రతుడై ఆదర్శపాలన చేసిన రాముని అవతారం విష్ణువు దశావతారాల్లో విశేషమైనదిగా కీర్తింపబడింది. రామరాజ్యం ఆచంద్రార్కం పేర్కొన బడుతుంది—

అని సూతమహర్షి రామావతారం ముగించి, కృష్ణావతారం గురించి చెప్పడం ప్రారంభించాడు.

ఒకానొకప్పుడు శివుడు తన భక్తులైన దానవప్రముఖుల్ని అవలీలగా విష్ణువు అంతమొందించడం చూసి అసహనంగా కనుబొమలు ముడిచాడు. ఆ బొమముడి నుండి సహస్రకవచుడు అనే ఘోరాకారుడు ఉద్భవించాడు. పొరలుగా వెయ్యి కవచాలు, అజేయప్రభావంగల కుండలాలుగల సహస్రకవచుడు ప్రళయభీకర గర్జనచేసి, "నేను తెలివిమాలిన రాక్షస మాత్రుణ్ణికాను, రుద్రాంశ సంభూతుణ్ణి! చేవగలవాడైతే ఆ విష్ణు నన్నేం చేయగలడో చెయ్యమనండి!" అని లోకాలు దద్దరిల్లేలాగ అరిచి విజృంభించాడు.

విష్ణువు నర, నారాయణులనే జంట ఋషులుగా అవతరించాడు. నరనారాయణులు సహస్రకవచుడిని జయించగల శక్తి సాధనకు తపస్సు ప్రారంభించారు.

ఇంద్రుడు వారి తపోభంగానికి అప్సరసల్ని పంపాడు. నారాయణుడు తన తొడ నుండి ఊర్వశిని పుట్టించాడు. ఊర్వశి ముందు రంభాది అప్సరసలు వెలవెలపోయారు. ఇంద్రుడు నరనారాయణులకు క్షమాపణ చెప్పుకొని ప్రణమిల్లాడు. నారాయణుడు ఊర్వశిని తీసుకుపొమ్మన్నాడు. అప్సరసలతో కలిసి ఊర్వశి స్వర్గలోకం చేరింది.

నారాయణుడు, నరుడు ఒకరు తపస్సు చేస్తుంటే ఒకరు విల్లమ్ములు ధరించి సహస్రకవచుడితో పోరాటంచేస్తూ, అలాగ వేల సంవత్సరాల పాడుగున సాగిన యుద్ధంలో, తొమ్మిదివందల తొంభైతొమ్మిది సహస్రకవచుడి కవచాలను ఛేదించారు.

సహస్రకవచుడు ఒకే కవచంతో పారిపోయి సూర్యుడిలో దాక్కున్నాడు.

"ప్రగల్భాలు పలికి చివరికి పారిపోయి దాక్కున్నాడు, పిరికిపంద! వీడి పని కృష్ణావతారంలో పట్టించాలి!" అని విష్ణువు నిశ్చయించుకున్నాడు.





# విష్ణు కథ

కృత, త్రేతా యుగాల తర్వాత ద్వాపర యుగంలో రాక్షసులు విపరీతంగా మనుషులై పుట్టి, భూమికి బరువయ్యారు. భూదేవి విష్ణువుతో మొరపెట్టింది.

విష్ణువు, "దేవీ! కృష్ణావతారం ఎత్తి, నీ ఆర్తి తొలగిస్తాను!" అని అభయమిచ్చాడు.

ఆదికాలం నుంచీ విష్ణువుకు ప్రబల శత్రువైన కాలనేమి రాక్షసుడు కంసుడుగా పుట్టి, మధురానగరాన్ని పాలించే ఉగ్రసేనుడి కుమారుడనిపించుకున్నాడు.

దేవాసుర యుద్ధంలో, దానవ నాయకుడై విష్ణువుతో పోరాడిన విప్రచిత్తి, మగధ రాజ్యాన్నేలే జరాసంధుడై, రాజులను తెచ్చి భైరవుడికి బలులిచ్చి అతి శ్రద్ధగా అర్చిస్తున్నాడు. కంసుడు జరాసంధుడి అల్లుడు.

ఉగ్రసేనుడి తమ్ముడి కుమార్తె దేవకికి, యదువంశ రాజైన వసుదేవుడితో వివాహం జరిగింది. కంసుడు వారిని రథం మీద తీసుకుపోతూండగా, ఆకాశవాణి—దేవకి ఎనిమిదో సంతానంవల్ల కంసుడు చంపబడతాడు—అని పలికింది.

కంసుడు దేవకిని చంపబడకుండా వసుదేవుడు అడ్డుపడి, ఆమె ప్రసవించే బిడ్డల్ని అప్పగిస్తానని కంసుడికి యిచ్చిన మాట తప్పకుండా, ఆరుగుర్ని అప్పగించాడు.

దేవకి ఏడవ గర్భాన విష్ణువు అంశతో ఆదిశేషుడు పడ్డాడు. ఆ పిండాన్ని గోకు

16. కృష్ణావతారం



లంలో ఉన్న వసుదేవుడి మరొక భార్యయైన రోహిణి గర్భాన చేర్చి, పిమ్మట నందగోపుడి భార్య యశోదకు కూతురుగా పుట్టమని యోగ మాయాదేవిని విష్ణువు ఆదేశించాడు.

దేవకి ఏడవ గర్భం ప్రసవం రాకుండా అణగారిపోయింది. తర్వాత దేవకి ఎనిమిదోసారి గర్భం ధరించిన వెంటనే, దేవకీ వసుదేవుల్ని కంసుడు కారాగారంలో పెట్టాడు.

అది శ్రావణ మాసం. కృష్ణపక్షం. అష్టమి ప్రవేశించింది. చంద్రుడు రోహిణీ నక్షత్రంతో ఉన్నాడు. నడి రాత్రి. కావలి భటులకు చావునిద్ర ముంచుకొచ్చింది. దేవకి ప్రసవించింది. విష్ణువు కృష్ణుడుగా అవతరించాడు. చెరసాల తలుపులు తెరుచుకున్నాయి.

విష్ణువు ఆదేశంతో వసుదేవుడు బిడ్డడిని యమునానదిని దాటించి, అదే సమయంలో గోకులంలో అందర్నీ మాయనిద్ర ఆవహించగా, ఆ నిద్రలోనే ఆడపిల్లను ప్రసవించిన యశోద పక్కలో పిల్లవాణ్ణి ఉంచి, ప్రాణం లేనట్లున్న పిల్లను సంగ్రహించుకొని వెళ్ళాడు.

చెరసాల చేరగానే దిక్కులు పిక్కటిల్లేలాగ ఆ శిశువు క్యారుమని గగ్గోలు చేసింది.

కంసుడు శిశువును వధ్యశిలపై కొట్టి చంపబోగా పైకెగసి, పకపక నవ్వుతూ, ''ఓరి, కంసా! నిన్ను చంపేవాడు క్షేమంగా ఉన్నాడులే!'' అని చెపుతూ, దుర్గాదేవిగా కనిపించి అంతర్ధానమైంది.

కంసుడు భయంతో, ఆగ్రహంతో దేవకీ వసుదేవుల ఎదుట వారి ఆరుగురి బిడ్డల్నీ తెగటార్చాడు.

గోకులంలో కృష్ణుడు పుట్టినందుకు కృష్ణాష్టమి, గోకులాష్టమిగా వేడుకలు జరిగాయి. అంతకుముందే కృష్ణుడికి అన్నగా రోహిణికి బలరాముడు పుట్టాడు.

నారదుడు కంసుడి దగ్గిరికి వచ్చి, ''కంసా! నువ్వు ఉగ్రసేనుడి కుమా

రుడివి కావు; కాలనేమివి! నిన్ను చంపాలని పుట్టిన ఆ విష్ణువు ఎక్కడో ఉన్నాడని వింటివి గదా? నీ పిలుపు కోసం రాక్షసులు ఎదురు చూస్తున్నారు!'' అని హెచ్చరించి వెళ్ళాడు.

ఉగ్రసేనుడితో వివాహమై, విరహంతో ఉన్న ఉగ్రసేనుడి రాణిని ఒక రాక్షసుడు ఉగ్రసేనుడి రూపంతో వెళ్ళి మోసపుచ్చినప్పుడు, కాలనేమి ఆమె గర్భం ప్రవేశించి కంసుడుగా పుట్టాడు.

కంసుడు ఉగ్రసేనుడిని కారాగారంలో వేయించి సింహాసనం ఆక్రమించాడు. రాక్షసులందర్నీ చేరదీసుకున్నాడు. పసివాళ్ళను చంపమని పూతన రక్కసిని పంపాడు. ఊరూరా పసిపాపల్ని చంపుతూ, మానవకాంత రూపంతో వెళ్ళి పాలీయవచ్చిన దాని ప్రాణాలు పీల్చి చంపాడు కృష్ణుడు.

సుడిగాలిలా ఆకాశానికి ఎత్తుకుపోయిన తృణావర్తుడినీ, బండిగా విరుచుకు పడాలని చూసిన శకటాసురుడినీ చిన్నారి కృష్ణుడు చంపాడు.

యశోద కృష్ణుణ్ణి తను కన్న ముద్దుల పట్టిగా అల్లారు ముద్దుగా చూసుకొని మురిసిపోతూన్నది.

బాలకృష్ణుడు అల్లరివాడై చిలిపి పనులతో ఇంటింట వెన్నలు దొంగిలించాడు.



అనేక అద్భుత లీలలు చేశాడు. కృష్ణలీలలతో గోకులం ఆనందతరంగాలతేలింది.

యశోద కృష్ణుణ్ణి రోలుకి కట్టితే, యీడ్చుకు వెళ్ళి రెండు మహావృక్షాల నడుమ నుంచి లాగాడు. వృక్షాలు కూకటి వ్రేళ్ళతో కూలి గంధర్వులు శాపవిముక్తి పొందారు.

మన్ను తిన్నాడని నోరు చూపమనగా అవులించి యశోదకు విశ్వరూపం చూపించాడు.

కాళీయ మహాసర్పం పడగల మీద తాండవం చేసి మర్దించాడు.

గోకులంలోని వారంతా బృందావనానికి వలసపోయినప్పుడు, గోవర్ధన పర్వతాన్ని



పూజించినందుకు దేవేంద్రుడు అలిగి పిడుగుల జడివాన కురిపించగా, వ్రేలితో గోవర్ధనగిరిని ఎత్తి గొడుగుపట్టి గోవులనూ, గోపజనాన్నీ కాపాడి ఇంద్రుడి గర్వ భంగం చేశాడు.

వేణుగోపాలుడై ఆలమందలను కాచాడు. మురళీ గానంతో గోవుల్నీ, గోపికల్నీ, బృందావనాన్నీ పరవశింపజేశాడు.

మారు రూపాలతో వచ్చిన అనేకమంది రాక్షసుల్ని హతమార్చాడు. బలరాముడు కొందర్ని తుదముట్టించాడు.

కృష్ణ బలరాముల్ని చంపడానికి కంసుడు ధనుర్యాగం మిషతో మధురా నగరానికి రప్పించాడు. చంపాలని పన్నిన పన్నాగాలన్నిటినీ బాలయదువీరులు చిత్తు చేశారు.

కృష్ణుడు కంసుణ్ణి గద్దె నుండి జుట్టు పట్టి యీడ్చి ముష్టిఘాతంతో చంపాడు.

దేవకీ వసుదేవుల్నీ, ఉగ్రసేనుణ్ణి సంకెళ్ళ నుండి విడిపించి ఉగ్రసేనుడిని సింహాసనంపై నిలిపాడు.

కృష్ణ బలరాములు యువకులై యదు వంశ నాయకులయ్యారు.

తన కుమార్తెలైన అస్తి, ప్రాప్తిలను విధవలుగా చేసినందుకు జరాసంధుడు కృష్ణుడిపై పగబట్టాడు. ఇరవైమూడు అక్షౌహిణుల సైన్యంతో మధురను ముట్టడించాడు.

కృష్ణుడు జరాసంధుడిని ఓడించి ప్రాణాలతో విడిచి తరిమికొట్టాడు.

యవనమ్లేచ్ఛులకు రాజైన కాలయవన రాక్షసుడిని జరాసంధుడు కృష్ణుడి మీదకు ఉసిగొల్పాడు.

కృష్ణుడు కాలయవనుడికి దొరక్కుండా పరుగెత్తి ముచికుందుడు నిద్రిస్తున్న గుహలో జొరబడి దాక్కున్నాడు.

ముచికుందుడు ఇక్ష్వాకుల నాటి మాంధాత కుమారుడైన గొప్ప రాజు. యుద్ధాల్లో దేవతలకు గొప్ప సహాయం చేశాడు. దేవతలు వరం కోరుకోమనగా మోక్షాన్ని కోరాడు. ద్వాపరయుగంలో



కృష్ణుడి దర్శనం అనంతరం సిద్ధిస్తుందని దేవతలు చెప్పగా అంతవరకు నిద్రను, నిద్రాభంగం చేసినవారు తను చూడగానే భస్మం కావలెనని కోరుకున్నాడు.

కాలయవనుడు ముచికుందుణ్ణి కృష్ణుడనుకొని తన్నాడు. నిద్రాభంగమై ముచికుందుడు తీక్షణంగా చూసేసరికి కాలయవనుడు బూడిద అయ్యాడు.

కృష్ణుడు ముచికుందుడికి దర్శనమిచ్చి, బదరికాశ్రమం చేరుకొని తపస్సు చేశాక మోక్షం సిద్ధిస్తుందని చెప్పాడు.

జయ, విజయులు వారి మూడో జన్మగా కృష్ణుని శత్రువులుగా శిశుపాలుడు, దంతవక్త్రుడుగా పుట్టారు.

చేదిదేశానికి రాజైన దమఘోషుడికి కుమారుడుగా శిశుపాలుడు నాలుగు చేతులతో, మూడు కన్నులతో పుట్టాడు. ఎవరు ఎత్తుకున్నప్పుడు మూడో కన్ను, రెండు చేతులు మాయమవుతాయో అతని చేతనే చంపబడతాడని ఆకాశవాణి చెప్పింది. శిశుపాలుడి తల్లి సాత్వతి వచ్చిన వారందరికీ పిల్లవాణ్ణి ఎత్తుకోమని యిస్తుండేది. కృష్ణ బలరాములకు సాత్వతి అత్త అవుతుంది. వారికీ యిచ్చింది. కృష్ణుడు ఎత్తుకోగానే పిల్లవాడు సాధారణ రూపుడయ్యాడు.

శిశుపాలుడిని నూరు తప్పుల వరకు విడిచి పుచ్చమని సాత్వతి అర్థించింది. కృష్ణుడు అలాగేనని ఆమెకు మాట యిచ్చాడు.

శిశుపాలుడు రాజై జరాసంధుడితో చేరి అత్యాచారాలూ, అపరాధాలూ చేస్తూ వచ్చాడు. అతడికి తమ్ముడు దంతవక్త్రుడు తోడైనాడు.

జరాసంధుడు మాటిమాటికీ మధురా నగరంపై దాడి చేస్తూంటే కృష్ణుడు పలుమార్లు ఓడించి, తరిమికొట్టి, దుర్మార్గులైన రాజులెందర్నో కడతేర్చాడు.

కృష్ణుడు సముద్రుణ్ణి చోటు అడిగి సముద్ర మధ్యంలో విశ్వకర్మచేత సురక్షితమైన ద్వారకానగరాన్ని వైభవోపేతంగా

నిర్మింపజేసి తనవారినందరినీ ద్వారకకు తరలించాడు.

జరాసంధుడు చివరిసారిగా శిశుపాలుడు, దంతవక్త్రుడు, పౌండ్రకుడు, సాళ్వుడు మొదలైన తన అనుయాయులైన రాజులందర్నీ కూడగట్టుకొని మధురను ముట్టడించాడు.

అంతకుముందే యాదవుల్నీ, మధురా ప్రజనూ, ద్వారకకు పంపించిన కృష్ణ బలరాములు ప్రవర్షణగిరికి చేరుకొని శిఖరాగ్రాన్ని అధిరోహించారు.

జరాసంధాదులు ప్రవర్షణగిరి చుట్టూరా మంటలుపెట్టి గిరిని కాల్చారు. కృష్ణ బలరాములు ఆకాశమార్గాన ద్వారకకు సురక్షితంగా చేరుకున్నారు.

జరాసంధుడూ, శిశుపాలుడూ కృష్ణ బలరాములు దగ్ధమై ఉంటారని పొంగిపోతూ వెళ్తుంటే, ద్వారక నుండి కృష్ణుడు పూరించిన శంఖధ్వని విని తెల్లముఖాలతో ఒకర్నొకరు చూసుకున్నారు.

శిశుపాలుడు అక్కసుకొద్దీ మధురా నగరాన్ని నిప్పుపెట్టి కాల్చాడు.

జరాసంధుడు నౌకల మీద ద్వారకను ముట్టడించాలని సైన్యాలను పంపాడు. పెనుతుఫానులో చిక్కుకొని నౌకలన్నీ మునిగిపోయాయి. జరాసంధుడు యీవలి సముద్రం ఒడ్డున కెరటాల విజృంభణ



చూస్తూండగా, "తాతా!" అన్న కృష్ణుడి పిలుపు, పకపక నవ్వు వినిపించింది.

సముద్ర మధ్యంలో ఒక గుట్ట మీద నిల్చుని నవ్వుతున్న కృష్ణుడు కనిపించాడు.

"జరాసంధా! ఇప్పుడు నువ్వేమీ చేయలేవు. ద్వారకకు సముద్రుడు నిన్ను చేరనివ్వడు. నీకు నా చేతిలో చచ్చే అదృష్టం లేదు. నీ సమ బలుడైన వాడిచేత చస్తావు. కొంతకాలం గతించాక మళ్ళీ పునర్దర్శనం, వెళ్ళు!" అన్నాడు కృష్ణుడు.

విదర్భ రాజైన భీష్మకుడికి కుమార్తెగా లక్ష్మి రుక్మిణిగా పుట్టింది. బాలప్రాయం నుంచీ కృష్ణుడే తన నాథుడని చెప్పు

కొనేది. అటువంటి రుక్మిణిని, రుక్మిణి అన్న రుక్మి కృష్ణుని శత్రువర్గంలో చేరి చెల్లెలికి శిశుపాలుడితో వివాహం చెయ్యడానికి సర్వసన్నాహాలు చేశాడు.

ఆ వివాహం తప్పించి తన్ను చేపట్టి రక్షించమని రుక్మిణి కృష్ణుడికి కబురు పంపింది.

పెళ్ళికి ముందు రుక్మిణి దుర్గను పూజించి, ఆలయం నుంచి వస్తూండగా, కృష్ణుడు రుక్మిణి చేయిపట్టి నాలుగు గుర్రాలు పూన్చిన తన రథం మీదకు ఎక్కించుకొన్నాడు. రుక్మి, శిశుపాల జరాసంధాదులు ఎదుర్కొన్నారు.

బలరాముడు యాదవ వీరులతో వెనుకనే వచ్చి తమ్ముడితో కలిశాడు.

కృష్ణుడు శిశుపాలుణ్ణి తరిమికొట్టాడు. బలరాముడు జరాసంధుడినీ ఓడించి తరిమాడు. శత్రు రాజులందర్నీ కృష్ణ బలరాములు చిందర వందర చేశారు.

కృష్ణుడు విజయశంఖం పూరించి రుక్మిణిని రథం మీద ఎత్తుకుపోతూంటే వెంటతలపడిన రుక్మిని ఓడించి జుట్టు, మీసమూ గొరిగి పరాభవించి విడిచిపెట్టాడు. రుక్మి తలెత్తుకొని మరెప్పుడూ కృష్ణుడి జోలికి పోలేదు.

క్షత్రియ వీరుడికి తగిన రాక్షస వివాహంగా ఎత్తుకు వచ్చిన రుక్మిణీ కళ్యాణం కృష్ణుడితో ద్వారకలో ఎంతో వైభవంగా జరిగింది.

తరువాత కృష్ణుడు నీలాపనింద తొలగించుకోడానికి అరణ్యం పట్టి, గుహలో జాంబవంతుడితో యుద్ధంచేసి, శ్యమంతక మణిని తెచ్చి, సత్రాజిత్తుడికి యిచ్చి, భూదేవి అంశగల అతని కుమార్తె సత్యభామను వివాహం చేసుకొన్నాడు. తరువాత జాంబవతిని, మిత్రవింద, కాళింది, లక్షణ, భద్ర, నాగ్నజితిని వివాహం చేసుకొని అష్ట మహిషులతో అష్ట సిద్ధులు గల యోగపురుషుడిలాగ, అష్ట ఐశ్వర్యాలతో తులతూగుతూ, ద్వారక రాజధానిగా యాదవులకు ప్రధాన నాయకుడై వెలుగొందుతున్నాడు.





# విష్ణు కథ

## 17. కృష్ణ విజయాలు

కృష్ణుడి ఔన్నత్యం పెరుగుతున్నట్లే, శత్రువులు కూడా పెరిగారు. శిశుపాల జరాసంధుల కూటంలో చాలా మంది దుర్మార్గులైన రాజులు కలిశారు. పౌండ్రకుడనే కరూశదేశరాజు కృత్రిమ కర్రచేతులను శంఖచక్రాలతో చేయించుకొని, భుజాలకు తగిలించుకొని, పెద్ద గదను పట్టుకొని, తానే విష్ణు అవతారుడిననీ, వాసుదేవుడననీ, కృష్ణుడు కానేకాడనీ ప్రగల్భాలు చాటుకుంటున్నాడు. శిశుపాలుడి మరొక తమ్ముడు సాల్వుడు సౌభక మనే విమానం మీద, ద్వారకా నగరం పైన విహారం చేస్తూ కయ్యానికి కాలుదువ్వుతున్నాడు. తూర్పు దిశను నరకాసురుడు ప్రచండంగా చెలరేగుతున్నాడు. దక్షిణంలో బలిచక్రవర్తి కుమారుడైన బాణాసురుడు, శివుడి రక్షణతో శోణపురాన్ని రాజధానిగా రాక్షస పాలన విస్తరింపజేస్తున్నాడు.

కాలయవనుడి తమ్ముడు కాలాంతకుడు తనకు జీవిగా పుట్టిన ఎవ్వరివల్లా భయం లేదన్న దైవజ్ఞ నిర్ణయం ధీమాతో, యవనమ్లేచ్ఛ సైన్యాలతో దారుణ రక్తపాతం సాగిస్తూ, దేవతా విగ్రహాలనూ శిల్పాలనూ ధ్వంసం చేస్తూ, దేశాలను కొల్లగొడుతూ కృష్ణుణ్ణి హతమార్చాలని పగబట్టాడు.

దండయాత్ర సాగిస్తూ గాంధారసీమలో జగన్మోహనంగా పాలరాతితో మలచిన మోహినీ శిల్పాన్ని చూసి వివశుడయ్యాడు.



శంతో కాలాంతకుడు తటాలున వెళ్ళి ఆమె చేతులను తన మెడ చుట్టూ వేసుకొన్నాడు. మరుక్షణమే ఆమె యథా ప్రకారం శిలావిగ్రహం అయింది. విగ్రహం బాహుబంధంలో మెడ బిగుసుకుపోయి గిలగిల తన్నుకొంటూ, బొగ్గుగా మాడిపోయి దభీమని కింద పడిపోయాడు. విగ్రహం చేతులు విరిగిపోయాయి. కాలాంతకుడు చచ్చాడు. యవన రాజ్యంలో చేతుల్లేని మొండి మోహినీ విగ్రహం మిగిలిపోయింది.

కాలాంతకుడి సేనలను కృష్ణుడు తరిమి తరిమి కొట్టాడు. అంతలో పెద్ద అగ్నిపర్వతం పగిలి యవనరాజ్యాన్ని ధ్వంసం చేసింది.

ఆ విగ్రహాన్ని కృష్ణుడు విశ్వకర్మ చేత చేయించి, తన యోగమాయాగ్నిని దాని లోకి పంపి, అక్కడ పెట్టించాడని కాలాంతకుడికి తెలియదు.

ఆ సాలభంజికా ప్రతిమను తరలించుకుపోయి, కాలాంతకుడు తన అంతఃపుర మందిరంలో పెట్టుకొని, ఆ శిల్ప సుందరికి ప్రాణం వస్తే ఎంత బాగుండును, అని గుటకలు మింగుతున్నాడు.

ఒకనాటి రాత్రి మురళీ గానానికి అనువుగా మ్రోగుతున్న అందెలసవ్వడికి మేల్కొని విగ్రహానికి బదులు నాట్యం చేస్తున్న సుందరిని చూశాడు. మోహావే

పడమటి దిక్కున మ్లేచ్ఛ, యవనుల అలజడి తొలగిందంటే, ఇటు తూర్పున ప్రాగ్జ్యోతిషాన్ని పాలించే నరకాసురుడి విజృంభణ మరింత ఉపద్రవంగా తయారయింది.

వరాహావతారం భూమిని ఉద్ధరించినప్పుడు భూదేవికి పుట్టిన నరకాసురుడు ప్రాగ్జ్యోతిషపురాన్ని రాజధానిగా చేసుకొని, అసురసేనలతో దేవలోకం మీద దాడి చేసి, దేవతలను పాదాక్రాంతులుగా చేసుకున్నాడు. దేవమాత అదితి కుండలాలను లాక్కొచ్చాడు. మునులను, సాధు సజ్జను

లను హింసిస్తూ, భూమిని మరొక నరకం చేశాడు. పదహారువేల మంది కన్యలను చెరదెచ్చాడు.

దేవతలు, మునులు నరకుడి పీడ తొలగించమని కృష్ణుడిని ప్రార్థించారు. కృష్ణుడు వారికి అభయమిచ్చి బయలు దేరాడు. కృష్ణుడి వెంట సత్యభామ కూడా బయలుదేరింది.

తల్లి భూదేవివల్ల గాయపడితేనే తప్ప, నరకాసుర సంహారం అసంభవమని వరం ఉంది. సత్యభామ భూదేవి అంశతో పుట్టినది.



సత్యభామతో కృష్ణుడు గరుడవాహనా రూఢుడై ప్రాగ్జ్యోతిషం మీద దాడిచేసి, అసురసేనలను రూపుమాపాడు.

నరకాసురుడు మదగజాన్నెక్కి ఎదు ర్కొన్నాడు. యుద్ధం చేసి కృష్ణుడు విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో, సత్యభామ నరకుడితో గొప్పగా యుద్ధం చేసింది.

సత్యభామ ఆకర్ణాంతము నారిసారించి విడిచిన బాణం నరకుడి గుండెలో బలంగా నాటుకొంది. అమ్మా! అని నరకుడు నేలకొరిగి తుది సాహసంతో గదను ఎత్తి కృష్ణుడి పైకి లంఘించాడు. కృష్ణుడు చక్రాయుధంతో నరకుడి తల నరికాడు.

తల తెగిపడుతూ కృష్ణుడిని విష్ణువుగా స్తుతించుతూ నరకాసురుడు, తన జ్ఞాప కార్థం లోకులు తననిర్యాణాన్ని పండగ జరుపుకోవాలని వరం కోరుకున్నాడు.

నరకాసుర సంహారం జరిగిన రోజు నరక చతుర్దశి, మర్నాడు నరకపాలన అంతరించిన దీపావళి పండుగలు ఏర్పడ్డాయి.

నరకుడి కుమారుడు భగదత్తుడిని పట్టాభిషిక్తుణ్ణి చేసి, అదితి కుండలాల్ని పుచ్చుకొని, సత్యాకృష్ణులు ద్వారకకు చేరారు.

ఒకనాడు కృష్ణుడు రుక్మిణీదేవి మంది రంలో ఉండగా, నారదుడు వచ్చి పారి



జాత పుష్పాన్ని యిచ్చాడు. కృష్ణుడు దాన్ని రుక్మిణికిచ్చాడు. అది తెలిసి సత్యభామాదేవి అలిగింది. పారిజాత వృక్షాన్నే ఆమె ఇంట నాటుతానని కృష్ణుడు బుజ్జగించాడు.

అదితి కుండలాల్ని యిచ్చే పనిగా, సత్యభామతో కృష్ణుడు గరుత్మంతునిపై దేవలోకం వెళ్ళాడు. అదితి కుండలాల్ని అప్పగించి, సత్యతో నందనవనవిహారం చేస్తూ కృష్ణుడు పారిజాత వృక్షాన్ని పెకలించాడు.

సత్యాకృష్ణులు పారిజాతాపహరణం చేసి వెళ్తూంటే, దేవేంద్రుడు యుద్ధానికి వచ్చాడు. ఇంద్రుడు విసిరిన వజ్రాయుధం గరుత్మంతుడి రెక్కకు తాకగా ఒక ఈకను విదిలించి వదిలాడు.

ఇంద్రుడు గర్వభంగం పొంది, కృష్ణుడున్నంతకాలం, పారిజాత వృక్షం భూమ్మీద ఉంటుందని చెప్పాడు.

సత్యభామ అంతఃపురోద్యానవనంలో పారిజాత వృక్షం పూలతో వికసించింది.

కృష్ణుడు పుత్రప్రాప్తి కోసం కైలాసానికి వెళ్ళి తపస్సు చేసి శివానుగ్రహం పొందాడు. ఆ అదనులో సాల్వుడు, పౌండ్రకుడు ద్వారకావాసులకు అలజడి కలిగించారు. కృష్ణుడు వారిని వధించాడు.

దంతవక్త్రుడు చచ్చిన వారికి ఉత్తర క్రియలు జరిపి వస్తూండగా కృష్ణుడు ఎదురయ్యాడు. గదను ఎత్తి దంతవక్త్రుడు కృష్ణుడిపై లంఘించాడు. కృష్ణుడతడిని సంహరించగా వెలువడిన విజయుని అంశ జ్యోతిరూపంలో కృష్ణుడిలో చేరింది.

కృష్ణుడికి ప్రద్యుమ్నుడు మొదలైన పెక్కుమంది కుమాళ్ళు కలిగారు. ప్రద్యుమ్నుడి కుమారుడైన అనిరుద్ధుణ్ణి కలలో బాణాసురుడి కుమార్తె ఉష చూసి మురిసింది. ఆమె చెలికత్తె చిత్రలేఖ శాంబరీ మాయా ప్రభావంతి, అనిరుద్ధుడిని ఉష అంతఃపురానికి తెచ్చింది. ఉష అతణ్ణి వరించింది.



బాణాసురుడు అనిరుద్ధుణ్ణి నాగ పాశంతో బంధించి చెరలో పెట్టాడు. మనవడి కోసం కృష్ణుడు యుద్ధానికి వచ్చాడు. శివుడు బాణుడి కోసం కృష్ణుడితో యుద్ధంచేసి ఓడిపోయాడు.

కృష్ణుడు బాణాసురుడి వెయ్యి చేతులలో రెండు మిగిల్చి, మిగతా వాటిని నరికాడు. బాణాసురుడు శరణాగతుడై కృష్ణుడితో వియ్యమందాడు. ఉషానిరుద్ధుల కళ్యాణం జరిగింది. దక్షిణంలోని అసురులకూ, ఉత్తరంలోని రాజులకూ సంబంధ బాంధవ్యాలు ఏర్పడి సమైక్యత వర్థిల్లింది.

కృష్ణుడు పాండవులకు అండగా నిలబడ్డాడు. బలరాముడికి సమ్మతం కాకపోయినా కృష్ణుడు చెల్లెలైన సుభద్రకు అర్జునుడితో వివాహం జరిగేలాగ సహాయం చేశాడు.

బావమరదులైన కృష్ణార్జునులు ఖాండవ దహనం జరుగుతున్నప్పుడు ఆ వనంలో ఉన్న రాక్షస మహాశిల్పి మయుడిని కాపాడారు. మయుడు పాండవులకు గొప్ప సభను నిర్మించుతానన్నాడు. అగ్నిదేవుడు కృష్ణుడికి సుదర్శనచక్రాన్నీ, పాంచజన్య శంఖాన్నీ, అర్జునుడికి గాండీవ ధనుస్సునూ, అక్షయ తూణీరాల్నీ, దేవదత్త శంఖాన్నీ సమర్పించాడు.

ధర్మరాజు రాజసూయ యాగం తలపెట్టాడు. జరాసంధుణ్ణి అంతం చేయవలసిన సమయం వచ్చింది.

కృష్ణుడు, భీమార్జునులు మారువేషాలతో గిరివ్రజపురం చేరి, అతిథులుగా జరాసంధుడి మందిరానికి వెళ్ళారు.

జరాసంధుడు, బకాసురుడు, దుర్యోధనుడు, కీచకుడు, భీముడు సమబలులు. వీరిలో ఒకడి చేతనే మిగిలిన నలుగురూ చంపబడతారనే సంగతి కృష్ణుడికి తెలుసు. అదివరకే భీముడు బకాసురుణ్ణి చంపాడు కనుక, భీముడే జరాసంధుణ్ణి చంపాలి. జరాసంధుడు అస్త్రశస్త్రాలతో చావడు. అతని శరీరాన్ని రెండుగా చీల్చి చంపాలి



తాము భోజనానికి బదులు, తమలో ఏ ఒక్కరితోనైనా మల్లయుద్ధాన్ని కోరి వచ్చామని కృష్ణుడు చెప్పాడు. జరా సంధుడు వాళ్ళెవరైనదీ గ్రహించాడు.

"కృష్ణా! నీవు నాకు వెరచి ప్రవర్షణ గిరికి పారిపోయిన వాడివి. అర్జునుడు అర్భకుడు. భీముడే నాకు సరియైన జోడీ!" అన్నాడు జరాసంధుడు.

భీముడికీ, జరాసంధుడికీ ముష్టి యుద్ధం, మల్లయుద్ధం ఘోరంగా జరిగింది. భీముడు జరాసంధుణ్ణి చిత్తుచేసి, కృష్ణుని ఆదేశసంకేతం ప్రకారం జరాసంధుణ్ణి రెండు సమభాగాలుగా చీల్చి, అవి తిరిగి కలుసుకోకుండా వాటిని అపసవ్యంగా వేరుచేశాడు. ఆ విధంగా కృష్ణుడు భీముడిచేత జరాసంధుణ్ణి అంతమొందించాడు.

భీష్ముడు చెప్పగా ధర్మరాజు రాజసూయానికి అగ్రపీఠాన్ని, అగ్రతాంబూలాన్ని కృష్ణుడికి యిచ్చాడు.

సభా మధ్యంనుండి శిశుపాలుడు లేచి అధిక్షేపించాడు. కత్తిదూసి పాండవులనూ, కృష్ణుడినీ హతమారుస్తానన్నాడు. పెళ్ళికూతుర్ని ఎత్తుకుపోయిన కృష్ణుడు దొంగ, కులహీనుడు అంటూ దూషించాడు.

అప్పటికే శిశుపాలుడి అపరాధాలు నూరింటికి మించిపోయాయి.

కృష్ణుడు చక్రంతో శిశుపాలుడి తల ఖండించాడు. శిశుపాలుడి నుండి జయుని అంశ జ్యోతిరూపంలో కృష్ణుడిలో ఐక్యమైంది. జయ విజయులు మూడవ జన్మ సమాప్తమై, వారి శాపం తొలగి విష్ణు ద్వారపాలకులుగా వైకుంఠాన్ని చేరారు.

దుర్యోధనుడు పాండవులకు మయుడు నిర్మించిన మయసభను చూసి అబ్బురపడుతూ, అనేక భంగపాట్లు పడ్డాడు. రత్నకంబళము పరచి ఉన్నదనుకొని అడుగువేసి నీటిలో పడ్డాడు. అది చూసి ద్రౌపది నవ్వింది. దుర్యోధనుడు అవమానంతో కుమిలిపోయాడు. శకుని అతన్ని ఓదార్చి పాండవుల్నీ, ద్రౌపదినీ దుర్యో

ధనుడికి బానిసలుగా చేస్తానన్నాడు. ధర్మ రాజును జూదానికి రప్పించమన్నాడు.

కుచేలుడు కృష్ణుడి బాల్యస్నేహితుడు. కృష్ణబలరాములు సాందీపుని దగ్గర విద్యాభ్యాసం చేశారు. కుచేలుడు సహ విద్యార్థి.

అధిక సంతానంతో, పేదరికంతో కృంగి పోతూన్న ఆ బ్రాహ్మణుడు భార్య సలహాతో కృష్ణుణ్ణి కలుసుకోడానికి బయలుదేరాడు. అతని భార్య రుచికరంగా కొద్ది అటుకులను చేసి చిన్న మూటగట్టి యిచ్చింది.

అష్టమహిషులు సేవిస్తూండగా సౌధో పరిభాగంలో తూగుటూయెల ఊగుతున్న కృష్ణుడు దూరాన వస్తూన్న కుచేలుడిని చూసి పాదచారిగా ఎదురేగివెళ్ళి, బాల్య మిత్రుణ్ణి గాఢాలింగనం చేసుకొని, మంది రానికి తోడ్కొనివచ్చి, తన సింహాసనం మీద కూర్చుండబెట్టాడు.

కృష్ణుడి ఎనమండుగురు దేవేరులు కుచేలుడికి సమస్త మర్యాదలు చేశారు. కృష్ణుడి ఆదరానికి ఆనందపారవశ్యంలో మునిగిన కుచేలుడి చేతనున్న అటుకుల మూటను కృష్ణుడు తీసుకుని, మూట విప్పి పిడికిలి నిండుగాతీసి, ఆప్యాయంగా ఆరగించాడు. అష్టమహిషులు మిగిలిన వాటిని పంచుకొని తిన్నారు.

కుచేలుడు తానెందుకు వచ్చాడో మరచి పోయిన ఆనందంతో, కృష్ణుడిని మనసులో మరీ మరీ తలంచుకొంటూ, తిరుగు ప్రయాణమై ఇంటికొచ్చేసరికి గుర్తు పట్టలేక పోయాడు.

అతని చిన్న ఇంటికి మారుగా గొప్ప భవనం! ఆ భవనానికి వెండి బంగారాల జిలుగుల గోడలు, రత్నాలు పొదిగిన స్తంభాలు కనిపించాయి. అతని భార్య ఆభరణాలతో మెరిసిపోతున్నది. పిల్లలు పట్టుబట్టలతో వసంతంలో కుసుమాల్లాగ ఆనందంగా ఆడుకొంటున్నారు. అష్ట సిరులు అతని ఇంటినిండుగా వెల్లివిరిశాయి.

కుచేలుడూ, అతడి భార్యాపిల్లలూ కృష్ణుడి కృపా విశేషాన్ని కొనియాడుతూ భక్తి తత్పరులై సుఖించారు.





# విష్ణు కథ

శకుని దుర్యోధనుడి తల్లి గాంధారికి తమ్ముడు, గాంధారదేశ రాజైన సుబలుడి కుమారుడు.

వైధవ్యగండం ఉందని సుబలుడు గాంధారికి ముందుగా ఒక పొట్టేలుతో వివాహం జరిపించి, తర్వాత ధృతరాష్ట్రుడితో వివాహం చేశాడు. ఆ పొట్టేలు చచ్చింది.

ఈ సంగతి భీముడు దుర్యోధనుడిని విధవకు పుట్టిన గోళకా! అని సంబోధించి నప్పుడు దుర్యోధనుడికి తెలిసింది.

దుర్యోధనుడు సుబలుడిని, శకునిని పట్టి తెచ్చి అతి దుర్భరమైన కారాగార వాసంలో పెట్టాడు.

సుబలుడు గొప్ప తపోమహిమగల వాడు. చనిపోయేముందు, తన అస్తికలతో పాచికలు తయారుచేసి ప్రతీకారం తీర్చాలని శకునికి చెప్పాడు.

తండ్రి అస్తికలతో తయారు చేసిన పాచికలు శకుని ఏ అంకె కావాలనుకుంటే అలాగ పడతాయి.

శకుని దగ్గరున్న పాచికల సంగతి కారాగార పాలకులవలన విని దుర్యోధనుడు మామను చెరవిడిపించి తన మంత్రిగా చేసుకున్నాడు.

హస్తినాపురంలో శకునికీ, ధర్మరాజుకూ జూదం సాగింది. ధర్మరాజు తనతో తమ్ములనూ, ద్రౌపదినీ ఓడాడు.

అదేసమయంలో ద్వారక అంతఃపుర భవనంలో సత్యభామతో వినోదంగా పాచికలాడుతూ కృష్ణుడు తననూ, రుక్మిణి



మొదలైన ఏడుగురు మహిషులనూ ఓడిపోయాడు.

సత్యభామ, "అక్కా! ఇప్పుడు నువ్వూ, మన నాథుడూ నా సొత్తు! దాన విక్రయ సర్వాధికారాలూ నాకున్నాయి!" అని పరిహాసంగా అంటూ, రుక్మిణి పైట కొంగు తన చేతిలోకి తీసుకుంది.

అప్పుడు కృష్ణుడు ఎటో ఆలకిస్తున్న వాడల్లే, "అక్షయం!" అన్నాడు.

అలా ఎందుకన్నాడో తెలియక అంతా తెల్లమొహాలు వేసి నివ్వెరపోయారు.

అదే సమయంలో హస్తినాపురంలో నిండు సభలో దుశ్శాసనుడు ద్రౌపది కట్టుకున్న చీరపయ్యెద చెరగు లాగుతూంటే, అసహాయురాలైన ద్రౌపది చీర పట్టువదలి చేతులెత్తి, "కృష్ణా!" అని ఎలుగెత్తి మొరపెట్టింది.

దుశ్శాసనుడి రొమ్ము చీల్చి రక్తం త్రాగుతాననీ, దుర్యోధనుడి తొడలు విరగ్గొడతాననీ భీముడు ప్రతిజ్ఞలు చేశాడు.

దుశ్శాసనుడు లాగుతున్నకొద్దీ ద్రౌపది భుజం మీద నుంచి వస్త్రం అక్షయంగా వస్తూ పెద్ద మేటిపడి, దుశ్శాసనుడికి చేతులు పీకి, ముచ్చెమటలు కక్కుతూ పడిపోయాడు.

ద్రౌపది మయసభలో నవ్విందని ప్రతీకారంగా వస్త్రాపహరణం చేయాలనుకున్న దుర్యోధనుడు దించిన తల ఎత్తకుండా కర్ణ, శకుని, దుశ్శాసనులతో సభనుండి నిష్క్రమించాడు.

దుర్యోధనుడు, కర్ణుడు, శకుని, దుశ్శాసనుడు దుష్టచతుష్టయంగా పేరుపడ్డారు.

క్రోధము, లోభము, మదము, అసూయ మొదలైన గుణాలకూ, అధర్మానికీ మూలమైన కలిపురుషుడు దుర్యోధనుడుగా పుట్టాడు.

నరనారాయణులకు వెన్నిచ్చి, ఒకే ఒక్క కవచంతో పారిపోయి సూర్యుడిలో తలదాచుకొన్న సహస్ర కవచుడు కన్యగా ఉన్న కుంతికి సూర్యుడి వరప్రసాదంగా కర్ణుడుగా పుట్టాడు.

కుంతి పాండురాజు భార్య అయ్యాక, ఆమెకు నరనారాయణులలో నరుడు అర్జునుడుగా పుట్టాడు.

నారాయణుడు కృష్ణుడే. కృష్ణార్జునులు బావమరదులు.

కుంతి కర్ణుడిని నదిలో వదలగా, నదిలో కొట్టుకువస్తూ దొరికిన పిల్లవాణ్ణి సూతుడి భార్య రాధ పెంచుకుంది.

'రాధేయుడు', 'సూతపుత్రుడు'— అనిపించుకున్న కర్ణుడిని అంగదేశానికి రాజును చేసి దుర్యోధనుడు తనకు అండగా చేసుకుని నిబ్బరపడ్డాడు.

కర్ణుడంతటి మహారథుడైన ధనుర్వీరుడు తనకు అండగా ఉండగా అవలీలగా పాండవులను నిర్మూలించడం తథ్యం అని దుర్యోధనుడు నమ్మాడు.

కర్ణుడికి అనేక అనర్థాలు, శాపాలు వున్నాయి. సహజ కవచకుండలాలను ఒలిచి బ్రాహ్మణ భిక్షువుగా వచ్చిన ఇంద్రుడికి దానం యిచ్చేశాడు. అయినా స్వశక్తి మీద అతి విశ్వాసంతో దుర్యోధనుడి నమ్మకాన్ని పెంచుతూ ప్రోత్సహిస్తూనే వచ్చాడు.

'తన ప్రత్యర్థి అయిన అర్జునుడిని యుద్ధంలో చంపాలని కర్ణుడి ఆశయం. అందుకే దుర్యోధనుడితో చేరాడు. పాండవులు అరణ్యవాసం చేరారు.



సత్యభామ నారదుడికి తాను జూదంలో గెల్చుకున్న కృష్ణుడిని దానం చేసి పుణ్యకవ్రతం చేసింది. నారదుడు కృష్ణుడి ఎత్తు బంగారం, రత్నాలు యిస్తేనేగాని కృష్ణుడిని యివ్వనన్నాడు. సత్యభామ కృష్ణ తులాభారం జరిపించి తన వద్ద ఉన్న సువర్ణ, రత్న, ధనరాసులన్నీ వేసినా సరితూగలేదు. రుక్మిణి భక్తితో తులసిదళం వేసి కృష్ణుడిని నారదుడి నుండి విముక్తుణ్ణి చేసింది.

అప్పుడు సత్యభామ రుక్మిణితో, "అక్కా, యిప్పుడు నేను నీకు దాసిని. భక్తికిమాత్రమే కృష్ణుడు అధీనుడు అని నాకు జ్ఞానభిక్షపెట్టావు!" అన్నది.



పాండవులు ద్రౌపదితో మత్స్యదేశంలో విరాటరాజు దగ్గిర అజ్ఞాతవాసం చేశారు.

వలలుడు అనే పేరుతో వంటలవాడుగా ఉన్న భీముడు సైరంధ్రిగా ఉన్న ద్రౌపదిని అవమానించిన కీచకుణ్ణి ముద్ద చేసి చంపాడు. సమబలులైన ఐదుగురిలో ముగ్గురు భీముడి చేతిలో హతులయ్యారు. దుర్యోధనుడు మిగిలి ఉన్నాడు.

బృహన్నల పేరున పేడివాడిగా అర్జునుడు రాకుమారి ఉత్తరకు నాట్యం నేర్పాడు. ఉత్తరగోగ్రహణంలో నిజ రూపంతో అర్జునుడు యోధానుయోధులతో కూడిన కౌరవసైన్యాన్ని చిత్తుచిత్తుగా తరిమాడు.

సుభద్రార్జునుల కుమారుడైన అభిమన్యుడికీ ఉత్తరకూ వైభవంగా వివాహం జరిగింది.

పాండవులు అరణ్యవాసం చేస్తూన్నప్పుడు సుభద్రాభిమన్యులు ద్వారకలోనే ఉన్నారు. బలరాముడి కుమార్తె శశిరేఖను అభిమన్యుడికి కాకుండా దుర్యోధనుడి కొడుకు లక్ష్మణకుమారుడితో పెళ్ళి నిశ్చయించాడు.

అభిమన్యుడు తల్లితో ద్వారక విడిచి అరణ్యమార్గంలో వెళ్తూండగా, భీముడికీ, హిడింబకూ పుట్టిన ఘటోత్కచుడు తారసపడ్డాడు.

ఘటోత్కచుడు తన రాక్షసమాయలతో మాయాబజారును కల్పించి పెళ్ళికి వచ్చిన మగపెళ్ళివారిని ఆటలాడించాడు. శశిరేఖను ఎత్తుకొని వెళ్ళి అభిమన్యుడికి ఆటవిక వివాహం చేయించి, మాయా శశిరేఖగా ద్వారకలో పెళ్ళిపీటల మీద కూర్చొని మరింత నాటకం ఆడాడు. తర్వాత కృష్ణుడు అన్న బలరాముడిని సమాధానపరిచి శశిరేఖాభిమన్యుల వివాహం వైభవంగా జరిపించాడు.

మేనల్లుడిగా పుట్టిన కృష్ణుడి చేతిలో కంసుడి బొందెను వదలి, కాలనేమి, కృష్ణుడికి మేనల్లుడుగా అభిమన్యుడై పుట్టాడు.

కాలనేమి చిరవిరోధి అయినప్పటికీ, తనకు మేనల్లుడై పుట్టినందువల్ల, అభిమన్యుడు యువకవీరులకు ధ్రువతారగా చిరకీర్తిని పొందేలాగ చేయాలని కృష్ణుడి సంకల్పం.

సుభద్ర గర్భవతిగా ఉంటున్నప్పుడు, అర్జునుడు రణరంగంలో పద్మవ్యూహాన్ని ఎలా సాధించాలో ఆ వివరాలు చెప్తూండగా కృష్ణుడు, "అర్జునా, మా చెల్లి సుభద్ర మనస్సు అతి సుకుమారమైనది, ఆమెకు యుద్ధం సంగతులు చెబుతున్నావేమిటి?" అని అంటూ ఏదో పనిమిషతో తీసుకుపోయాడు.



గర్భవాసంలో శిశువుగా ఉన్న అభిమన్యుడు సగమే విన్నాడు; పద్మవ్యూహంలోకి వెళ్ళడమేగాని ఛేదించుకురావడం వినలేదు.

కుర్రతనపు వేడిరక్తపు పొంగుతో అభిమన్యుడు, "మామయ్యా కృష్ణుడు లేకపోయినా రాజ్యం మనదికాక తప్పదు; ఆ కౌరవహతకులను హతమార్చడానికి నేనొక్కడినే చాలు!" అని, సగం పరిజ్ఞానంతో బీరాలు పలుకుతూంటే, కృష్ణుడు మేనల్లుడి భుజం తట్టి, "అభిమన్యు కుమారా! అంతటివాడవేనోయి, అల్లుడా! నీవంటి వీరుడికీర్తి చిరస్థాయిగా నిలుస్తుంది! నిన్ను కన్న వీరమాత సుభద్ర నా చెల్లెలైనందుకు నేనెంతో గర్విస్తున్నాను!" అన్నాడు.

ఉత్తరాభిమన్యులు విరాటనగరంలో ఆనందడోలిక లూగుతున్నారు.

అజ్ఞాతవాసం జయప్రదంగా ముగించాక కౌరవులను అంతమొందించాలని పాండవులూ, పాండవులను నిర్మూలించాలని దుర్యోధనుడూ యుద్ధానికి తహతహలాడుతున్నారు.

అటు నుంచి దుర్యోధనుడు, ఇటు నుంచి అర్జునుడు కృష్ణుడి సహాయం అడగడానికి వచ్చారు.

నిద్రచాలించి లేచిన కృష్ణుడు, ఎదురుగా పాదాల చెంతనున్న అర్జునుణ్ణి



చూసి, తర్వాత తలవైపు ఆసనమలంకరించిన దుర్యోధనుణ్ణి చూశాడు.

ఆయుధాన్ని ధరించననీ, యుద్ధం చేయననీ, తానొక్కడే ఒక వంతు అనీ, యుద్ధవీరులైన యాదవ సేనాబలమంతా ఒకవంతు అనీ చెప్పి, తాను తొలుత చూసిన అర్జునుణ్ణి కోరుకోమన్నాడు కృష్ణుడు.

అర్జునుడు కృష్ణుణ్ణి కోరుకున్నాడు.

యాదవ సైన్యమంతా తనకు దక్కినందుకు దుర్యోధనుడు మహదానందంతో వెళ్ళాడు.

ధృతరాష్ట్రుడు పంపగా సంజయుడు పాండవుల దగ్గిరికి వచ్చి, యుద్ధం మంచిది కాదని శాంతివచనాలు పలికాడు.

పాండవులు కృష్ణుడిని రాయబారానికి పంపారు.

పాండవులకు అర్ధరాజ్యం యివ్వలేక పోతే, ఇంద్రప్రస్థము మొదలైన అయిదు ఊళ్ళు యిచ్చినా చాలునని పాండవుల దూతగా కృష్ణుడు చెప్పాడు. తాను శాంతిని కోరుతూ సంధి చేయవచ్చినవాడిననీ, యుద్ధం తగదనీ నయవాక్యాలతో చెప్పాడు.

సూదిమొన మోపిన పాటినైనా పాండవులకు యిచ్చేది లేదని దుర్యోధనుడు ఖండితంగా చెప్పాడు.

అప్పుడు కృష్ణుడు, "హనుమంతుడితో విజయపతాకం ఎగురుతూండగా నేను సారథ్యం చేస్తున్న రథం మీద అర్జునుడు గాండీవాన్నిపట్టి, నీ సేనల్ని చెండాడుతున్నప్పుడు పదివేలమంది కర్ణులున్నా ఒక్కడూ మిగలడు. నీ మొరాలకించేవాడుండడు, నా మాటలు నమ్ము!" అని కొలువుకూటం మార్మోగేలా చెప్పాడు.

"దూతగా వచ్చి ప్రగల్భాలతో బెదిరిస్తున్నావా? నిన్ను బంధిస్తాం!" అని దుర్యోధనుడు ఉక్కుత్రాటిని దుశ్శాసనుడిచేత తెప్పించాడు. కృష్ణుడి వెంట వచ్చిన సాత్యకి కత్తిదూశాడు.

కష్ణుడు సాత్యకిని వారించుతూ, "ఉట్టి చేతులతో సంధి కుదర్చాలని వచ్చిన

నన్ను బంధించడం న్యాయమేనా? నీ బలగం గొప్పది. ఏం చేస్తాను, నేరక వచ్చాను! బంధించండి!'' అన్నాడు.

దుష్టచతుష్టయం కృష్ణుణ్ణి చుట్టుముట్టి బంధించడానికి చూస్తూంటే, కృష్ణుడు మహోన్నత విశ్వరూపాన్ని ధరించగా, భయావహులై దుర్యోధనాదులు పారిపోయారు.

నయాన, భయాన చెప్పిన కృష్ణుడి రాయబారం విఫలమైంది. యుద్ధం అనివార్యమైంది.

కురుక్షేత్రంలో అనేక అక్షౌహిణుల సేనలతో చేరిన రాజులతో ఉభయపక్షాలు మహాభారత రణరంగానికి సిద్ధమైనాయి. రథాల గంటల హోరుతో, అశ్వఘోషతో దిక్కులు పిక్కటిల్లేలాగ రణదుందుభులు మ్రోగాయి.

ఒకప్పుడు పరశురాముడు క్షత్రియుల రక్తంతో శమంతపంచకమనే అయిదు మడుగులను నింపిన కురుక్షేత్రం మళ్ళీ బలి కోరింది.

సంజయుడికి దివ్యదృష్టి ఉంది. కురుక్షేత్రం ధృతరాష్ట్రుడి మనో నేత్రాలకు కట్టినట్లుగా చెప్పడానికి ఉపక్రమించాడు. పుట్టుగుడ్డివాడై, పుత్రప్రేమతో దుర్యోధనుడిని గట్టిగా మందలించలేని కౌరవచక్రవర్తి ధృతరాష్ట్రుడు వింటున్నాడు. భర్త గ్రుడ్డివాడైనందుకు కళ్ళకు గంతలు కట్టుకొన్న మహా పతివ్రత, గాంధారీదేవి పక్కనే కూర్చున్నది.

సంజయుడు చెప్తున్నాడు, వారు వింటున్నారు.

పాండవ, కౌరవ బలాబలాలు సంజయుడు చెప్పాడు.

ఉభయ బలాల తేడా ఏమిటని ధృతరాష్ట్రుడు అడిగాడు.

పాండవుల బలమూ, కౌరవుల బలమూ సమానంగా ఉన్నప్పటికీ, తమ పక్షాన కృష్ణుడు వుండడం వల్ల, పాండవుల బలమే మిన్నగా ఉన్నదని సంజయుడు, కురుక్షేత్రంలో జరుగుతున్న విశేషాలను సవిస్తరంగా వర్ణించి చెప్పసాగాడు.





# విష్ణుకథ

కృష్ణుడు రథాన్ని రణరంగం మధ్యలో నిలిపాడు.

అర్జునుడు యుద్ధసన్నద్ధులైన తాతలను, తండ్రులను, గురువులను, బంధుమిత్రులను చూసి చింతాక్రాంతుడై రథం దిగి, ధనుస్సును, తూణీరాలను నేలను పడవేసి చతికలబడుతూ, "రాజ్యమూ వద్దు, యుద్ధమూ వద్దు, ఎవ్వరినీ ఎదుర్కోలేను, ఎవ్వరి చావునూ చూడలేను!" అన్నాడు.

అప్పుడు కృష్ణుడు చిరుదరహాసం చేసి, అతని ముందుకు వచ్చి, "అర్జునా! యుద్ధరంగానికి వచ్చి, అవివేకంలోపడి ఇలా అస్త్రసన్యాసం చేయడం నీకు ఉచితమైనది కాదు.

కర్తవ్యాన్ని కాలం ఎప్పుడూ ప్రబోధిస్తూనే ఉంటుంది. కర్తవ్యనిర్వహణకు మించిన ధర్మం గాని, యోగం గాని లేదు.

నరుడు నిమిత్తమాత్రుడు, నడిపించేవాడు నారాయణుడు. నరుడూ, నారాయణుడూ ఒకటే!

అధర్మాన్ని ఎదుర్కొని న్యాయం కోసం పోరాటం సాగించి మంచికి విజయాన్ని సాధించి, చెడును నిర్మూలించడానికి నరుడు నారాయణుడి సాధనం.

ఈ విశ్వమంతా నిత్యసంఘర్షణతో పరిణామాన్ని పొందుతూ సాధురక్షణ, దుష్టశిక్షణ, ధర్మసంస్థాపన జరుగుతూంటుంది. అందుకోసమే భగవంతుడు యుగయుగమూ అవతరిస్తుంటాడు. ఆ

## 19. భగవద్గీత



భగవదవతారంగా నన్ను గుర్తుంచుకొని నేను చెప్పింది చెయ్యి! ఫలాన్ని నాకు వదులు! నీ విధిని నువ్వు చెయ్యి! లే! ఆయుధాలు తీసుకో! కర్మవీరుడవై స్వధర్మపాలన చెయ్యి!'' అని చెపుతూ, విశ్వవిరాట్ స్వరూపాన్ని చూపించాడు.

సృష్టి, స్థితి, లయాలు చక్రభ్రమణంగా చంపేది, చచ్చేది, కర్త కర్మ క్రియలు ఒకటిగా కనిపించాయి. కాలం విరాట్ స్వరూపుడైన భగవంతుడి ఉనికిగా అర్థమైంది.

అర్జునుడికి సందేహనివృత్తి అయి విచారం తొలగింది. కృష్ణుడు నన్ను నడిపిస్తున్నాడు అని తప్ప వేరు భావన లేకుండా గాండీవాన్ని ఎత్తి తూణీరాల్ని ధరించి బాణం తీశాడు.

మహాసంగ్రామం జరిగింది. పాండవులు గెలిచారు. నాడు రాయబారంలో కృష్ణుడు పలికినదంతా నిజమైంది. భీముడి ప్రతిజ్ఞలు తీరాయి. ద్రౌపది కొప్పుముడి వేసుకొంది.

అభిమన్యుడిగా కాలనేమి వీరస్వర్గం అలంకరించాడు.

కర్ణుడి సహస్రకవచుడి అంశ శివుణ్ణి చేరింది. నరనారాయణులు కృష్ణార్జునులైన పని నెరవేరింది.

కృష్ణుడిగా అవతరించి భూభారం తగ్గిస్తానని భూదేవికి విష్ణువు మాటిచ్చినట్టే జరిగింది.

అశ్వత్థామ అపాండవం చేయాలని విడిచిన అస్త్రప్రభావం వల్ల ఉత్తర ఊపిరి లేని పిల్లవాణ్ణి ప్రసవించింది. కృష్ణుడు తన పాదంతో శిశువును నొక్కి పరీక్షించి శ్వాస ఆడించాడు. పరీక్షితుడు అనే పేరున అతడు పాండవ వంశాంకురంగా దక్కాడు.

ధృతరాష్ట్రుడు భీముణ్ణి శ్లాఘిస్తూ కౌగలించుకుంటానన్నాడు. కృష్ణుడు భీముడికి బదులుగా ఉక్కు విగ్రహాన్ని పెట్టించాడు. ధృతరాష్ట్రుడి గాఢాలింగనంలో అది ముక్కముక్కలైపోయింది.



గాంధారి కృష్ణుడితో, "కౌరవుల్లాగే, నీ యాదవకులం అంతరిస్తుంది!" అని పుత్రశోకంతో శపిస్తున్నట్టుగా అన్నది.

కృష్ణుడు నవ్వి, "గాంధారీ మహా సాధ్వీ! అలాగే జరుగుతుంది. విధినిర్ణయం ముందుగా నీ నోట వచ్చింది, అంతే!" అన్నాడు.

పాండవులకూ, ద్రౌపదికీ పుట్టినకుమారులైన ఉపపాండవు లైదుగుర్నీ నిద్రిస్తున్న వారిని నరికి చంపిన అశ్వత్థామను కృష్ణార్జునులు రథానికి కట్టి తెచ్చి ద్రౌపది ముందు పెట్టారు.

"హేయమైన బతుకు బతుకుతూ ఉండు! నీ కదే శిక్ష!" అని ద్రౌపది అన్నది.

అశ్వత్థామ శిరోమణిని ఊడలాగించి వదిలిపెట్టించాడు కృష్ణుడు. శిరోమణి పోగానే అశ్వత్థామ మహారోగగ్రస్తుడై ఎవరికీ కనపడకుండా ఎటో పోయాడు.

అంపశయ్యపై ఉత్తరాయణానికి నిరీక్షిస్తున్న భీష్ముడు ధర్మరాజుకు రాజ ధర్మాలను, ధర్మసూక్ష్మాలను వివరించి, కృష్ణుడిని అనేక విధాలుగా స్తుతించి ఉత్తరాయణకాలం రాగానే ఇచ్ఛామరణంగా పరమపదించి వసువులను చేరుకున్నాడు. భీష్ముడు దివంగతుడైన ఏకాదశి భీష్మ ఏకాదశిగా పేరుపొందింది.

ధర్మరాజుకు పట్టాభిషేకం జరిగింది. కృష్ణుడు హస్తినాపురం నుంచి ద్వారకకు పయనమయ్యాడు.

ధర్మరాజు అశ్వమేధయాగ సన్నాహాలు ప్రారంభించాడు.

అక్కడ ద్వారకలో యాదవులు అదుపాజ్ఞలులేని పామరత్వంతో ఎవరికివారే నాయకులయ్యారు.

భారతయుద్ధం ప్రారంభం కాకముందే బలరాముడు తీర్థయాత్రలకని ద్వారకను విడిచి వెళ్ళాడు.

కృష్ణుడూ, యాదవ వీరప్రముఖులూ కురుక్షేత్ర యుద్ధరంగంలో ఉండగా, కృష్ణుడంతటి వాడు మావాడు అనే



అతిశయంతో ద్వారకలోని యాదవులు వెర్రితలలు వేశారు.

సాంబుడికి గర్భవతి వేషం వేయించి, "ఈ బొట్టెకు కొడుకు పుడతాడు!" అని ఒకడంటే, మరొకడు "ఆడపడుచు పుడుతుందిరా!" అని అంటూంటే, "కొడుకే పుడతాడు!" "కూతురే పుడుతుంది!" అని అంతా గోలచేస్తూ ఆ దారినే వస్తూన్న విశ్వామిత్రుడు, కణ్వుడు మొదలైన మహర్షులకు అడ్డునిలిచి, "స్వాములూ! ఈ అమ్మికి ఏం బిడ్డ పుడుతుందో సెలవీయండి!" అన్నారు.

మహర్షులకు కోపం వచ్చింది. "మందమతుల్లారా, వెర్రి యాదవుల్లారా! మీ యాదవుల్ని నిర్మూలించే ముసలం పుడుతుంది!" అని, వారిదారిని వారు వెళ్ళారు.

ఆ మాటలకు యాదవులు నిర్లక్ష్యంగా వికవికా పకపకా నవ్వుతూ మరింత హేళన చేశారు.

తర్వాత సాంబుడి వేషం విప్పేసరికి వజ్రతుల్యమైన చిన్న రోకలి వంటి ముసలం ఖంగున పడ్డది.

యాదవులు తెల్లముఖాలు వేశారు. దిగులుపట్టుకుంది.

కృష్ణుడు ద్వారకకు రాగానే జరిగిందంతా చెప్పి ముసలాన్ని చూపించారు.

కృష్ణుడు ఆ ముసలాన్ని చూర్ణంగా అరగదీసి రూపుమాపమన్నాడు.

యాదవులు సముద్రతీరాన ముసలాన్ని అరగదీసి, అరగదీసి చివరకు మిగిలిన చిన్న ముక్కను సముద్రంలోకి విసిరి వేశారు. దాన్ని ఒక చేప మింగింది. చేపను ఒక వేటగాడు పట్టాడు. చేపను కోయగా కనిపించిన మొనదేరిన ముసలం ముక్కను తీసి బాణానికి తగిలించాడు.

ముసలాన్ని అరగదీసిన చూర్ణం కొన్నాళ్ళకు ఇసుకదిబ్బలపై వాడికత్తుల వంటి రెల్లుగడ్డిగా మొలిచి పొదవుగా లేచింది.

ఒకనాడు ద్వారకలోని యాదవులందరూ సముద్రతీరం చేరి విలాస

వినోదాలతో తప్పతాగి ఒకరినొకరు ఎత్తి పొడుపులతో, దూషణలతో మూకఉమ్మడిగా కలహించారు. యాదవవీరులం, వీరత్వమే మా సొమ్ము—అంటూ కైపెక్కి వాగుతూ ఎందుకు నరకాలో తెలీకుండా ఆవేశప్రధానులై, రెల్లుపొదలు పెరికి ఎవరు ఎవరో గుర్తులేకుండా ఒకరినొకరు నరుక్కొని, ఒక్కరు మిగలకుండా అంతా చచ్చారు.

సముద్రతీర జలాలు యాదవుల రక్తంతో ఎర్రబారి పోయాయి.

కృష్ణావతార తత్వాన్ని గ్రహించి, పరమ పురుషుడైన నారాయణుడే కృష్ణుడని ఎరిగి, సంసారబంధంలో పడకుండా భాగవతోత్తముడై సౌమ్యజీవనం గడుపుతున్న కృష్ణుడి తమ్ములందరిలో పిన్నవాడైన ఉద్ధవుడు మాత్రం మిగిలాడు.

బలరాముడు జరిగిన దారుణానికి వగచి విరక్తుడై అరణ్యంపట్టి, యోగమార్గంగా శరీరాన్ని విడిచి శేషుడై వైకుంఠాన్ని చేరాడు.

ద్వారకానగరంలోని స్త్రీ బాల వృద్ధులందర్నీ తరలించుకు వెళ్ళమని కృష్ణుడు అర్జునుడికి కబురు పంపాడు. ఏడు రోజుల్లో సముద్రుడిచ్చిన చోటును తిరిగి అప్పగించవలసి ఉన్నది. సముద్రుడు ద్వారకను ఆక్రమించుకుంటాడు.



కృష్ణుడు ఉద్ధవుడికి అనేక పరమార్థాలూ, విశ్వప్రకృతితత్వాన్నీ, వేదాంత విషయాలనూ ఉపదేశించి తన విష్ణు స్వరూపాన్ని చూపి, తన అనంతరం ఉద్ధవుడు చేయవలసినది చెప్పాడు.

యాదవుల అంతంతో కృష్ణుడు అవతరించిన పని పూర్తి అయింది. భూభారం పూర్తిగా తగ్గింది.

కృష్ణుడు బయలుదేరి యమునా తీరంలోని వనం చేరి, దివ్యమైన మురళీగానం చేశాడు. మురళీస్వరాలు పలికే హిందోళ, యమునా కళ్యాణి, దేవగాంధార రాగాలతో ప్రకృతి పరవశించింది. యమున గంభీరంగా నిలిచింది.



తరువాత కృష్ణుడు ఒక చెట్టుచాటుగా అనుకొని కాలిపై కాలు ఉంచి పాదాన్ని ఆడిస్తూ విశ్రమించాడు.

ముసలపు మొన బాణానికి తగిలించిన వేటగాడు అవలి ఒడ్డునుంచి, చెట్టుచాటున ఆడుతూన్న కృష్ణుడి పాదాన్ని ఏదో లేడి అని తలచి విల్లెక్కుపెట్టి ముసలపు మొన బాణాన్ని గురిచూసి దాని మీదకు వేగంగా వదిలాడు.

కృష్ణుని పాదానికి ముసలపు మొన లోతుగా నాటుకొని రక్తం బొటబొటా కారింది.

దుర్వాసు డొకప్పుడు పాయసాన్ని తన వంటినిండా పూయమని కృష్ణుడిని ఆదేశించాడు. దుర్వాసుడి శరీరానికంతకూ పాయసాన్ని పూసి, కృష్ణుడు పాదానికి పూయడం మరిచాడు.

దుర్వాసుడు, ''కృష్ణా! పాదం నుండి మాత్రమే నీకు హాని జరుగుతుంది సుమా!'' అని చెప్పాడు.

వేటగాడు తాను కొట్టినదాన్ని ఎత్తుకుపోయేందుకువచ్చాడు. గాయంతో అయాసపడుతున్న కృష్ణుణ్ణి చూసి వలవలా ఏడుస్తూంటే కృష్ణుడు, ''నాయనా! నువ్వు చింతించకు! రామావతారంలో నువ్వు అంగదుడివి. నీ తండ్రి వాలిని నేను చెట్టుచాటు నుండి కొట్టిన దానికి పరిహారంగా ఇప్పుడు దెబ్బతిన్నాను. కర్మానుబంధం తప్పరానిది!'' అని చెప్పి రాముడుగా కనిపించాడు.

వేటగాడికి పూర్వస్మృతి కలిగి భక్తితో కన్నులుమూసి అలాగే మైమరిచి రాముణ్ణి తలుస్తూ శరీరాన్ని విడిచి విష్ణుసాయుజ్యాన్ని పొందాడు.

కృష్ణుని సారథి దారుకుడు వెతుక్కుంటూ వచ్చి ఆయాసపడుతున్న కృష్ణుణ్ణి చూసి బావురుమన్నాడు. కృష్ణుడు దారుకుణ్ణి ఓదార్చి, ''ద్వారకకు వెళ్ళి అందరికీ ద్వారకను విడిచిపెట్టమని చెప్పు. ఉద్ధవుడికీ, అక్రూరుడికీ నా అనుగ్రహాశీర్వాదాలు చెప్పు. అర్జునుడికీ చెప్పు.

అతడికి మనవాళ్ళందర్నీ తరిలించుకు వెళ్ళమని తెలియచెయ్యి. శీఘ్రంగా వెళ్ళు!'' అని ఆజ్ఞాపించాడు.

దారుకుడు వెళ్ళలేక వెళ్ళలేక, కన్నీరు కారుస్తూ నడిచాడు.

కృష్ణుడు మురళితీసి ఆనందంగా మధురాతిమధురంగా వాయించాడు. అది రాగం కాని రాగం, మధురాతి మధుర రాగం, మధురాతిమధురం. మురళీనాదం ప్రణవనాదం ధ్వనించింది.

కృష్ణుడు లీలామానుష విగ్రహాన్ని విడిచి విష్ణువుగా శేషతల్పాన్ని చేరుకున్నాడు.

యమునానదికి దుఃఖం పొంగిపొర్లుకు వచ్చింది. దాపునవున్న ఆ వనమంతా జలంతో నిండిపోయింది. నిర్యాణం పొందిన కృష్ణుడిని యమున తనలో దాచుకుంది.

కృష్ణుడు నిర్యాణం చెందిన మరుక్షణంలోనే కలియుగం ప్రవేశించింది, కలిప్రభావం ప్రారంభమైంది.

ఉద్ధవుడు కృష్ణతత్వాన్ని, భక్తిని ప్రబోధం చేశాడు. కృష్ణుడు ఉద్ధవుడికి ఉపదేశించిన విషయాలన్నీ భగవద్గీతలో చేరాయి.

కృష్ణుడు లీలామానుషమూర్తి. తనలోని విష్ణుదైవాంశను ఎరిగి, అవతరించిన ప్రయోజనం నెరవేరడానికి ఎటువంటి మార్గాలు అవసరమో తెలిసిన సర్వజ్ఞుడు, కార్యవాది. ఆదర్శాలకంటే దుష్టశిక్షణ, శిష్టరక్షణ జరిగే కార్యాచరణ, ముఖ్యంగా రాజ్యతంత్రం నెరపిన అవతారమూర్తి. లీలామాత్రంగా మనుష్యుడిగా కనిపించడమే తప్ప, మానవ సహజమైన కోరికలకు అనుబంధాలకు అంటకుండా రాగద్వేషాలకు అతీతుడై, తన్నుతాను ఎరిగినవాడు గనకనే, లీలామానుష విగ్రహుడనిపించుకున్నాడు.

కృష్ణావతార మహాఫలంగా భగవద్గీత చిరస్థాయిగా, గొప్ప ప్రమాణగ్రంథంగా నిలిచింది—అని సూతుడు కృష్ణావతార చరిత్ర ముగించాడు.





# విష్ణుకథ

"సూత మునీంద్రా! విష్ణువు తన మరొక రూపమైన కృష్ణుడుగా గోలోకంలో ఉంటాడని విన్నాము. ఆ కృష్ణుని గురించి వినగోరుతున్నాము!" అని మునులు కోరగా సూతుడు చెప్ప నారంభించాడు:

సత్యలోకానికి పైన గోలోకము ఉంది. అది అనేక నక్షత్ర సముదాయాలతో ఎల్లప్పుడూ వెన్నెలవంటి వెలుగుతో నిండి ఉంటుంది. విష్ణువు అతి గాఢమైన నీలపు రంగుతో నల్లనివాడుగా కృష్ణుడనే నామంతో, అక్కడ ప్రవహించే దివ్యనది విరజానది ఒడ్డున తులసివనంలో మురళిని పూరించి దివ్యగానం చేస్తూండగా మురళి నుండి వెలుపడే నాదము రాధగా రూపుదాల్చింది.

రాధ ప్రకృతి, కృష్ణుడు పురుషుడుగా విడని జంటగా గోలోకంలో విహరిస్తూ ఉంటారు. కృష్ణుడిని ఎల్లప్పుడూ సుదాముడు సేవిస్తూ ఉంటాడు.

రాధాదేవి శరీరం నుండి అనేకమంది గోపికలు పుట్టారు. విరజానది స్త్రీ రూపం ధరించి బృందాదేవిగా కృష్ణుణ్ణి ప్రేమతో ఆరాధిస్తూన్నది.

ఒకప్పుడు రాధాకృష్ణులు అనురాగ బద్ధులై ఏకాంతంలో ఉండగా అక్కడకు కృష్ణుడి కోసం విరజ వచ్చింది. రాధ కోపించి ఆమెను భూలోకంలో పుట్టమని శపించింది. అలాగ శపించడం అనుచితమైన పని అని సుదాముడు రాధతో అన్నాడు.

**20. విష్ణులీల – కలియుగదైవం**



''నువ్వు కూడా భూమ్మీద రాక్షసుడవై పుట్టు!'' అని రాధ అతణ్ణి శపించింది.

విరజ రాకుమార్తెగా తులసి, బృంద అనే పేర్లు గలదిగా పుట్టింది.

ఒకప్పుడు దేవేంద్రుడు కైలాసం వెళ్లి, ద్వారానికి అడ్డంగా రుద్రభటుని రూపంతో ఉన్న శివుణ్ణి తెలుసుకోలేక వజ్రాయుధాన్ని ఝుళిపించాడు. శివుడు నిజ రూపంతో మూడో కంటిని తెరిచాడు.

ఇంద్రుడు రక్షించమని సాగిలపడ్డాడు. శివుడు నేత్రం నుండి వెలువడిన రోషాగ్నిని సముద్రంలోకి పంపాడు. అదే సమయాన రాధాదేవి శాపంవల్ల సుదాముడు గోలోకం నుండి అగ్నిహోత్రంలో పడి సముద్రంలో తెల్లనిశంఖాన్ని శిరస్సున ధరించిన బాలుడై పుట్టాడు.

సుదాముడు కృష్ణుడు యిద్దరూ ఒకటే! కృష్ణుడు తన పార్శ్వచరుడైన సుదాముని పైగల అభిమానంతో, ఆ బాలకుడికి అజేయమైనకృష్ణకవచాన్ని ప్రసాదించాడు.

సముద్రం ఒడ్డున పుత్రుని కోసం తపస్సు చేస్తున్న దంభుడు అనే రాక్షసరాజు ఆ పిల్లవాణ్ణి జలప్రసాదితుడైన కుమారుడిగా తీసుకున్నాడు. అతడు జలంధరుడు, శంఖచూడుడు అని పిలువబడ్డాడు.

తులసి విష్ణువును తన భర్తగా తలంచుతూ, విష్ణువును ఆరాధిస్తూ తపస్సు చేస్తూండగా జలంధరుడు ఆమెను చూశాడు.

జలంధరుడు తులసి, తండ్రి ధర్మధ్వజుడిని, తులసిని తనకిచ్చి వివాహం చేయమని కోరాడు.

జలంధరుడితో తులసి వివాహం జరిగింది. తులసి తన భర్తనే తన దైవంగా ఎంచి పతివ్రతగా మెసులుతూ ఉన్నది.

జలంధరుడు రాక్షస బలాల్ని కూడగట్టుకొని ముల్లోకాలు జయించాడు.

తులసీ దేవి పాతివ్రత్య మహిమవల్ల అతనికి ఎక్కడా ఎటువంటిహానీ జరగలేదు.

తులసి సౌందర్యానికి జలంధరుడామెను వివాహమాడాడే కాని, అతని

రాక్షసతత్వానికి, ఆమె సాత్వికతత్వం పెళ్ళిలోనే నచ్చలేదు. పెళ్ళిపీటల మీది నుంచి లేచింది మొదలు అతడు ఆమెను చూడటమే మానేశాడు.

తులసి సదా భర్తనే తలంచుతూ, పీఠం పైనున్న అతని అడుగుజాడలనే ఆరాధిస్తూన్నది.

జలంధరుడు రాక్షస సామ్రాట్టయి కృష్ణకవచ ప్రభావంతో ముల్లోకాలను జయించాడు.

కలహభోజనుడైన నారదుడు పార్వతి అందం గురించి వర్ణించగా, జలంధరుడు కైలాసం మీదకు దాడిచేసి, మంచిగా పార్వతిని యిస్తే యిచ్చావు. లేదా యుద్ధానికి రా! అని శివుడిపై విజృంభించాడు. శివుడు విసిరిన త్రిశూలం జలంధరుడి రొమ్ముతాకి ఖంగుమంటూ కిందపడింది.

పార్వతి భయంతో పారిపోయి రాధాదేవిని ప్రార్థించింది.

రాధ పార్వతితో, "జలంధరుడు శివుని నేత్రాగ్ని నుంచే పుట్టాడు. శివుడి వల్లనే అతని సంహారం జరగాలి. అయితే అతనికిగల కృష్ణకవచం వల్ల ఏ ఆయుధమూ అతని కెటువంటి హానీ చేయలేదు. తులసీదేవి పాతివ్రత్య మహిమవల్ల అతనికి ప్రాణభయం లేదు! విష్ణు మాయకు అతీతమైనది ఏదీ లేదు. నీవు



విష్ణువును ప్రార్థించు, ఏం చేసినా అతడే చేస్తాడు!" అని చెప్పింది.

పార్వతి ప్రార్థన విని విష్ణువు వృద్ధ బ్రాహ్మణరూపంతో వెళ్ళి, హిమాచల శీతలానికి గజగజ వొణికిపోతూ జలంధరుణ్ణి అనేకవిధాలుగా పొగిడి, "వీరాధి వీరుడివైన నీకు వేరొక కవచమెందుకు? చలిజ్వరంతో చస్తున్న నా లాంటివాడికిస్తివా బతికిపోతాను!" అన్నాడు.

జలంధరుడు దర్పంతో, "ఔను! కృష్ణకవచం నాకేల? తీసుకో!" అని బ్రాహ్మడికి దానం యిచ్చేశాడు.

తరవాత విష్ణువు జలంధరుడి రూపంతో తులసీదేవి మందిరంలోకి



వెళ్ళాడు. అక్కడ కైలాసంలో శివుడికీ జలంధరుడికీ యుద్ధం జరుగుతున్నది.

ఒకానొకప్పుడు గండకి అనే దేవవేశ్య భూలోకానికి చేరి విష్ణువును గూర్చి గొప్ప తపస్సు చేసింది. విష్ణువు ప్రీతిజెంది ఏం కావాలో కోరుకోమన్నాడు. "దేవా! నిన్ను నాలో రత్ననిధుల్ని దాచుకొన్నట్లుగా గుప్తపరుచుకోవాలి" అన్నది గండకి.

విష్ణువు, "నువ్వు, గండకీనదిగా ప్రవహించు. నీ జలాల్లో, నేను సాలగ్రామాన్నయి ఉంటాను!" అని చెప్పాడు. గండకి నదిగా మారింది.

తులసీదేవి విష్ణు మాయాప్రభావానికి లోనై, తన పెనిమిటి యిన్నాళ్ళకు వచ్చినందుకు ఆనందంతో భ్రమలోపడి పతి రూపంలో ఉన్న విష్ణువు పాదాలకు ప్రణమిల్లింది. అదే సమయంలో శివుడు జలంధరుడి కంఠాన్ని త్రిశూలంతో ఛేదించాడు. ఆ శిరస్సు ఎగిరివచ్చి తులసీదేవి చేతులకు తగుల్తూ పడింది. విష్ణువు నిజ రూపం పొందాడు.

తులసి తృళ్ళిపడి భర్తశిరస్సును చూసి, భ్రమనుండి విముక్తురాలై, "ఓ, విష్ణూ! నన్ను మోసగించినందుకు నువ్వు రాయిగా మారు!" అన్నది.

విష్ణువు చిరునవ్వు చిందిస్తూ, "తులసీసతీ! సంతోషంతో నీ శాపాన్ని శిరసావహిస్తున్నాను. నీ భర్త జలంధరుడు ఎవరో కాదు, సుదాముడే! నేనే కృష్ణ, సుదాముల రూపాలతో గోలోకంలో ఉంటాను.

వివాహానికి పూర్వం నువ్వు నన్ను పతిగా కోరుతూ ఆరాధించినదానివే! వివాహం జరిగాక ధర్మాన్ననుసరించి సతీలోకానికి ఆదర్శప్రాయంగా పరమ సాధ్విగా, సతీతులసిగా వర్తించావు. నీవు పవిత్రతకు చిహ్నంగా తులసిచెట్టుగా భూమ్మీద మొలుస్తావు. తులసి నాకు అత్యంత ప్రీతిపాత్రంగా ఉంటుంది. తులసి సన్నిధిలో నేనెప్పుడూ శిలా రూపంతో ఉంటాను!" అని చెప్పాడు.

విష్ణువు గండకీ నదిలో సాలగ్రామ శిలల రూపంతో అవతరించాడు. తులసి సహగమనం చేశాక తులసి చెట్టుగా మొలిచింది.

గండకీనదిలో అపురూపంగా దొరికే సాలగ్రామ శిలలను తులసిచెట్టు మొదట ఉంచి అర్చించడం ఏర్పడింది. తులసి దళాలు సాలగ్రామ శిలపై రాలుతూ ఉంటే విష్ణువు పవిత్రమైన తులసి మాలలు ధరిస్తూంటాడు.



ఒకప్పుడు మహర్షులు త్రిమూర్తులలో ఎవరు గొప్ప? అనేది తేల్చుకురమ్మని భృగుమహర్షిని పంపారు.

భృగువు సత్యలోకం వెళ్ళాడు. అక్కడ సరస్వతీదేవి వీణావాద మాధురిలో మునిగితేల్తూన్న బ్రహ్మ అతణ్ణి కనీసం చూడనైనా లేదు.

కైలాసం వెళ్తే పార్వతితో నృత్యం చేస్తున్న పరమశివుడు భృగుమహర్షిని చీదరించుకున్నాడు.

భృగుమహర్షికి రెండు పరాభవాలతో ఒళ్ళు మండిపోయింది. అతని పాదానికి కన్ను ఉన్నది. అంచేత అతనికి అహంకారం మెండు.

భృగువు కోపంతో వైకుంఠానికి చేరాడు. లక్ష్మీసమేతంగా శేషతల్పశాయి అయిన విష్ణువును చూసి, రివ్వునవెళ్ళి భృగుమహర్షి విష్ణు వక్షస్థలాన్ని పాదంతో తన్నాడు. విష్ణుమూర్తి దిగ్గునలేచి మహర్షికి ప్రణమిల్లి, అతని పాదాన్ని తలపై పెట్టుకొంటూ, "మహర్షిసత్తమా, నీ మృదు పాదారవిందము నా కఠిన వక్షాన్ని తాకినందున ఎంత కమిలిపోయిందో గదా!" అంటూ పాదాన్ని ఒత్తుతున్నట్టే ఒత్తుతూ, పాదం అడుగున ఉన్న కంటిని నొక్కి చిదిమివేశాడు. పాదనేత్రం చిదగడంతో భృగుమహర్షి అహంకారం కూడా చిదిగి పటాపంచలైంది.

భృగువు విష్ణువును స్తుతించి, వెళ్ళి విష్ణువు గొప్పతనాన్ని మునులకు వివరించి చెప్పాడు.



కుమారుడి పెళ్ళి చేయాలని ఉండే కోరిక ఎంత గొప్పదో నీకు తెలియంది కాదు, నాకది తీరిందికాదు!'' అనీ వాపోయింది. అప్పుడు కృష్ణుడు, ''అమ్మా! వచ్చే జన్మలో నీ ముచ్చట తీర్చుకుందువు గాని!'' అని చెప్పాడు.

వకుళాదేవి శ్రీనివాసుణ్ణి తన కుమారుడిగా యెంచి పరమానందం పొందింది. వకుళ కుమారిడిగా శ్రీనివాసుడు ఆశ్రమంలో ఆనందంగా పెరుగుతూ వనవిహారం చేస్తూ ం డ గా, ఆ కా శ రా జు కుమార్తె పద్మావతి చెలికత్తెలతో వనవిహారానికి అదే వనానికి వచ్చింది

అంతలో ఒక మదించిన ఏనుగు ఘీంకారాలు చేస్తూ వనం దద్దరిల్లేలాగా పరుగున వచ్చింది. చెలికత్తెలు చెల్లా చెదరైపోయారు. తత్తరపాటుతో పద్మావతి శ్రీనివాసుడు వస్తున్న దగ్గరలో పడిపోయింది.

శ్రీనివాసుడు ఏనుగుకు అడ్డు నిలిచాడు. మదకరీంద్రం తక్కున ఆగిపోయి తొండమెత్తి మొక్కింది. పద్మావతి చేతిని శ్రీనివాసుడు తన చేత్తోపట్టి లేవనెత్తాడు.

పద్మావతి, శ్రీనివాసులకు ఒకరిపైన ఒకరికి అనురాగం ఏర్పడింది. పద్మావతి పూర్వజన్మలో విష్ణువును పతిగా పొందాలని తపస్సు చేస్తూ, రావణుడామెను

విష్ణువు వక్షస్థలం మీద తాను అనుకొని ఉండగా భృగుమహర్షి తన్నడం లక్ష్మీదేవికి గొప్ప పరాభవంగా తోచింది. ఒక మునిమృచ్చు పాదస్పర్శతో అపవిత్రం అయినట్లుగా ఎంచి వైకుంఠంలో ఉండకుండా భూలోకానికి చేరి తపస్వినిగా తపోదీక్షలో మునిగింది.

విష్ణువు లక్ష్మికోసం మానవయువకుని రూపంతో భూమిని చేరి అరణ్యాలు వెతుకుతూ శ్రీనివాసుడు అనే పేరుతో వకుళాదేవి ఆశ్రమాన్ని చేరాడు. వకుళామాత కృష్ణావతారంలో యశోద.

చిరకాలానికి వ్రేపల్లెకు కృష్ణుడు వచ్చినప్పుడు యశోద కృష్ణుడితో, ''తల్లికి

తాకిన కారణంగా యోగాగ్నిలో కాలి పోయిన వేదవతి.

వకుళ అరుంధతి, సప్తర్షులు వెంట రాగా తన కుమారుడికి పిల్లను అడగ డానికి ఆకాశరాజు సదనానికి వెళ్ళింది.

శ్రీనివాసుడు ఎరుకత రూపంతో వెళ్ళి కోరినవాడే పెళ్ళాడతాడని పద్మావతికి సోది చెప్పాడు.

పద్మావతీ శ్రీనివాసుల కళ్యాణం వైభవంగా కుబేరుడు పంపిన ధన కనక రత్నరాసులతో దివ్యంగా జరిగింది. శ్రీనివాసుడు పద్మావతితో బయలుదేరాడు.

నారదుడు తపస్సులో ఉన్న లక్ష్మికి శుభవార్త విన్నవించాడు. లక్ష్మి ఆవేశంతో బయలుదేరింది.

అల్లంతదూరంలో వస్తున్న లక్ష్మిని చూసి శ్రీనివాసుడు పద్మావతిని అక్కడ ఉంచి, చరచరా ఏడు శిఖరాలు గల శేషాద్రిన్ని అధిగమించి చివరి తిరు శిఖరాగ్రంపై నిలబడి లక్ష్మి రాకకు ఎదురు చూస్తున్నాడు.

లక్ష్మి రాగానే శ్రీనివాసుడు ఆమె వేడి చూపులకు బదులుగా మందహాసం చిందిస్తూ, నల్లని రాయిగా మారి పోయాడు. ఆ విగ్రహం నిండుగా తులసి మాలలు దివ్యంగా శోభించాయి.

ఆ విగ్రహంలో విష్ణు, శివ, శక్తి అంశలు మూర్తీభవించాయి, ఇంకా ఎన్నో దివ్యరూపాలు గోచరించాయి.

ఎవరు ఏ విధంగా తలంచినా అలాగే కనిపిస్తూ శ్రీనివాసుడు, వేంకటరమణుడు, వేంకటేశ్వరుడుగా పిలువబడుతూ సప్తగిరి వేల్పుగా విష్ణువు అక్కడ వెలిశాడు.

పద్మావతి శేషాద్రి చేరువనే అలమేలు మంగమ్మగా వెలిసింది. లక్ష్మి తపమాచరించినచోట మహాలక్ష్మిగా నిలిచింది. ఆ చోటనే కోలాహపురం నిర్మితమై లక్ష్మి నిలయమైంది.

విష్ణువు శేషాద్రి శిఖరాన 'కలియుగ దైవం'గా వైభవోపేతుడై విలసిల్లాడు. విష్ణు లీలను విన్న మునులు పరమానందం పొందారు.





# విష్ణుకథ

సూతమహర్షి దశావతారాల్లో తొమ్మిదవది అయిన బుద్ధావతారం గురించి చెప్పడానికి ఉపక్రమించాడు:

కలియుగం బాగా పెరిగింది.

మానవత్వం నుంచి క్రూరమృగత్వంలోకి మానవులందరూ దిగజారిపోతూన్న దశ వచ్చింది. మనిషి బుద్ధిని సక్రమమార్గాన పెట్టుకొని తన్నుతాను ఉద్ధరించుకోవలసిన అవసరం ఏర్పడింది.

అంతకుముందు యుగాల్లో ఎవడో దుష్ట దానవుణ్ణి సంహరించడానికి విష్ణువు అవతారం ఎత్తి ఆ పని నిర్వహించే తరుణం దాటిపోయింది.

మనుషులందరూ రాక్షసులుగా ఒకరినొకరు దోచుకొంటూ, హింసించుకొంటూ, యజ్ఞయాగాదుల పేరుచెప్పి దయకుచోటు లేకుండా జీవహింసనే పరమావధిగా, మద్యమాంసభుక్కులై, భోగపరాయణులై— మానవుడు బుద్ధిజీవి అనే సత్యాన్ని తెలుసుకోలేని పామరత విశృంఖలంగా చెలరేగిపోయింది. తత్ఫలితంగా మానవుల బాధలూ, యాతనలూ పెరిగాయి.

మనిషిగాపుట్టి పరిపూర్ణ మానవుడిగా, ఎటువంటి దైవికస్పర్శ అంటని బుద్ధమూర్తిగా, తోటి మానవులందర్నీ ఉద్ధరించగల కాలానుగుణ్యమైన ధర్మసంస్థాపన చేయవలసిన అవసరం విష్ణువుకు వచ్చింది.

నేపాళదేశంలోని కపిలవస్తు నగరాన్ని, శాక్యవంశానికి చెందిన శుద్ధోదన మహా

21. బుద్ధావతారం



రాజు పాలిస్తున్నాడు. అతని రాణి మాయాదేవి పూర్ణిమ చంద్రబింబం లాగ ప్రకాశిస్తున్న తెల్లని ఏనుగు, ఆకాశం నుండి దిగి, ఆమెలో ప్రవేశించినట్లు అద్భుతమైన కల గన్నది. ఒక మహాపురుషుడు మహారాణికి ఉదయించబోతున్నాడని పండితులు మహారాజుకు, ఆ కల ఫలితాన్ని చెప్పారు.

కొన్నాళ్ళకు మాయాదేవి పల్లకీలో పుట్టినింటికి వెళ్తూ, దారిలో ఒక వనంలో పిల్లవాణ్ణి ప్రసవించింది. ఆ రోజు వైశాఖ పూర్ణిమ.

కుమారుడు కలిగిన ఆనందం ఎన్నాళ్ళో మిగలకుండా, మాయాదేవి కొద్ది దినాలకే చనిపోయి, శుద్ధోదనుడిని దుఃఖసాగరంలో ముంచింది.

మాతృవిహీనుడైన కుమారుణ్ణి మహారాజు కంటిని రెప్ప లాగ కాపాడుకొంటూ, నామకరణ మహోత్సవం చేయించాడు. గౌతమసిద్ధార్థుడు అని పిల్లవానికి నామకరణం జరిగింది. సిద్ధార్థుడు శుద్ధోదనుడి కన్నులపండుగగా చంద్రుడి లాగ పెరుగుతున్నాడు.

తరువాత దైవజ్ఞులు సిద్ధార్థరాకుమారుడి జాతకాన్ని పరిశీలించారు. "మహారాజా! రాకుమారుడు చక్రవర్తి అవుతాడు. ఈ విశాల ప్రపంచంలోని రాజాధిరాజులు, ప్రజలు అతనికి తలలు వంచి అంజలులు ఘటిస్తారు...." అని చెపుతూవుంటే శుద్ధోదనుడి ఆనందానికి మేరలేకపోయింది.

".....కాని.....మహారాజా! రాకుమారుడికి సన్యాసయోగం ఉన్నది!" అన్నారు జ్యోతిషవేత్తలు.

శుద్ధోదనుడికి గుండెలో రాయిపడ్డది. అంతా అయోమయంగా తోచింది. "చక్రవర్తి అవుతాడంటూనే, సన్యాసయోగం తప్పదని అంటున్నారేమిటి?" అని రెట్టించి అడిగాడు.

పండితులు రాకుమారుడి జాతకచక్రంలోని గ్రహగతులను సూక్ష్మపరిశీలన చేసి రాజుతో, "రాజా! రాకుమారుడు అతి సుకు

మారమైన మనస్సు గలవాడై వుంటాడు. ముఖ్యంగా అతడు నాలుగు దృశ్యాలను చూడకూడదు. అవి రోగము, వృద్ధాప్యము, మృత్యువు, సన్యాసము! వీటిని చూసిన మరు క్షణమే రాకుమారుడి మనస్సు విరిగిపోతుంది కనుక, తగిన జాగ్రత్తలు తీసుకోవలసి ఉన్నది!'' అని చెప్పారు.

సిద్ధార్థుడికి పసితనం నుంచీ ఎటువంటి చింత కలగకుండా ఎల్లప్పుడూ అహ్లాద కరంగా ఉండేలాగ, ఆటపాటలను, వినోదాలను ఏర్పాటు చేసి ఎంతో శ్రద్ధగా తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ తీసుకున్నాడు శుద్ధోదనుడు.

సిద్ధార్థుడు ఒకనాడు ఉద్యానవనంలో వేదికపై సుఖాసీనుడై ఉండగా, ఒక హంస గిలగిల తన్నుకుంటూ అతని ఒడిలో పడింది. రాకుమారుడు దానికి గుచ్చుకొన్న బాణాన్ని జాగ్రత్తగా తొలగించి, ఆకుపసరు పూసి దాని ప్రాణాన్ని కాపాడాడు.

''ఆ హంస నాది, దాన్ని నేను కొట్టాను!'' అని బిగ్గరగా అంటూ దేవదత్తుడు వచ్చాడు. దేవదత్తుడు సిద్ధార్థుడికి జ్ఞాతిసోదరుడు.

''ఈ హంస ప్రాణాన్ని నేను కాపాడాను. ఇది నాదే,'' అన్నాడు సిద్ధార్థుడు.



ఇద్దరూ రాజసభకు వెళ్ళారు. ధర్మశాస్త్రవేత్తలు, ''ప్రాణరక్షకుడైన రాకుమారుడిదే హంస!'' అని ఏకగ్రీవంగా తీర్పుయిచ్చారు.

ఆ కారణంగా బాల్యంనుంచే దేవదత్తుడికి సిద్ధార్థ రాకుమారుడి మీద అసూయ, స్పర్థ ఏర్పడింది.

శాక్యులు సుక్షత్రియ అయుధోపజీవులు. వేట వారికి అత్యంతప్రీతి. కాని రాకుమారుడికి వేట అంటే అయిష్టం. విలువిద్య, లక్ష్యసిద్ధి బాగా నేర్చి, అసమానుడనిపించుకొన్నప్పటికీ జంతువులను చంపడమన్నా, హింసించడమన్నా అతనికి తగని పనిగా ఉండేది.



వేటకు వెళ్ళడు. వినోదాల మీద ఆసక్తి చూపడు. హింసను చూసి తల్లడిల్లి పోతాడు. కుమారుడిలో రక్తానికి బదులు కరుణ ప్రవహిస్తున్నదా అని శుద్ధోదనుడు అనుకుంటూ, సాటి రాకుమారుల్లాగ, యువరాజుల్లాగ సిద్ధార్థుడు తయారవడానికి ఎన్ని ప్రయత్నాలు చేయాలో అన్నీ చేస్తున్నాడు.

రాకుమారుడు నగరంలోకి బయలుదేరినప్పుడెక్కడా దరిదాపుల్లో రోగపీడితులు, ముదివగ్గులు, మృతజీవులు, పరివ్రాజక, సన్యాస, బిక్షువులు కనపడకుండా ముందు జాగ్రత్తలు తీసుకున్న అనంతరమే, రథసారధి చెన్నుడు రాకుమారుణ్ణి రథం ఎక్కించుకొని నగరంలోకి తీసుకెళ్ళేవాడు.

సిద్ధార్థుడు తరుణ వయస్కుడయ్యాడు. సత్యప్రియత్వము, తార్కికదృష్టి, హేతుబద్ధమైన జ్ఞానము అతనిలో పెరిగాయి. అప్పుడే భూమికి దిగివచ్చిన ఏ దేవ సుందరుడో అన్నట్లుగా వుండేవాడు. కాని వినోద విలాసాల రాజభోగాలపై, అతని మనసు పోయేదికాదు.

శుద్ధోదన మహారాజు కుమారుడి ధోరణికి మరింత వ్యాకులపడ్డాడు. వివాహితుడు కావలసిన తరుణమూ వచ్చింది. వివాహమైతే మారతాడని, రాజ్యంలోని క్షత్రియ వంశాలకు చెందిన అందమైన కన్యలందర్నీ, రాజమందిరానికి ఆహ్వానించి రప్పించాడు.

రాకుమారుడి చూపు వారిపై పడడానికి ఏర్పాటు చేయబడిన అంతఃపుర మందిరంలో కొందరు తమ నృత్యగానాలను ప్రదర్శించారు. యువరాజు మనసు దోచుకోడానికి ఒకరిని మించి ఒకరు వయ్యారాలు ఒలికిస్తూ కన్యామణులు రాకుమారుడి దృష్టి ఎవరి మీద నిలుస్తుందో ఆ భాగ్యానికి తహతహలాడుతున్నారు.

వచ్చిన కన్యలను కానుకలతో సత్కరించడానికి, పళ్ళెరాల నిండా మణిహారాలు, మంచి ముత్యాల కోవలు, స్వర్ణ

భూషణాలు నిండుగా అమర్చి వున్నాయి. సుందరీమణులు ఒక్కొక్కరే ఓర చూపులు చూస్తూ వచ్చి సిద్ధార్థుడు అందించే బహూకృతులను అందుకొని వెళ్తున్నారు.

వచ్చిన వారంతా కానుకలు అందుకొని వెళ్ళిపోతున్నారు. సిద్ధార్థుడు ఆసనం నుండి లేచి వెళ్తూండగా ముగ్ధ మనోహర మూర్తి అయిన ఒక జవ్వని స్తంభం చాటున అతనికి కనిపించింది. స్తంభాన్ని అనుకొని తలవంచుకుని నిల్చున్న ఆమెలో సౌందర్యాన్ని మించిన సౌందర్యమేదో సిద్ధార్థుడికి కనిపించింది. ఆమె ప్రశాంత వదనంలో నిండైన సౌజన్యం వెల్లివిరుస్తున్నది. ఆమె యశోధర. ఒక సామంతుని కుమార్తె.

ఆమెకు యివ్వడానికి, ఏ ఒక్క కానుక కూడా మిగలలేదు. సిద్ధార్థుడు తన మెడనున్న పచ్చల హారాన్ని తీసి ఆమె నెన్నడుము చుట్టూరా చుట్టాడు. అతని కంఠానికి అంటిపెట్టుకున్న హారం ఆమె నడుముకు ఒదులుగా సరిపోయింది.

సిద్ధార్థుడికి యశోధరపై అనురాగం అంకురించింది, మనస్సు లగ్నమైంది. ఆ విషయం మహారాజుకి తెలిసింది.

సిద్ధార్థరాగోదయానికి శుద్ధోదన మహారాజు ఆనందభరితుడై సామంతునికి



వియ్యమందబోతున్నట్లు వర్తమానం పంపాడు.

దేవదత్తుడు స్వయంవరం చాటించి పోటీ పరీక్షలు పెట్టాలని పట్టుపట్టాడు. యశోధర తండ్రి, కుమార్తె స్వయంవర పోటీకి అందరికీ అహ్వానాలు పంపాడు.

హింసకు తావివ్వని అనేక పోటీ ప్రదర్శనలు ఏర్పాటు కాబడ్డాయి. అనేక మంది యువకులు వచ్చారు. ఆ పరీక్షలన్నిటిలో రాకుమారుడు సిద్ధార్థుడే మిన్నగా నిలిచాడు. సిద్ధార్థుడితో సరిసమానంగా నెగ్గుతూ వచ్చిన దేవదత్తుడు ప్రతిద్వందిగా నిలబడ్డాడు. చివరకు దేవదత్తుడు కూడా ఓడిపోయాడు. సిద్ధార్థుడు




అందుకు అనుకూలంగా మనసులో మనసై మెసులుకొంటున్నది. వారి దాంపత్యం హాయిగా ఆనందప్రదంగా సాగుతున్నది.

సిద్ధార్థుడు వివాహమైన తరువాత అంతఃపురం విడిచి ఎక్కడకూ వెళ్ళడమే మానుకున్నాడు.

కొన్నాళ్ళకు ఆ దంపతులకు రాహులుడు అనే కుమారుడు కలిగాడు. జననీ జనకులకూ, తాత శుద్ధోదన మహారాజుకూ కన్నులపండుగగా అల్లారుముద్దు ముద్దుగా పాలతో పెరుగుతున్నాడు.

విలువిద్యలో, అశ్వారోహణలో, విద్యలన్నిటిలో అపూర్వ సామర్థ్యాన్ని చూపి యశోధర పాణికమలాన్ని గెల్చుకున్నాడు.

సిద్ధార్థ యశోధరల వివాహం వైభవోపేతంగా జరిగింది.

శుద్ధోదనుడికి కొంత మనశ్శాంతి లభించింది. కుమారుడు ఇంటివాడయ్యాడు. "సంసారచక్రంలో స్థిరపడి తప్పక చక్రవర్తి ఔతాడు!" అని అనుకుంటూ మైమరిచాడు.

యశోధర సిద్ధార్థుడికి అన్నివిధాలా తగిన భాగస్వామిని.

భర్తలో అసాధారణమైన మానవత్వపు విలువలు ఉన్నాయని ఆమె గ్రహించి,

సిద్ధార్థుడు ఒకనాటి సాయంకాలం రథారూఢుడై చెన్నుణ్ణి నగరంలోకి తోలమన్నాడు. అనుకోని నగరవిహారానికి చెన్నుడు వెనుకాడుతూనే రాకుమారుడి దృఢసంకల్పం తెలిసినవాడవడం వల్ల, కాదనక రథాన్ని తీసుకెళుతున్నాడు.

జరాభారంతో కృంగిపోతూన్న ఒక ముదివగ్గు పడుతూ లేస్తూ ఎదురుగా వస్తున్నాడు. అతని స్థితి దయనీయంగా ఉంది. ఎవ్వరూ ఆ వృద్ధుడిపట్ల చూపవలసిన జాలి చూపి లేవనెత్తటం లేదు. ఎవరి మానాన వారివారి పనుల మీద పోతున్నారు.

కొంత దూరం వెళ్ళగా ఒక రోగపీడితుడు ఎదురయ్యాడు. అతడు దరిద్రుడని తెలుస్తున్నది. పైగా వ్యసపరుడని

అతడు మాటిమాటికీ చేసే సురాపానం చెబుతున్నది.

ఆ తర్వాత ఒక శవాన్నిశ్మశానానికి వాహకులు తీసుకెళ్తూండడం కనిపించింది.

చివరగా, సర్వసంగ పరిత్యాగం చేసి భిక్షాటనం చేస్తున్న ఒక బిక్షువు ఎదురయ్యాడు.

అంతవరకు కప్పి ఉన్న నివురు తొలగిన నిప్పులాగ సిద్ధార్థుడి బుద్ధి ప్రకాశించింది.

అప్పుడే గౌతముడు బుద్ధుడు అవడానికి అంకురార్పణ జరిగింది.

రాకుమారుడు ఆ నాలుగు దృశ్యాల గురించీ పట్టిపట్టి చెన్నుడిని అడిగాడు. చెన్నుడికి నిజం చెప్పక తప్పిందికాదు.

సిద్ధార్థుడు రథాన్ని వెనక్కు మరల్చమన్నాడు. చెన్నుడు రథాన్ని రాజమందిరానికి చేర్చాడు.

ఆ రాత్రి సిద్ధార్థుడికి నిద్రపట్టలేదు. బయట సన్నని వెన్నెల కాస్తున్నది.

యశోధర నిద్రపోతున్నది. రాహులుడు తల్లి గుండెకు హత్తుకొని నిద్రిస్తున్నాడు. తల్లీ కొడుకుల ముఖాల్లో అమాయకత్వం ప్రకాశిస్తున్నది.

సిద్ధార్థుడు వారిని విడిచి కొన్ని అడుగులు నడిచి తిరిగి వచ్చాడు. అలాగ రెండుసార్లు జరిగింది.

మూడోసారి సిద్ధార్థుడు మనసు దిటవు చేసుకొని యశోధర పాదాల మీద ఒక కలువను ఉంచి, పాదాలను స్పృశించి, నమస్కరించి వెనుదిరిగి బయలుదేరాడు.

అంతఃపురం నుండి అశ్వశాలకు వెళ్ళాడు; చెన్నుడిని మేల్కొలిపి అశ్వాన్ని సిద్ధం చెయ్యమన్నాడు.

రాకుమారుడికిఅర్ధరాత్రిచిరువెన్నెలలో గుర్రమెక్కి తిరగాలనిపించింది కాబోలు అనుకున్నాడు, చెన్నుడు. అప్పుడే చిన్న జల్లుపడి నేలంతా తడిసి మెత్తగా ఉంది.

సిద్ధార్థుడు గుర్రాన్నెక్కి కూర్చున్నాడు. చెన్నుడు కళ్ళాన్ని పట్టుకొని నడిపిస్తున్నాడు. అంతా నిశ్శబ్దంగా ఉంది. గుర్రపు డెక్కసవ్వడి నేల మెత్తగా ఉండడం వల్ల వినిపించ లేదు.





# విఘ్న కథ

కపిలవస్తు నగరాన్ని దాటి చాలాదూరం వెళ్ళాక సిద్ధార్థుడు గుర్రం దిగి కత్తినీ, ఉత్తరీయాన్నీ, ఆభరణాలనూ తీసి చెన్నుడికి యిచ్చి, "తండ్రిగారికి నా ప్రణామాలు చెప్పు! సిద్ధార్థుడు విశాల ప్రపంచంలో అడుగుపెట్టాడనీ, జీవజనుల బాధలను తొలగించే ధర్మచక్ర సంచాలక 'చక్రవర్తి'గా కపిలవస్తు నగరానికి వస్తాడనీ, కుమారుడి సిద్ధార్థ నామధేయం సార్థకంగా ఆశయసిద్ధి త్వరగా కలగాలని ఆశీర్వదించ గోరుతున్నాడనీ చెప్పు!" అన్నాడు.

చెన్నుడు నోటమాట రాక కన్నీరు కారుస్తూంటే సిద్ధార్థుడు, "చెన్నా! తల్లి లేని నన్ను పసితనం నుంచీ ఎత్తుకొని తిప్పి ఆడిస్తూ, నే నేది చెప్పినా కాదనకుండా అన్నీ చేస్తూ, తల్లి తర్వాత తల్లిలాగ వాత్సల్యంతో చూశావు. నీ ఋణం ఎన్నటికీ తీరనిది! మనిషినై పుట్టినందుకు సార్థకత కోసం ఆరాటపడుతున్న నన్ను, యీ రాత్రివేళలో నగరం దాటించిన, నీ ఉపకారాన్ని మరువలేను! నా ఆశయమే ఫలించితే విశ్వశాంతికి దోహదం చేసిన మొదటివాడివి నువ్వే అవుతావు! వెళ్ళు!" అని భుజం తట్టి పంపాడు.

చెన్నుడు కదల్లేక, కదల్లేక అశ్వంతో నగరాభిముఖంగా అడుగులు వేశాడు.

సిద్ధార్థుడు ముందుకు పయనం సాగించాడు. వేగుచుక్క పొడిచింది. సూర్యోదయం అవుతున్నది.



చెన్నుడు గద్గదస్వరంతో బెక్కుతూ చెప్పినది విని శుద్ధోదన మహారాజు హతాశుడై కుప్పగా కూలి మూర్ఛిల్లాడు.

యశోధర పసిబిడ్డ రాహులుడిని అక్కున అదుముకొంటూ, "కన్నా, నువ్వయినా నాన్నగారిని అపలేకపోయావు గదా!" అంటూ కన్నీరు మున్నీరుగా ఏడ్చి ఏడ్చి, గుండె దిటవు తెచ్చుకొని పతిదేవుని ముఖంలోని మహాపురుష లక్షణాల్ని గుర్తు చేసుకొంటూ, గంభీర హృదయంతో లేచి వెళ్ళి మామగారికి పరిచర్యలు చేసి, మూర్ఛ నుండి సేదదేర్చింది.

"మహారాజా! మీ కుమారుడు సాధారణ వ్యక్తి అని తలంచక, శాక్యవంశాన్ని పునీతం చేసిన కారణజన్ముడని గుర్తించాలి! తాము కపిలవస్తు రాజ్యపౌరుల శ్రేయస్సును ఎలాగ కోరుకుంటారో అలాగే ఈ విశాల జగత్తులోని జనులందరూ ఆయన పౌరులు! వారి కోసమే సిద్ధార్థ గౌతముడిగా ఆయన పుట్టాడు, వారి కోసమే వెళ్ళారు!" అని చెప్పింది.

శుద్ధోదనుడు ఆ మాటలకు పరవశించి దుఃఖాన్ని అపుకొన్నాడు. యశోధర రాహులుడిని తాతకు అందిస్తూ, "ఇదిగో ఆయన ప్రతిబింబం!" అన్నది.

శుద్ధోదనుడు మనవణ్ణి చూస్తూ కుమారుణ్ణి తలంచుకొన్నాడు; అదే పసివయసు సిద్ధార్థుణ్ణి తనకు అప్పగించి మాయాదేవి మాయమై పోయింది.

సిద్ధార్థుడు త్వరలోనే కపిలవస్తుకు వస్తాడు—త్వరగా రావాలి! అని ఆ ఆశతోనే రాజ్యపాలన చేయసాగాడు.

యశోధర రాహులుణ్ణి ఆ తండ్రికి తగిన బిడ్డ అనిపించుకోవాలని కోరుకుంటూ పసితనం నుంచే మంచి శిక్షణతో తీర్చిదిద్దుతున్నది.

జీవ జగత్తును ఉద్ధరించగల సత్యాన్వేషణతో సిద్ధార్థుడు అనేక కష్టాల నెదుర్కొంటూ, శ్రమతమాదుల కోర్చి, అనేక ప్రాంతాలు తిరిగాడు. ఆకలిదప్పులతో శోషిల్లి ఒకచోట తెలివితప్పి పడిపోయాడు.

ఒక గోపాలకుడు అతనికి పాలుపోసి కాపాడాడు. అప్పుడే సిద్ధార్థుడికి ప్రాణ రక్షణ ఎంత గొప్పదో తెలిసింది. తోటి వారికి సేవచేయడం, సహాయపడడం మానవధర్మంగా గుర్తించాడు.

భిక్షువుగా దేశసంచారం చేస్తూ సన్యాసులను, యోగులను భిన్న భిన్న మార్గాలను అనుసరిస్తున్న వారినెందరినో కలుసుకొని ఎన్నో తెలుసుకున్నాడు. తపస్సు చేస్తే అన్నీ సిద్ధిస్తాయని వాళ్ళు నూరిపోశారు.

సిద్ధార్థుడు కఠోర తపోదీక్షలో ఉండగా నిండు చూలాలుగా ఉన్న సుజాత అనే గోపకాంత, తనకు కుమారుడు కలిగితే మళ్లీ దర్శిస్తానని మొక్కుకుంది. అలాగే ఆమె కుమారుణ్ణి కన్నది. మొక్కు చెల్లించుకోడానికి పాయసాన్నీ, పండ్లనూ పట్టుకొని పసివాడి నెత్తుకొని సుజాత బయలుదేరింది.

అప్పుడు సిద్ధార్థుడు బక్కచిక్కి బొమికలతో అతి నీరస స్థితిలో ఉన్నాడు. సుజాత యిచ్చిన పాయసాన్ని స్వీకరించి ప్రాణాన్ని నిలుపుకోగలిగాడు.

సుజాత అతనికి ప్రణమిల్లి, "స్వామీ, తమ దయవల్ల నాకు కుమారుడు కలిగాడు!" అని చెపుతూ సిద్ధార్థుడు వారిస్తూన్నా, పసివాణ్ణి అతని పాదాలకు తాకించింది.



అప్పుడు సిద్ధార్థుడు, "అమ్మా! నీవు తలంచినట్లుగా నేను మహిమాన్వితుణ్ణేమీ కాను; నీవు ఏ భావంతో నాకు ఆహారం పెట్టినా, నేను నిన్ను దయాస్వరూపిణిగా తలుస్తున్నాను. నీ వలన భూతదయను తెలుసుకున్నాను. నీవు నాకు ప్రాణభిక్ష చేసినట్లే ప్రకృతి సర్వ ప్రాణులను చల్లని దయతో సదా కాపాడుతున్నది. నీవు ఆ ప్రకృతితో సమానమైన తల్లివి!" అన్నాడు.

"స్వామీ! మీ గొప్ప మీరు చెప్పుకోడానికి యిష్టంలేక అలాగ అంటున్నారే గాని, మీరు నిజంగా మహిమాన్వితులే! నాకు తెలుసు! మాది గోపకులం. మీరు గొప్పవారు. మా ఇంటికి వచ్చి, మా



అతిథ్యాన్ని స్వీకరించి, బిడ్డను దీవించా లని కోరాలని ఉంది కాని, నే నెంతటి దాన్ని ?'' అని సుజాత అన్నది.

''అమ్మా! నిజమే చెబుతున్నాను, నా తపస్సు ఫలించలేదు. నేనూ మీవంటి వాణ్ణే. మానవుల్లో తరతమ భేదాలు పెట్టు కోవడం తగనిది. ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ అనుకోవలసిన అవసరమే లేదు. జీవులలోని ప్రాణమొక్కటే అయినట్లే, మానవత్వం అంతా ఒక్కటే! నేను కృతార్థుడినై నీ కుమారుణ్ణి ఆశీర్వదించ తగ్గ అర్హత నాకు వచ్చిననాడు తప్పక, నేను మీ ఇంటికి అతిథిగా వస్తాను!'' అని సిద్ధార్థుడు చెప్పాడు.

''స్వామీ! అలాగే తప్పక రావాలి!'' అంటూ సుజాత పిల్లవాణ్ణి అతని పాదా లకు తాకించి, ప్రణమిల్లి సెలవు తీసుకొని వెళ్ళింది.

సిద్ధార్థుడికి తపస్సులూ, కఠోరదీక్షల పట్ల నమ్మకం పోయింది. తపస్సులు చేస్తున్న వారందరిలో స్వప్రయోజన స్వార్థమే కనిపించిందిగాని తోటి జీవకోటి పట్ల ప్రేమగాని, సహకారంగాని కనిపించ లేదు. అవి శరీరాన్ని హింసించే ఆత్మ హత్యా సదృశంగా తోచాయి. అందువల్ల సిద్ధార్థ గౌతముడికి వాటితో నిమిత్తం లేక పోయింది.

తపస్సుపట్ల అతని విముఖతను చూసి తోటి సాధకులు గౌతముడు భ్రష్టుడై పోయాడని గేలిచేశారు.

కొందరు తపశ్శాలురు, సాధకులు అద్భుత శక్తులను మహిమలను సంపా దించి, ఇంద్రజాల విద్యతో సమానంగా వాటిని ఇతరులను ఆకర్షించి తమ చుట్టూ తిప్పుకొంటూ, అదే ఘనకార్యంగా పొంగి పోతున్నారేగాని, విశ్వమానవ శ్రేయస్సుకు అవి ఎంత మాత్రమూ పనికిరాకుండా పోతున్నాయి. ప్రకృతి ధర్మాల్ని అవి ఏమాత్రం మార్చలేక పోతున్నాయి. మహా మహులంతా కాలధర్మం పొందుతూనే ఉన్నారు.

అజ్ఞానంతో, మూఢ నమ్మకాలతో సతమతమౌతున్న జనులు ఎలాగ మారతారు?

యజ్ఞయాగాదుల పేరుతో మారణహోమాలు మితిమీరిపోతున్నవి.

రాజుల్ని మభ్యపెట్టి యజ్ఞయాగాల మిషతో విపరీత మాంసభుక్కులై అగ్రశ్రేణి వారు సమాజాన్ని మరింత కిందికి అణగదొక్కుతున్నారు.




ఇలాగ అనేక ఆలోచనలతో సిద్ధార్థుడు తర్కవితర్కాలతో నిమిత్తం లేని కర్తవ్య ధర్మం గురించి చింతిస్తూ, గయా క్షేత్రంలో ఒక పెద్ద రావిచెట్టు కింద కూర్చొని అంతర్ముఖుడై ఉండగా అతనికి జ్ఞానోదయమైంది.

ఆనాడు వైశాఖ పూర్ణిమ. చంద్రబింబం పరిపూర్ణమై ప్రకాశించినట్లే గౌతముడికి బుద్ధత్వము సిద్ధించింది; పరిపూర్ణ బుద్ధమూర్తిగా వికాసం పొందాడు.

సిద్ధార్థ గౌతముడికి జ్ఞానోదయం అయినప్పుడు అతను ఒక అనిర్వచనీయమైన అనుభూతిని పొందాడు. ఆ ధ్యానమగ్నావస్థనే గౌతమబుద్ధుడు 'నిర్వాణంగా' గుర్తించాడు.

వైశాఖ పూర్ణిమ బుద్ధపూర్ణిమగా పేరొందింది. రావిచెట్టు బోధివృక్షంగా పూజింపబడింది. బుద్ధుడు బోధిసత్వుడుగా పేర్కొనబడ్డాడు.

ప్రాణికోటిలో బుద్ధి విశేషత చేతనే మానవుడు ఉన్నతుడు అవుతున్నాడు. బుద్ధి వికాసం చేతనే మానవుడు తన్ను తాను ఉద్ధరించుకోగలడు. తోటివారిని ఉద్ధరించగలడు.. అహింసవల్లనే మానవుడు, మానవుడిగా బుద్ధుడు ఔతాడు. కోరికలు అరికట్టి, రాగద్వేషాలను వదిలి సుఖదుఃఖాలకు అతీతమైన నిర్వాణాన్ని అందుకుని బుద్ధత్వము పొందిన మానవుడు బుద్ధుడై, ఒక జ్యోతి అనేక జ్యోతులను వెలిగించినట్లే, అనేకులలో బుద్ధత్వము కలిగించితే, ఈ జగత్తు చీకటి నుండి వెలుగులోకి వస్తుంది. బుద్ధుడే జగత్తుకు జ్యోతి!



గౌతమబుద్ధుడు తాను తెలుసుకున్న సత్యాలను అందరికీ చెప్పసాగాడు. మొదట అతనిని గేలిచేసిన వారంతా అతని శిష్యులుగా, అనుయాయులుగా చేరారు.

బుద్ధుడు ప్రబోధించని ధర్మమనేది ఎక్కడాలేదు. ఉండదు. సామాన్య జనానికి అర్థమయ్యేలాగ అందరికీ ఆచరణసాధ్యమైన ధర్మాన్ని, ఉత్తమ జీవన సూత్రాలను ప్రచారం చేశాడు.

బుద్ధుని బోధలోని సత్యాన్ని గుర్తించి వేలాదిమంది అతని శిష్యులుగా చేరారు, అనుసరించారు. అహింసను పరమ ధర్మంగా బోధిస్తూ బుద్ధుడు దేశసంచారం చేస్తూండగా మగధ చక్రవర్తి బింబిసారుడు, బుద్ధుని ఉద్బోధతో ఉత్తేజితుడై వేలకువేలు జీవులు బలికానున్న యజ్ఞాన్ని విరమించుకొని, తన కిరీటాన్ని బుద్ధుని పాదాల ముందుంచి తన ప్రజలందరికీ బుద్ధధర్మాలను శిరోధార్యంగా చేశాడు.

బుద్ధుని బోధలు, సిద్ధాంతాలు, సూత్రాలు మొదలైనవన్నీ బౌద్ధధర్మంగా పేరొందింది. బౌద్ధధర్మావలంబులందరూ బౌద్ధులు అని పిలువబడ్డారు.

అజ్ఞానాంధకారంలో మునిగి ఉన్న జగత్తుకు దారిచూపిన జ్యోతిగా బుద్ధుడు నిలిచాడు. అహింసా జ్యోతిగా ధర్మచక్ర సంచాలనం చేస్తూ 'చక్రవర్తి'గా పిలువబడ్డాడు.

బుద్ధుడు దేశదేశాలు తిరిగి బౌద్ధ సంఘాలను ఏర్పాటుచేసి, సేవాధర్మాన్ని నెలకొల్పాడు. బౌద్ధ సన్యాసులందరూ సమాజ సేవకులై జన సామాన్యానికి సంస్కారాన్ని కలిగించారు.

అతని సంచార కార్యక్రమంలో మహా రాజులు అతనికి గొడుగులు పట్టారు. చక్రవర్తులు తమ కిరీటాలను అతని పాదాల ముందుంచారు. బుద్ధుడిని చక్రవర్తులకు చక్రవర్తిగా కీర్తిస్తూ, బుద్ధుని ఆదేశానుసారంగా ప్రజలను పాలించడంలో అహింసను, దయను అవలంబించారు. కులవివక్షతకు తావులేని బౌద్ధధర్మాన్ని

అన్ని రాజ్యాల్లోని జనబాహుళ్యం అవలంబించారు.

అప్పటికే పండితులు, పామరులు, జ్ఞానులు, రాజులు, చక్రవర్తులు బుద్ధుడిని దేవుడుగా భావించారు. బుద్ధ భగవానుడు అన్నారు. కాని బుద్ధుడు ఏవిధమైన ఆరాధననూ ఒప్పుకోలేదు. భక్తి, ఆరాధనలతో ప్రమేయంలేని సత్కర్మవల్లనే మానవులు నిర్వాణాన్ని అందుకోగలరని నొక్కి నొక్కి చెప్పాడు.

ఆరు సంవత్సరాల తర్వాత బుద్ధుడు కపిలవస్తు నగరానికి బయలుదేరాడు.

బుద్ధదేవుడు వస్తున్నాడన్న వార్త కపిలవస్తు నగరానికి చేరింది. ప్రజలు ఆనందోత్సాహాలతో ఉప్పొంగిపోయారు. స్వాగత సన్నాహాలు చేశారు.

శుద్ధోదనుడు సిద్ధార్థరాకుమారుడే వస్తున్నాడని ఆనందడోలికల్లో ఊగులాడుతున్నాడు.

"అమ్మా! నాన్నగారు వస్తున్నారట!" అంటూ రాహులుడు యశోధరతో పట్టలేని ఆనందంతో చెప్పాడు. రాహులిడికి ఆరేళ్లు నిండాయి.

"ఔను నాయనా, మీ నాయనగారు భిక్షువుగా వస్తున్నారు. ఆ చక్రవర్తికి మనం భిక్ష పెట్టాలి!" అన్నది యశోధర.

"ఏమిటీ! నాయనగారు చక్రవర్తా?" అన్నాడు కుమారుడు.

"ఔను, ఈ విశ్వానికే ఆయన చక్రవర్తి!" అన్నది తల్లి.

"మనవన్నీ ఆయనవేగా మరి!" అన్నాడు రాహులుడు.

"ఇవన్నీ మీ నాన్నగారికి అవసరం లేకనే విడిచి వెళ్ళారు. ఆయన చెప్పినట్లు నడుచుకోవడమే, ఆయనకు కావలసిన భిక్ష!" అన్నది యశోధర.

"అమ్మా! మనం అలాగే చేద్దాం! నేను నాన్నగారు ఏమి చెయ్యమంటే అదే చేస్తాను. నాన్నగారి వెనకనే నడుస్తాను!" అని రాహులుడు నిండుగా చెబుతూంటే, యశోధర ఆనందంతో రాహులుణ్ణి గాఢంగా కౌగిలించుకొన్నది.





# విష్ణు కథ

బుద్ధుని ఆగమనానికి కపిలవస్తునగరం స్వాగతశోభతో వెల్లివిరిసింది. ప్రపంచానికి జ్యోతిగా నిలిచిన బుద్ధదేవుడు తమ నగరానికి చెందినవాడైనందుకు పౌరులు పొందుతున్న ఆనందానికి అవధులు లేవు. తమకు ఏలికకావలసిన సిద్ధార్థ రాకుమారుడు, సర్వమానవాళి మానవతకు చక్రవర్తి అయినందుకు పొంగిపోతూన్న నిండు హృదయాలతో దారి పొడవునా పువ్వులు పేర్చారు.

కుమారుణ్ణి ఆలింగనం చేసుకోవడానికి వృద్ధుడైన శుద్ధోదన మహారాజు పితృహృదయం తహతహలాడుతున్నది.

బుద్ధుడు వస్తున్నాడు. అర్ధనిమీలిత నేత్రాలతో, శిరమువంచని గంభీరగమనంతో, నిశ్చల శాంతవదనంతో కరుణామూర్తిగా వస్తున్న అతని వెనుక, "బుద్ధం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి" అనే వాక్యాలతో అసంఖ్యాక జనసందోహం చేస్తున్న ధ్యానం, గంభీర సముద్ర ఘోషలా వినవస్తున్నది.

యశోధర, రాహులుడు, శుద్ధోదనుడు రాజప్రాసాదం సోపానాలు దిగి ఎదురు చూస్తున్నారు. చెన్నుడు ప్రాంగణం ముందుకొచ్చి నిల్చుని ఆనందాశ్రువులు రాల్చుతూ ఎదురు చూస్తున్నాడు.

బుద్ధుడు భిక్షాపాత్ర పట్టుకొని రాజప్రాసాదాన్ని చేరుకున్నాడు. రాహులుడు పరుగున వెళ్ళి తండ్రి పాదాలపై మోక



రిల్లాడు. యశోధర చిరకాలానికి కనిపించిన భర్త ప్రసన్నవదనాన్ని తదేకంగా చూస్తూ, అలాగే అతని ముందు మోకరిల్లింది. అతని పాదాలపై తలవాల్చి కన్నులతో అద్దుకొన్నది. ఆమె కళ్ళలోని మంచి ముత్యాల్లాంటి బాష్పజలం బుద్ధుని పాదాలను కడిగింది.

బుద్ధుణ్ణి ఆలింగనం చేసుకోవాలని చేతులు చాచివచ్చిన శుద్ధోదనుడు, అతని పరివ్రాజకరూపాన్నీ, భిక్షాపాత్రనూ చూసి అలాగే మతిపోయి నిశ్చేష్టుడైపోయాడు. ఆ వృద్ధరాజు మనస్సు భిక్షువుగా వచ్చిన కుమారుణ్ణి చూసి విలవిలలాడిపోయింది, కన్నీరు కారింది. ఆలింగనానికి చాపిన చేతులు చలనం లేకుండా అలాగే ఆగిపోయాయి.

"నాయనా! రాకుమారా! సిద్ధార్థా! గౌతమా! కుమారా! ఏమిటిది? ఏమిటిది?" అంటూ శుద్ధోదనుడు పిచ్చివాడిలాగ ఎలుగెత్తి వాపోతూ అలాగే కూలబడిపోయాడు, మూర్ఛపోయాడు.

బుద్ధుడు తండ్రి తలను ఒడిలో పెట్టుకొని, తన కాషాయ ఉత్తరీయంతో వీవన విసిరాడు. కుమారునిస్పర్శతో శుద్ధోదనుడు తెప్పరిల్లాడు. "తండ్రీ! ప్రణామములు! నేను సిద్ధించిన అర్థముగలవాడిగా సిద్ధార్థుడినై వచ్చాను!" అని అంటున్న బుద్ధుని మాటలు అమృతంలాగ వినిపించాయి. అతని అరమోడ్పు కన్నులు వెన్నెల జల్లుతున్నవి. బుద్ధుని ముఖంలో దివ్యతేజస్సు కనిపించింది. అనిర్వచనీయమైన ప్రభావమేదో శుద్ధోదనుణ్ణి ఉత్తేజితుణ్ణి చేసింది. అశాంతి నుండి శాంతికి, చీకటి నుండి వెలుగుకు, భ్రమ నుండి సత్యానికి తీసుకువెళ్ళింది. బుద్ధం శరణం గచ్ఛామి! అనే మాటలు చెవుల్లో మారుమ్రోగుతున్నాయి. శుద్ధోదనుడు అదే అంటున్నాడు. రాహులుడు కూడా అలాగే పలుకుతున్నాడు. ప్రజానీకం అలాగే ఘోషిస్తున్నది. యశోధర కన్నులు మూసుకొని; గుండెపై చేతులుంచుకొని

ధ్యానముద్రలో 'బుద్ధం శరణం గచ్ఛామి' అని జపిస్తున్నది.

అప్పుడు బుద్ధుడు రాహులుడి తల నిమిరి, "కుమారా! నీవు కూడా బుద్ధుడివై ధర్మాన్ని, సంఘాన్ని అనుసరిస్తూ మానవతకు సార్థకత చేకూరుస్తావని ఆశీర్వదిస్తున్నాను! బుద్ధుడంటే ఎవరో తెలుసా? నీవనుకున్నట్లుగా, నేను మాత్రమే బుద్ధుడిని కాను! ఉత్తమ ధర్మాలను, అహింసను ఆచరించే వారందరూ బుద్ధులే! బుద్ధత్వమే మానవత్వం! బుద్ధత్వం పొందిన మానవుడే బుద్ధుడు. అటువంటి మానవజన్మను సార్థకం చేసుకున్న బుద్ధుడే యీ లోకానికి కావలసినవాడు, జీవకోటికి శరణ్యం! బుద్ధులు ఉపదేశించిన ధర్మాలే మానవాళికి నిజమైన శాంతినిస్తాయి. ధర్మమే లోకానికి శరణ్యం! బుద్ధులతో కూడిన సంఘమే యీ జగత్తుకు శరణ్యం!" అని చెప్పాడు.

యశోధర కనులు విప్పి బుద్ధుణ్ణి నిశ్చలంగా చూస్తూ, "స్వామీ! నన్ను మీకు భిక్షగా సమర్పించుకుంటున్నాను. ఇంతవరకు నేను గృహిణిని. ఇప్పుడు నేను మానవసేవా ధర్మానికి అంకితమౌతున్న పరివ్రాజికను. మీ అడుగు జాడల్లోనే జీవించడం నా ధర్మం. స్త్రీలకు బౌద్ధ



సంఘంలో అర్హతను, స్థానాన్ని ప్రసాదించండి!" అని అర్థిస్తూ భక్తితో ప్రణమిల్లింది.

ఆ విధంగా యశోధర బౌద్ధధర్మాన్ని స్వీకరించిన మొదటి మహిళ అయింది.

ఆనందబాష్పాలు కార్చుతూ, తనను ఒక పెన్నిధిగా, దేవుడిగా ఆరాధనా భావంతో చేతులు జోడించి ఉన్న చెన్నుడిని బుద్ధుడు చూసి ఆప్యాయంగా దగ్గరకు తీసుకుంటూండగా, చెన్నుడు నమస్కరించబోతూంటే వారిస్తూ బుద్ధుడు, "చెన్నా! ఎంత గొప్పవారైపోయినప్పటికీ పిన్నలే పెద్దలను గౌరవించాలి, పూజించాలి. నువ్వు నాకు



యిప్పటికీ పూజనీయుడివి. నన్ను యీ కపిలవస్తు నుండి విశాల విశ్వంలోకి దాటించిన పుణ్యమూర్తివి కదా! నేను తెలుసుకొన్న సత్యాల్ని, ధర్మాన్ని చెప్పినంత మాత్రాన నన్ను భగవానుడని అనుకోవడం గాని, భగవానుడని ఆరాధించడం గాని, నేను యిష్టపడను. వ్యక్తి ఆరాధన అనవసరమైనది. భగవానుడనే భావన కూడా అంతే! మానవ ధర్మాన్ని ఆచరించడమే కావలసినది!'' అన్నాడు.

బుద్ధుని మాటలకు చెన్నుడు అర్థిస్తున్నట్లుగా, ''బుద్ధభగవానుడు''—అని అనుకోవడంలోనే మాకు ఎంతో తృప్తి. ధర్మాచరణపట్ల, సంఘసేవపట్ల అకుంఠిత భక్తి విశ్వాసాలు కలుగుతున్నవి. బలమైన అనుబంధాన్ని నిలుపుతున్నవి. కనుక, నిన్ను భగవానుడని ఆరాధనా భావంతో చూసుకోవడానికి, పిలుచుకోవడానికి మాకు గల స్వేచ్ఛను కాదనక అలాగే ఉండనియ్యి!'' అన్నాడు.

అప్పట్నించి బుద్ధుడు బుద్ధభగవానుడుగా పిలువబడ్డాడు. బుద్ధదేవుడనిపించుకున్నాడు. ఉత్తమ మానవుడే దేవుడు! అనే అర్థంగా బుద్ధుడు దానికి తటస్థంగా ఊరుకున్నాడు.

శాక్య వంశంలో కొద్దిమంది తప్ప అందరూ బౌద్ధ ధర్మాన్ని స్వీకరించారు. బుద్ధుని ఆదేశాలను, ఉపదేశాలను ప్రచారం చేశారు, భిక్షువులుగా మారారు. సంపదలను సంఘానికి అర్పించారు. సేవకు అంకితమయ్యారు.

తొలినుంచీ ప్రత్యర్థిగా ఉన్న దేవదత్తుడు మాత్రం స్పర్థతో బౌద్ధధర్మాన్ని నిరసిస్తూ, బుద్ధుని మార్గానికి వ్యతిరేకులైన వారిని కూడగట్టుకొని వెళ్ళాడు.

కపిలవస్తు నగరం నుండి బుద్ధుడు తిరిగి ప్రయాణమయ్యాడు. అతని అనుయాయులతో, శిష్యులతో బాటు యశోధర, రాహులుడు కూడా వెంట వెళ్ళారు.

ఆ తిరుగు ప్రయాణంలో బుద్ధుడు సుజాత ఇంటికి భిక్షువుగా వెళ్ళాడు.



సుజాత కుమారుణ్ణి ఆశీర్వదించి బుద్ధుడు రాహులుడితో, "రాహులా! ఈ సుజాతుడు నీకు తమ్ముడు. మీరు స్నేహితులై, అప్తులై, సోదరులై వర్ణవిభేదాలకు అతీతమైన మానవత్వాన్ని, వసుధైక కుటుంబాన్ని ప్రపంచానికి ప్రబోధించండి!" అని చెప్పాడు.

సుజాత బుద్ధుని శిష్యురాలిగా యశోధరకు తోడు కలిసింది. గృహిణులుగా ఉంటూనే స్త్రీలు బౌద్ధ ధర్మాన్ని అవలంబించి, పిల్లలను ఉత్తమ మానవులుగా తీర్చిదిద్దే మాతృమూర్తులై ఉండాలని నారీ లోకానికి బోధించి ధర్మసంచాలనం చేయవలసిందని యశోధర, సుజాతలకు ఆదేశించాడు.

బుద్ధుడు తన అనువర్తులైన శిష్యులందర్నీ ధర్మచక్ర సంచాలనకు నలుదిక్కులకూ పంపించి, యశోధరను, రాహులుణ్ణి కపిలవస్తు నగరానికి వెళ్ళి వృద్ధుడైన శుద్ధోదనుడిని కనిపెట్టుకొని, శాక్యవంశాన్ని ధర్మమార్గాన నడపమని చెప్పి పంపాడు.

బుద్ధుడు ఒంటరిగా అరణ్యమార్గం పట్టాడు. ఘోరారణ్యంలో, ఘోరాతి ఘోరుడై, క్రూరత్వానికి మారుపేరైన 'అంగుళిమాలి' అనే దోపిడి దొంగ ఉన్నాడు. మనుష్యుల చేతిబొటనవ్రేళ్లు దండగా గుచ్చి మెడలో వేసుకున్నాడు. ఆ బొటనవ్రేళ్ళు అతనికి భయపడి దాసోహం అని ప్రాణాలు దక్కించుకొన్నవారివీ, అతనిచేత చంపబడినవారివీను.

తనకు భయపడనివాడంటూ యీ భూమ్మీద ఉండలేడనిపించుకోవాలని అంగుళిమాలి ఉద్దేశం.

దారిలో కొందరు గొర్రెల కాపరులు బుద్ధుణ్ణి చూసి, "స్వామీ! అటుగా వెళుతున్నారా? ఆ దారిన నలభైయాభై మందికి తక్కువ సంఖ్యలో వెళ్ళడానికి ఎవరూ సాహసించరు. అక్కడ అతి భయంకరుడైన గజదొంగ ఉన్నాడు.




ఒంటరిగా చిక్కినవారందరి ప్రాణాలూ తీస్తాడు!" అన్నారు.

కాని బుద్ధుడు ఆ గొర్రెల కాపరుల హెచ్చరికలు లక్ష్యపెట్టకుండా అరణ్యంలో ముందుకు నడిచాడు.

ఒంటరిగా ఎదురుగా వస్తున్న బుద్ధుణ్ణి అంగుళిమాలి దూరంనుంచి చూశాడు. కాషాయవస్త్రం కప్పి అతడేదో దాస్తున్నాడు.

అంగుళిమాలి భయంకరమైన రక్తపు మరకలతో తళతళ మెరుస్తున్న తన పెద్ద కత్తిని ఎత్తి ఝుళిపిస్తూ, "ఎవర్నువ్వు? ఏమిటో దాస్తున్నావు. దాన్నిలా యివ్వు!" అని ఆజ్ఞాపించాడు.

బుద్ధుడు చిరునవ్వుతో కావిగుడ్డ మాటున దాచిన భిక్షాపాత్రను తీసి అంగుళిమాలికి యిచ్చాడు.

అంగుళిమాలి దాన్ని పట్టుకొని తిప్పి తిప్పి చూసి, "భిక్షాపాత్ర! నీవు బిచ్చగాడివైతే అయ్యావుగాని, నన్ను వెతుక్కుంటూ వస్తున్నట్లుగా వచ్చి, ఎదురు నిల్చి చిరునవ్వు చిందిస్తూ, నా చేతికి ఒట్టి చిప్ప అందించడానికి నీకెన్ని గుండెలు! నీకు భయం లేదా? నేనెవర్నో తెలుసా?" అన్నాడు.

"నువ్వు మనిషివి. నేను మనిషిని. ఎందుకు భయపడాలి?" అన్నాడు బుద్ధుడు.

"నువ్వు నాకు భయపడి, బుద్ధిగా నీ బొటన వ్రేలు యిచ్చి ప్రాణాలు దక్కించుకొని ఇక్కడి నుంచి వెళ్ళు; లేదా ఇప్పుడే నిన్ను చంపుతాను; తర్వాత నీ బొటనవేలు తీసుకొని మాలలో కలుపుతాను!" అన్నాడు దొంగ.

"నువ్వు నన్ను చంపుతావు, అంతే కద! ఎపుడో ఒకప్పుడు, ఏదో ఒకలాగ చావు తప్పదుకదా! చంపు, సంతోషంగా చావడానికి యిష్టపడుతున్నాను. ఈ రోజు నన్ను చంపుతావు, రేపు నువ్వు చస్తావు. నాలాగ నిశ్చింతగా నవ్వుతూ మృత్యువును స్వీకరించగలవా? నేను ఏ ప్రాణికీ హాని

కలిగించలేదు, అనే తృప్తితో ఆనందంగా, నీ కత్తికి తల ఒగ్గగలను. నీకు చావు దగ్గిర పడినప్పుడు, నాలాగ ఆనందంగా ఉండగలవా? చెప్పు!...'' అన్నాడు బుద్ధుడు.

ఆ మాటలతో అంగుళిమాలి తల తిరిగి పోయింది. ఆలోచనలో పడ్డాడు. తాను చేసిన ఘోరాలన్నీ తలచుకొని భయంతో కంపించి పోయాడు. తన పాపానికి ప్రాయశ్చిత్తం లేదు! మహాపాపి అయిన తనను క్షమించగలవాడు ఎవడు? ఎవడా దయాళువు? దొంగకు ఆ వేదనలో బుద్ధుడు స్ఫురించాడు. అదివరకు బుద్ధుడి గురించి ఎంతో విన్నాడు. పులిని, లేడిని, పామును, కప్పను ఒకేలాగ చూసే కరుణామూర్తి అని విన్నాడు. ఆ బుద్ధుడే తనకు దిక్కు! అనుకొంటూ 'బుద్ధం శరణం గచ్ఛామి!' అని తనలో అను కుంటున్నట్లుగా పలికాడు!

''అంగుళిమాలీ! నేనే ఆ బుద్ధుణ్ణి! నీ కోసమే వచ్చాను. అందుకే, నీకు భిక్షాపాత్రను అందించాను. గత జీవి తాన్ని మరిచిపో! బౌద్ధ భిక్షువుగా నా శిష్యుడుగా నాతో రా! పద పోదాం!'' అన్నాడు బుద్ధుడు.

"బుద్ధభగవానుడా!" అంటూ అంగుళి మాలి బుద్ధుడి పాదాలపై పడి, ''నేనొక్కడినే బాగు చూసుకోవడం సరి కాదు. నా అనుచరులందరూ నీ శిష్యులు-భిక్షువులు!'' అంటూ అంగుళిమాలి తన వారినందరినీ పిలిచి, తనలాగే అందరినీ అనుగ్రహించవలసిందని బుద్ధుణ్ణి వేడు కున్నాడు.

అంగుళిమాలి, అతని అనుచరులు పలువురు బౌద్ధ భిక్షువులై బుద్ధుని వెంట వెళ్ళారు.

బుద్ధుని ఉపదేశాలను విని ఎందరెందరో అధర్మపరులు, దుర్మార్గులు తమ గతాన్ని ఏవగించుకుని పశ్చాత్తాప్తులై బుద్ధుని శిష్యులై, భిక్షువులై, సంఘసేవకు అంకితమై, శేషజీవితాల్ని పునీతం చేసు కున్నారు.






అహింసను, శాంతియుత జీవనాన్ని, కుల వర్గ రహితమైన సంఘాన్ని ప్రబోధించే బౌద్ధధర్మం మహావృక్షం లాగ సర్వత్రా వ్యాపిస్తున్నది.

జీవకోటిని ఉద్ధరించే కరుణామూర్తిగా వచ్చిన 'తథాగతుడు' అని, 'బోధి సత్వుడు' అని భగవానుడుగా కీర్తింప బడుతున్న బుద్ధుడి ఔన్నత్యం హిమాలయం లాగ పెరిగింది. బుద్ధుడి ఆజన్మ వైరి దేవదత్తుడి అసూయా ద్వేషాలు మరింత పెరిగాయి.

బుద్ధుడు వృద్ధాప్యంలో కూడా దీక్షతో వాడవాడలా తిరుగుతూ సమాజంలో హీనకులాల వాళ్ళని, నిర్భాగ్యులను, అగ్రవర్ణాలవారి చేత అక్రమాలకు, అవమానాలకు గురి అవుతున్న దళితులను తన ప్రబోధంతో సంస్కారవంతుల్నిగా చేస్తూ ప్రియశిష్యులుగా చేసుకుంటు న్నాడు. ఇది కక్షసాధించడానికి దేవదత్తుడికి మంచి అదనుగా కనిపించింది.

బుద్ధుడికి ప్రతికూలంగా ఉన్నవారి నందరినీ కూడగట్టుకొని ఎన్నో ప్రతిఘటనలు చేశాడు. తంత్రాలు పన్నాడు.

దేవదత్తుడు బుద్ధుడిని ఎదుర్కొని; ''అహింసను బోధించావు, బాగానే ఉంది కాని, బౌద్ధభిక్షువులు మాంసాహారాన్ని ముట్టరాదనీ, బౌద్ధధర్మాన్ని స్వీకరించి నీ శిష్యులైనవారు, ఆహారనియమం పాటించాలనీ ఎందుకు కట్టడి చెయ్యలేదు?'' అన్నాడు.



బుద్ధుడు, "నాయనా, దేవదత్తా! బౌద్ధ ధర్మావలంబకులు అహింసను అవలంబిం చాలని చెప్పనే చెప్పాను. పేదరికం చేత చాలామంది ఏది దొరికితే అది తిని, మాంసాహారులుగానే ఉండవలసి వస్తున్నది. ధనికవర్గానికి లభించే మంచి బలకరమైన శాకాహారాలు పేదప్రజానీ కానికి అందుబాటులో ఉండవు కదా! మానవ సేవాధర్మాన్ని నిర్వర్తించడమే ప్రధానమైన బౌద్ధభిక్షువులు, ప్రాణ పోషణకు మాత్రమే ఆహారం తీసుకొనక తప్పదు. వారు తిండి అడుక్కుంటారు. వారికి కబళం వేసేవారు మాంసాహారులు కారాదనీ, శాకాహారులు మాత్రమే అయి ఉండాలనీ శాసించే అధికారం నాకు లేదు. మాంసాహారులనీ, శాకాహారులనీ విడదీసి భిక్షకు వెళ్ళడం కులవర్గాలకు అతీతమైన సర్వసమతను కోరే బౌద్ధ ధర్మానికి విరుద్ధమైనది. బౌద్ధభిక్షువులు వివక్షతకు దారి తీయకుండా ఉండాలని కోరుతున్నాను. భిక్షకు వెళ్ళినవాడు ఎవరేది పెట్టినా స్వీకరించక తప్పదు!" అన్నాడు.

"భిక్షకు వెళ్ళినవాడు ఎవరేది పెడితే అది తినాల్సిందే అంటావు! ఔనా?" అని నిలదీశాడు దేవదత్తుడు.

బుద్ధుడు చిరునవ్వుతో, "ఎవరు ఎటు వంటి ఆహారంతో జీవనం గడుపుతున్నారో దాన్నే కబళం పెట్టినప్పుడు కులవర్గ భేదాలు లేని భిక్షువు దాన్ని తినడం భిక్షుక ధర్మమే కదా మరి!" అన్నాడు.

బుద్ధుడి మాటలకు దేవదత్తుడు తల పంకిస్తూ వెళ్ళాడు.

"బుద్ధుడు అంతమొందాలి! లేకుంటే వృద్ధాప్యాన్నీ, అరోగ్యాన్నీ లెక్క చేయ కుండా యింకా ప్రబోధం సాగిస్తూనే ఉంటాడు. హీనజాతుల వారి నందర్నీ జ్ఞానవంతులుగా చేస్తూ, బౌద్ధులుగా చేర్చు కుంటూనే ఉంటాడు. అణిగిమణిగి ఉండవలసిన దళితులు తెలివి మీరితే, అగ్రవర్ణాలకు పుట్టగతులుండవు: చాకిరీ



చేసేవారుండరు! అంచేత బుద్ధుడు లేకుండా చెయ్యాలి!" అని అనుకుంటూ దేవదత్తుడు జీవకుడి దగ్గిరికి వెళ్ళాడు.

జీవకుడు హీనకులానికి చెందిన బుద్ధుని శిష్యుడు. బౌద్ధధర్మంపట్ల అమిత విశ్వాసంతో బుద్ధుణ్ణి దేవుడుగా భావిస్తూ వున్నాడు.

దేవదత్తుడు జీవకుణ్ణి ప్రలోభ పెట్టి. మాయ మాటలతో చేరదీసుకున్నాడు.

"బుద్ధుడు చెప్పేవన్నీ వొట్టికబుర్లు. మీ వర్గాన్ని తన వలలో వేసుకోడానికి అంతా సమానులే అంటున్నాడు గాని మీలాగే జీవించగలడా? మీరు తింటున్నదే తినగలడా?" అంటూ జీవకుడి మనసు విరిచి విషబీజాన్ని నాటాడు. బుద్ధుడిని భిక్షకు ఆహ్వానించి చూడమని బాగా నూరిపోశాడు.

జీవకుడు వెళ్ళి బుద్ధుడిని తన ఇంటికి భిక్షకు వచ్చి తన ఆతిథ్యాన్ని స్వీకరించవలసిందిగా కోరాడు. బుద్ధుడు జీవకుడి వెంట వెళ్ళాడు. దేవదత్తుడు ప్రచ్ఛన్నంగా కనిపెడుతున్నాడు.

జీవకుడు పిల్చుకొచ్చాడే గాని. తినడానికి వచ్చిన బుద్ధుడికి కబళం పెట్టడానికి తటపటాయిస్తూంటే బుద్ధుడు, "నాయనా, జీవకా, ప్రత్యేకంగా నాకోసం ఏమీ సిద్ధపరిచి ఉంచలేదని సందేహించకు; నువ్వు తినేదే నాకు యింత పెట్టు. నీభిక్షను నమ్ముకుని వచ్చాను!" అన్నాడు.

జీవకుడు బుద్ధుడికి వణుకుతున్న చేతులతో కబళం పెట్టాడు. బుద్ధుడు దాన్ని తృప్తిగా తిన్నాడు.

అప్పటికే బుద్ధుడి ఆరోగ్యం సరిలేదు. వృద్ధాప్యం ముదిరి జీర్ణశక్తి తగ్గి వున్నది. జీవకుడు పెట్టిన భిక్ష మాంసంతో తయారైనది. అది కూడా అంతమంచిది కాదు.

బుద్ధుడు జీవకుణ్ణి ఆశీర్వదించి వెళ్ళాడు. జీవకుడిలో పాపభీతి మొదలైంది. ముఖం దోషికిమల్లే ముడుచుకుపోతున్నది. చాటుగా కనిపెడుతున్న దేవదత్తుడు, బుద్ధుని సత్యవర్తనకు విస్తు



దగ్గిర మోకరిల్లి మన్నించమని వేడుకొంటు
న్నట్లు వెర్రిచూపులు చూస్తున్నారు.

బుద్ధుడు వారి రాకను గ్రహించి కనులు తెరిచి ప్రీతిగా చూసి, ఇద్దర్నీ దగ్గిరికి చేరపిల్చి, "మీరు చింతించవలసిందేమీ లేదు; ఏదో ఒక విధంగా మరణం తప్ప రానిదే కదా! నేను నిర్వాణాన్ని చేరుకోడానికి సాయపడ్డారు. కృతజ్ఞుణ్ణి! నిర్వాణము చర్మచక్షువులకి కనిపించని వెలుగు. జ్యోతి అరిపోతున్నప్పుడు వెలుగు ఎక్కడికి వెళుతున్నదో ఆ నిర్వాణ పథాన్ని చేరుతున్నాను," అన్నాడు.

దేవదత్తుడిలో గొప్ప పరివర్తన కలిగింది. బుద్ధుని పాదాలు తాకడానికి అనుజ్ఞ కోరాడు. బుద్ధుడు అతణ్ణి చేరబిల్చి భుజం మీద చేయివేసి, "నాయనా, దేవదత్తా! బుద్ధిని మానవ శ్రేయస్సుకి వినియోగించి శ్రమించినవాడే బుద్ధుడు; ఆ బుద్ధుడికి చావులేదు! మానవుల కోసం అవతరించే మహాత్ములందరూ బుద్ధులే! జ్ఞాతివైరంతో వ్యక్తిగతంగా నన్ను ద్వేషించావే గాని ధర్మాన్ని ద్వేషించలేవు! నీ ద్వేషాన్ని నాతోనే సరిపుచ్చి, నేను వెళ్తున్నాను గనుక నువ్వే నా స్థానంలో ఉన్నావనుకో! మన సోదరులు ఆనందుడు, నందుడు మొదలైన వారంతా రాజభోగాల్ని వదలి బౌద్ధ భిక్షువులై మానవ సేవకు అంకిత

పోతూనే, తలపెట్టిన ద్రోహానికి నొచ్చుకోవడం మొదలైంది.

సరిపడని ఆహారం విషతుల్యమై బుద్ధుడిని రోగగ్రస్తుణ్ణి జేసింది. రోజు రోజుకీ క్షీణించి పోతున్న బుద్ధుడు అవసాన దశకు వచ్చాడు.

బుద్ధుడు శయనించి ఉన్న వేదిక చుట్టూరా ప్రధానశిష్యులు తలలు వంచి మౌనంగా విచారంలో మునిగి ఉన్నారు. పరిసరమంతా స్తంభించి నిశ్శబ్దంగా ఉన్నది. అప్పుడు అక్కడికి దోషులుగా తలలు వాల్చుకొని తడబడే నడకతో జీవకుడు, దేవదత్తుడు పశ్చాత్తాపంతో కుమిలిపోతూ వచ్చి బుద్ధుని పాదాల



మయ్యారు. నన్నే అనుసరించి నువ్వూ అలాగే బౌద్ధ ధర్మాన్ని అనువర్తించి వ్యాప్తి చెయ్యి. బౌద్ధ సంఘారామాల్ని, బౌద్ధబిక్షువులను తీర్చిదిద్ది సక్రమమార్గాన నడిపించు! అందుకు నీవు సమర్థుడివి!'' అంటూ దేవదత్తుడి తలపై చేతి నుంచి, ఆశీర్వదిస్తూ అర్థిస్తున్నట్లుగా చెప్పాడు.

దేవదత్తుడు పులకాంకితుడై మేను మరిచి కన్నులు మూసి, 'బుద్ధంశరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి' అని మూడు సార్లు జపించి, ''హే బుద్ధభగవానుడా! మానవుడే దేవుడుగా మారే దారి చూపి, వేరే భగవంతుడి గురించిన ఆలోచనకు తావులేని ఉన్నత ధర్మాన్ని బోధించిన నువ్వే భగవానుడివి!'' అన్నాడు. చేతులెత్తి మ్రొక్కాడు.

అనాడు కూడా వైశాఖ పూర్ణిమ. నిండు చంద్రుడు తూర్పున ప్రకాశిస్తున్నాడు. ప్రపంచపు తూర్పున ఉదయించిన ప్రాగ్జ్యోతిగా కీర్తింపబడిన బుద్ధ భగవానుడు నిర్వాణం పొందాడు. పూర్ణ చంద్రబింబం మరింత తేజోవంతంగా ఆకాశమధ్యాన ప్రకాశిస్తూ వెన్నెల వెదజల్లుతున్నది.

బుద్ధుని అనంతరం బుద్ధుడు ప్రబోధించిన ధర్మాలు, సూత్రాలు బౌద్ధమతంగా రూపొందినై. బుద్ధుడు దేవుడిగా ఆరాధింపబడ్డాడు, అవతారమూర్తిగా గుర్తించబడ్డాడు.

సూతుడు బుద్ధావతారం ముగించి, దశావతారాల్లో చివరిదైన పదియవ అవతారం కల్క్యవతారం గురించి చెప్పనారంభించాడు:

కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలు నాలుగూ కలిసి ఒక మహాయుగం.

ప్రతి మహాయుగం అంతంలో, కలియుగం చివరిదశలో కలి ప్రభావం తారాస్థాయి నందుకున్నప్పుడు లోకం గొప్ప సంక్షోభంలో పడుతుంది.

'దేవుడనేవాడున్నాడా?' అని ఒకవంక అనిపిస్తూ ఉంటే వేరొకవంక 'మనుమ

లనేవారున్నారా?' అని అనిపిస్తున్న సమయం అది.

ఏకత్వం నుంచి భిన్నత్వంలో మానవ సంఘం ఛిన్నాభిన్నమై వర్గాలు, వర్గకలహాలు, జాతులు, జాతివైషమ్యాలు, దౌర్జన్యం, దురధికారం, హింస పెచ్చు పెరిగిపోయి మంచివాళ్ళకి నిలువ నీడ లేకుండా పోతుంది.

పాలకులు రాక్షసులెంతో మంచివాళ్ళు అనిపిస్తున్నారు. ఒకర్నొకరు అన్నివిధాలా దోచుకోవడమే జీవనపరమార్థంగా, మనుషులు క్రూరమృగాలను మించి పోతున్నారు. మత దురహంకారులు పిశాచాలై పోతున్నారు.

మేధావుల మేధస్సు విధ్వంసానికి దోహదం చేస్తున్నది. కోట్లానుకోట్ల జనులు ఒక్కసారిగా నిర్మూలమయ్యే సాధనాలు వచ్చాయి. భూతలం మలమల మాడిపోగల పరిణామాలు వచ్చాయి. అందువల్ల గ్రహాలు వక్రంగా తిరగసాగాయి. ప్రకృతి ధర్మాలన్నీ అస్తవ్యస్తంగా తయారైనాయి. భూమాత విలపిస్తున్నది!

అటువంటి సంకటస్థితిలో దండనీతి తప్ప వేరే మార్గం లేదని విష్ణువు దుర్మార్గుల్ని నరికి సన్మార్గులకు వసతి కల్గించడానికి కల్కిమూర్తిగా అవతరిస్తాడు. అదే కల్క్యవతార అవతరణం.



శివుడు తన అంశతో గొప్ప తెల్లని గుర్రాన్ని కల్పించి కల్కిమూర్తికి యిస్తాడు. ఆ మహాశ్వం కాలగమనాన్ని మించిన వేగంతో తెల్లని ధూమాన్ని నిశ్వాసంగా విడుస్తూ ధూమకేతువులా ఆకాశగమనం చేయగల్గుతూ గ్రహాంతరాలకు దౌడు తీయగల్గుతుంది.

ఆ గుర్రం మీద కల్కిమూర్తి అధిరోహించి, ఆకాశాన్ని అంటే పెద్ద కత్తిని ధరించి దుష్టశక్తుల్ని హతమార్చడానికి బయలుదేరుతాడు. ప్రళయ మేఘాలలోని విద్యుత్తుతో తయారైన అతని కత్తి మెరుపులాగ నింగి నుండి నేలకు జారుతూ దుష్టఖండనం చేస్తుంది.

కల్క్యవతారమూర్తి యోధునివలె ధగధగలాడే కవచాన్ని ఆపాదమస్తకం ధరించి మంచివాళ్ళకు దివ్యసుందరమూర్తిగానూ, దుర్జనులకు మహాభయంకరమూర్తిగానూ కనిపిస్తాడు.

విష్ణువు యెత్తిన కల్క్యవతారం దేశభేదాల్నిబట్టి అనేక దేశాల్లో అనేక విధాలైన రూపభేదాలతో స్వారిసాగిస్తూ అవతరించిన పనిని నెరవేరుస్తాడు.

కల్కిమూర్తి ధాటికి కలిప్రభావం నులుచుకుపోతూ పారిపోతూంటే, తన దీర్ఘనిశిత కరవాలంతో తరుముతూ లోకంలోని దుర్మార్గుల్నీ, ఘాతుకవర్గాలనూ, లోకసంక్షోభకారులైన పాలకులనూ, వర్గాలనూ అంతమొందిస్తూ సజ్జనులకు రక్షణ కల్పిస్తాడు.

కల్కి అవతరణంతో కొత్త మహాయుగానికి నాంది జరుగుతుంది. గ్రహగతులు సక్రమమార్గాలుపడతాయి.

భూదేవి కల్కి అవతారుడైన విష్ణుదేవుడికి నివాళిపట్టి అనేక విధాలుగా స్తుతి చేస్తూండగా బ్రహ్మాదిదేవతలు, సప్తర్షులు పూలజల్లు కురిపిస్తూ కీర్తిస్తుంటారు. నారదుడు మహతిపై సామగానాన్ని వినిపిస్తుంటాడు.

భూమ్మీద నిరంకుశ రాజ్యపాలనలు, దౌర్జన్యము, అధర్మము నశించి శాంతి నెలకొల్పే కల్కిమూర్తి మానవకోటిని భిన్నత్వంనుంచి ఏకత్వానికి, శాంతియుతమైన సహజీవనానికి మళ్ళిస్తాడు. కృతయుగం మొగ్గతొడిగి మరొక మహాయుగం ప్రారంభమౌతుంది. కల్కిరూపాన్ని ఉపసంహరించుకొని విష్ణువు అంతటా వ్యాపించి విశ్వస్థితికి మూలమై నిలుస్తాడు.

విష్ణువు అనగా వ్యాపించేవాడు అని నిర్వచనం. సర్వవ్యాపకుడైన విష్ణువు పరిణామస్వరూపుడు. కాలమే అతని ఉనికి. ఈ మహావిశ్వమే అతని పరిపూర్ణస్వరూపం—అని చెప్తూ సూతమహర్షి దశావతారాలు ప్రధానంగా గల విష్ణుకథను సమగ్రసంపూర్ణం చేశాడు.

—(సమాప్తం)

